సెప్టెంబరు 2016
రూ. 15/-

# చతుర



ఊర్వశి రతాల
సౌందర్య రహస్యం ..122

# ఆరడుగుల ఆవు!

ఈ ఆవు ఎత్తు ఎంతో తెలుసా? అక్షరాలా ఆరడుగుల నాలుగు అంగుళాలు! ఆశ్చర్యంగా ఉంది కదూ.. ఈ విషయం తెలిసి గిన్నిస్ వరల్డ్ రికార్డ్స్ వాళ్లు 2014లో దాని ఎత్తు కొలిచి, ప్రపంచంలోని ఆవులన్నిటికంటే ఎత్తయిన ఆవుగా గుర్తించారు. గిన్నిస్ బుక్‌లో నమోదు కూడా చేశారు. అయితే ఎత్తయిన ఆవుగా గుర్తించిన కొన్ని నెలలకే కాలికి గాయమై ఆ ఆవు చనిపోయింది. అప్పటికి దాని వయసు 13 సంవత్సరాలట!

వారెవ్వా!

# ముఖచిత్రంగా మీ ముఖారవిందం!




క్యూట్ క్యూట్ బేబీస్, యూత్‌ఫుల్ లేడీస్‌కు ప్రాధాన్యం
అందం, ఆకర్షణ, తగిన డ్రస్‌సెన్స్ ఉంటే చాలు...
**మీ అభిమాన చతుర /విపులకు మీరే ముఖచిత్రం అవుతారు**
చేయాల్సిందల్లా - పోస్ట్‌కార్డ్ సైజ్ క్లోజప్పులు రెండు,
అదే సైజ్ 3/4 ఫొటో ఒకటి వెంటనే మాకు పంపండి.
ఫొటోలు మెయిల్ కూడా చేయొచ్చు

**నోట్ : ఫొటోల ఎంపికలో తుది నిర్ణయం సంపాదకులదే.**
**ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు, వాదవివాదాలకు చోటులేదు.**

* ఫొటోలు పంపేవారు విధిగా తమ ఫోన్‌నెంబర్లుసహా తమ తల్లిదండ్రుల అంగీకార పత్రాలు పంపాలి.
* ప్రచురణ తర్వాత ఫొటోలు తిరిగి కావాలనుకునేవారు తగిన పోస్టేజిస్టాంప్‌లంటించిన స్వంత చిరునామాగల కవరును జతపరచాలి.

**చిరునామా :** సంపాదకులు, చతుర / విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500082 ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net
vipula.chatura@gmail.com









# అంపశయ్య నవీన్ నవలా పురస్కారాలు

కొత్తగా నవలలు రాసే రచయితలను ప్రోత్సహించాలనే ఉద్దేశంతో ఒక నవలాకారుడు రచించిన మొదటి నవలకు రూ. పదివేల పారితోషికం ఇవ్వాలని **'అంపశయ్య నవీన్ సాహిత్య సమితి (లిటరరీ ట్రస్టు)'** నిర్ణయించింది. పోటీకి వచ్చిన ఆయా నవలాకారుల మొదటి నవలల్లో ఉత్తమమైంది ఎంపిక చేసి, ఈ పురస్కారాన్ని డిసెంబరు 24న నవీన్ జన్మ దినోత్సవం నాడు ప్రదానం చేస్తారు. 2013- 15 సంవత్సరాల మధ్య కాలంలో రాసి, ప్రచురితం కాని నవలల్ని (నాలుగు ప్రతులు) అక్టోబరు 31, 2016 లోగా **అంపశయ్య సాహిత్య సమితి,** వరంగల్‌కు పంపాలి.

వివరాలకు : 0870 - 2456458 ఫోన్ నెంబరులో సంప్రదించవచ్చు

# మనసున ఉన్నదీ...

★ ఆగస్టు సంచికలో వెలువడిన బంకిం చంద్ర నవల 'చంద్రశేఖర్' ఆకట్టుకుంది. శ్రీధ రాచార్యులు చక్కని శైలిలో అనువదించారు. ఏ దేశభక్తుడినో కథానాయకుడిగా నిలుపుతారని నవల మొదలుపెట్టా, కానీ స్త్రీ పాత్రల చిత్ర ణలో విప్లవం తెచ్చిన కవిగారి రచన అని పరి చయంలో చదివాక ఉత్సాహంతో పఠనం సా గించాను. ప్రేమకు కొత్తభాష్యం చెప్పిందీ నవ ల. ప్రతిభారాయ్ పెద్దకథ 'సోదరికి వాటా' బా గుంది. సంఘంలో అన్నాచెల్లెళ్ల బంధానికి పేద రికం అడ్డొస్తోందని పనిమనిషి భావించినా, ధ నం, ఆస్తులే వాళ్ల మధ్య శత్రుత్వం సృష్టిస్తాయ ని ఆమె పిల్లల ద్వారానే నిరూపించారు. 'కొత్త గాలి' కవితలు కొత్తదనాన్ని పుంజుకున్నాయి.

– **ఎన్.వి. రమణి,**
బంజారాహిల్స్, హైదరాబాద్

★ 'చంద్రశేఖర్' నవల ఆద్యంతం ఆసక్తిక రంగా సాగింది. అనువాదం సరళంగా ఉండి ఆకట్టుకుంది. ప్రతిభారాయ్ పెద్దకథ 'సోదరికి వాటా' సమాజ స్థితిని కళ్లకుకట్టింది. 'కృష్ణం వందే జగద్గురుమ్' చాలా బాగుంది. 'కొత్తగాలి' కవితలు ఆకట్టుకున్నాయి.

– **అమ్మాజీ,** పటమట, విజయవాడ

★ 'చంద్రశేఖర్' నవల బాగుంది. శ్రీధరాచార్యులు అనువాదం సాఫీగా సాగింది. 'గోరంత చదువుకి/ కొండంత ఫీజు..', 'ఆశయాలను ఆచరణలో పెట్టినపుడే/ మానవుడు మహనీయుడు..' లాంటి చిట్టికవితలు గట్టి ఆలోచలను రేకెత్తించాయి.

– **రాజేష్,** దోమల్‌గూడ, హైదరాబాద్

★ నవల ఆసాంతం ఆసక్తిగా చదివించింది. ఇంద్రవెల్లి కాల్పుల సంఘటన నేపథ్యంలో రాసిన 'అడవి'ని కళ్లముందుంచిన 'నవలావలోకనం' బాగుంది.

– **గోపాలచంద్ర,** అనంతపురం

★ నవల 'చంద్రశేఖర్' చాలా బాగుంది. ఇతర అంశాలు కూడా ఆసక్తికరంగా ఉన్నాయి. అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని ఇముడ్చుకున్న కొత్తగాలి కవితలు ప్రశంసనీయం.

– **సి. హెచ్. కల్యాణి,**
బెంగళూరు

★ కృష్ణాష్టమి సందర్భంగా రాధాకృష్ణుల ముఖచిత్రంతో వెలువడిన 'చతుర' చూడచక్కగా ఉంది. కృష్ణతత్వాన్ని బోధపరిచిన 'కృష్ణం వందే జగద్గురుమ్' బాగుంది.

– **జె. వెంకటాద్రి,**
వెస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్

సంపుటి -39,
సంచిక - 8
464వ సంచిక,
పేజీలు : 132,
సెప్టెంబరు 2016

# చతుర

'రాఘవ బావని పెళ్లి చేసుకో. ఎంచక్కా అమెరికాలో ఉంటూ బోలెడు సంపాదిస్తున్నాడు. జీవితాంతం సుఖంగా ఉంటావ్'

తన అన్న కొడుక్కిస్తే కూతురు జీవితం బాగుంటుందని వసుంధర నమ్మకం.

'రాజు బావను పెళ్లిచేసుకో! బెంగళూర్లో ఇంజనీర్‌గా జాబ్ చేస్తున్నాడు'

తన అక్క కొడుకును చేసుకుంటే కూతురు సంతోషంగా ఉంటుందని తండ్రి ఆదివిష్ణు ఆశ.

ఇంతకీ ఆమె ఎవర్ని చేసుకుంది? ఆ తర్వాత ఆమె పరిస్థితి ఎటు దారితీసింది?

ఆద్యంతం ఆసక్తిగా సాగే **వాలి హిరణ్మయీ దేవి** నవల **చిలుకలు వాలిన చెట్టు** పేజీ. నెం. 6





★ ముఖచిత్రం : నటి **రాశీఖన్నా**
★ రెండో కవరు : **వారెవ్వా!**
★ చివరి కవరు : నటి **నిత్యామీనన్**
★ పుస్తకాలంకరణ : రాజు యాట

e-mail: vipula.chatura@eenadu.net / vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

✸ ఆ పెళ్లికూతురు వయసు
యాభై ఏళ్ల పైమాటే..!
పెళ్లికొడుకు వయసు
ఇరవై నాలుగేళ్లు..!

అందరికీ ఎబ్బెట్టుగా కనిపించే ఆ పెళ్లికూతురిలో ఆ యువకుడికి నచ్చినదేంటి? పెళ్లి తర్వాత వాళ్ల బంధం ఎలా కొనసాగింది?

ఆసక్తిగా చదివించే **సోమర్‌సెట్ మామ్** పెద్దకథ **జేన్** పేజీ. నెం. 94

✸ ప్రత్యేకంగా ఓ కులవృత్తిని కథాంశంగా ఎంచుకుని నవల రాసిన ఆ రచయితకు అదే ఇంటిపేరుగా మారిపోయిందంటే అది ఎంతగా ప్రజాదరణ పొందిందో అర్థం చేసుకోవచ్చు. రజకుల జీవనవిధానాలను, అప్పటి దయనీయ వ్యవస్థను ఆవిష్కరించిన **జి.యస్. చలం** నవల **రేవు** నవలావలోకనంలో!
పేజీ. నెం. 115

"నన్నే ఇంట్లోంచి వెళ్ళమంటావా? అవున్లే! విలియమ్స్‌గాణ్ణి పట్టావుగా!
ఇక నా అవసరం నీకెందుకుంటుంది? వాడితోనే తిరుగు!"
అంటూ దుర్భరంగా తిట్టసాగాడతను.
వెగటు మాటల్ని సహించలేక ఆమె
పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేయబోతే ఈడ్చిపెట్టి కొట్టాడతను.
ఆ దెబ్బలకు కుప్పకూలిందామె.
లండన్‌లో ఉన్నా గృహహింస తప్పదా?
ఇంతకీ ఆమెకు ఆ తాగుబోతు భర్తనుండి విముక్తి దొరికిందా?
బంధాలు, అనుబంధాలను విశ్లేషించే నవల

**చిలుకలు వాలిన చెట్టు**

చతుర సెప్టెంబరు కానుక!



కనుచూపుమేర అలుముకొన్న వెండివెన్నెల్లాంటి మంచును కిటికీలోనుండి చూస్తూ కూర్చుంది రోజ్‌మేరి.

ఆమె కొడుకు రాహుల్, పక్కగదిలో చదువుకుంటున్నాడు. చదివే అలవాటుని, రోజీనే రాహుల్‌కి అలవాటు చేసింది. అందుకే తెలుగు రాయడం అంతస్పీడ్‌గా రాకున్నా చదవడం బాగానే వచ్చుతనికి.

లండన్‌లో తను చేస్తున్న బిజినెస్ ఇప్పుడిప్పుడే ఊపందుకోవటం రోజీకి సంతోషాన్నేకాదు, ఆత్మవిశ్వాసాన్నీ కల్గిస్తోంది. తన డాన్స్‌స్కూల్ కూడా మరికొందరు విద్యార్థులు చేరడంతో కళకళలాడుతోంది. దాంతో అదనపు ఆదాయం లభించి మానసిక ప్రశాంతత కల్గుతోంది.

అయితే, ఇండియాలో మందీమార్బలం మధ్య మహారాజులా వెలుగొందాల్సిన రాహుల్, ఇలా ఒంటరివాడిగా పెరగవలసి రావటం మాత్రం బాధని కల్గిస్తూవుంటుందామెకి. దేశంగాని దేశం వచ్చి తను పడిన బాధలు అనుక్షణం గుర్తుకొస్తుంటే, ఆ బాధలేవీ రాహుల్ దరిజేరొద్దని, ఒంటరిపోరాటం సాగిస్తోంది.

చూస్తుండగానే చీకట్లు కమ్ముకురాసాగాయి. కాసేపు టీవీ చూసింది. బోర్ అన్పించగానే, లాన్‌లోకి దారితీసింది. చాలాసేపు పచార్లు చేసి లోపలికొచ్చింది.

ఒంటరి జీవితంలో వెలితి ఉన్నా, కావలసినంత స్వేచ్ఛ ఉంటుంది. మన ఇష్టం వచ్చినట్లు గడిపే అవకాశముంటుంది. ఎలాంటి ఆక్షేపణలూ, కట్టుబాట్లూ వుండవు అనుకొంది. డోర్‌లాక్ చేసేసి "రాహుల్! డిన్నర్ చేద్దామా? " అంటూ అతడి గదిలోకి, తొంగిచూస్తూ పిలిచింది.

"టెన్‌మినిట్స్ వెయిట్ చేయగలవా మామ్? " అడిగాడు రాహుల్.

"మనం కలిసిచేసేది డిన్నరేగా, నాకేమంత ఆకలిగా లేదు. వెయిట్ చేస్తాను" అంది రోజీ, రూమ్‌హీటర్ ఆన్ చేస్తూ.

ఇంతలో డోర్ బెల్ మోగింది.

'ఎవరా? ' అని వ్యూ పాయింట్లోంచి చూసింది. రాబర్ట్ కన్పించాడు. అతడిని చూస్తూనే ఆమె మనసు ముకుళించుకుపోయింది. ప్రశాంతంగా ఉంటున్నామనుకునేంతలోనే, మళ్లీ తుపాను హెచ్చరికలా ఇతను కన్పించడమేంటి? పీడా వదిలిందనుకొని సంతృప్తి చెందేలోగానే చీడలా దాపురించాడేంటి? మళ్ళీ కష్టాలు మొదలవ్వబోతున్నాయా? అన్న భావనతో నిలువెల్లా వణికిపోయింది.

అతను డోర్‌బెల్ ఆపకుండా నొక్కుతూ వుండేసరికి, 'ఇప్పుడు తలుపులు తెరిస్తే ఒక తంటా, తీయకపోతే మరో తంటా ఎలా? ' అనుకుని నిలబడిపోయింది.

అతడు రెండుచేతులూ జోడిస్తూ వేడుకోవటం, గ్లాస్ డోర్స్‌గుండా కనిపిస్తున్నా, తల తిప్పేసుకుంది. అరగంటపాటు అలాగే నిలబడి, తర్వాత ఈ పాటికి వెళ్ళే వుంటాడనుకొంటూ కనుకొనలగుండా చూసింది. కానీ కురుస్తున్న మంచుకు గజగజా వణికిపోతూ, చేతులు జోడించి దీనంగా వేడుకొంటూంటే, స్త్రీ సహజమయిన జాలితో తలుపులు తెరిచింది రోజీ.

"థ్యాంక్యూ రోజీ! క్షమిస్తావని తెలుసు. నువ్వు నా ఏంజెల్‌వి, గాడెస్‌వి. నా మూర్ఖత్వంతో బాధ పెట్టినా క్షమించే పెద్ద మనసు నీకుందనే నా నమ్మకం. ఏదో ఫ్రస్ట్రేషన్‌తో నిన్ను కొట్టీతిట్టీ బాధించాను. రియల్లీ వెరీ సారీ! నువ్వు లేని జీవితం దుర్భరంగా వుంది. నీకు క్షమాపణ చెప్పడం కోసం ఎంతగా ప్రయత్నిస్తున్నా, నువ్వు అవకాశం ఇవ్వడంలేదు. నన్ను క్షమించు రోజీ. ఇకమీదట ఎన్నడూ అలా ప్రవర్తించను" అంటూ వలవలా ఏడుస్తూ ఆమె కాళ్ళమీద పడిపోయాడతడు.

రోజీ చటుక్కున కాళ్ళు లాగేసుకుని "నీకిలా కాళ్ళు పట్టుకోవడం సర్వసాధారణమైపోయింది. నువ్వు ఏ టైమ్‌లో ఎలా

ప్రవర్తిస్తుంటావో బాగా తెలుసు. నాకు నీ క్షమాపణలు అక్కర్లేదు. మా జీవితంలోకి మళ్ళీ వచ్చే ప్రయత్నం చేయకు" కఠినంగా అంది.

"రోజీ డియర్! అంత కఠినంగా మాట్లాడకు. నాకు నువ్వుగాక మరెవరున్నారు? నువ్వులేని జీవితం నాకొద్దు. నీతోడు లేకుంటే నేను చచ్చిన శవంతో సమానం. నాకంటూ ఎవరూ లేరు. నన్ను పట్టించుకునే దిక్కులేదు. నాల్రోజులుగా ఆకలితో మలమల మాడిపోతున్నాను. ఎండిపోయిన బ్రెడ్ ముక్కలైనా విదిలిస్తావని ఆశతో వచ్చాను. సోషవచ్చి పడిపోయేలా వున్నాను, కనికరించు. ఆకలితో కళ్ళు మూసుకుపోతున్నాయి" అన్నాడెంతో దీనంగా.

'ఆకలి' అని ఎవరన్నా తట్టుకోలేదు రోజీ. ఆ సంగతి అతడికి బాగా తెలుసు. ఆమె ఆ బలహీనత, అతడి ఆయుధమవుతుందెప్పుడూ.

ఎప్పటిలాగే కరిగిపోయింది రోజీ. ఆకలితో మాడిన రోజులు గుర్తుకొచ్చాయి. దాంతో ఆవేశం కరిగిపోయింది.

లోతుకుపోయిన అతని కళ్ళు, చిక్కిశల్యమైన ఒళ్ళూ చూసి ఇక బెట్టు చేయలేకపోయింది. "ఏదో ఉన్నది పెడతానుగానీ తినేసి వెళ్ళిపోవాలి మరి" అంది.

"అలాగలాగే. ముందు తినడానికేమైనా పెట్టు" అన్నాడు సోఫాలో వాలిపోతూ.

ఆమె కిచెన్‌లోకి వెళ్ళి నాలుగు చపాతీలు, కూరలు, పాలు, బ్రెడ్ స్లైస్‌లూ పట్టుకొచ్చి అతని ముందుంచింది.

ఆవురావురుమంటూ అతడు తింటూంటే, ఆమెకి జాలేసి క్షణాల్లో అవన్నీ ఖాళీ చేశాడతను.

"నాల్రోజుల తర్వాత కడుపునిండా తిన్నానేమో, కళ్ళు మూసుకుపోతున్నాయి. బయట మంచు బాగా కురుస్తోంది.. ప్లీజ్! ఈ ఒక్కరాత్రికీ ఇక్కడ వుండనియ్యి రోజీ, నడిచే శక్తి కూడా లేదు. ప్లీజ్! పొద్దుటే వెళ్ళిపోతాగా" అంటూ వణుకుతున్న చేతులతో అతను వేడుకోగా మారు మాట్లాడలేకపోయింది.

## కొత్తగాలి...

**మొక్కను**
**మొక్కవోని దీక్షతో పెంచాలి!**
**మొక్కుబడిగా**
**కాదు.. కానేకాదు!**

– నీహారిక దూసి,
బెంగళూరు

గదిలోంచి రాహుల్ భయంగా చూడటం గమనించగానే, "సరే, ఈ ఒక్కరాత్రికి ఓకే. పొద్దుటే వెళ్ళిపోవాలి" అంది గట్టిగా.

"థాంక్యూ రోజీ!" అన్నాడు రాబర్ట్ ఎంతో కృతజ్ఞతగా. మనసులో మాత్రం 'ఈ మాత్రం అవకాశం చాలదూ, నిన్ను బుట్టలో పడేయటానికి' అనుకున్నాడు.

"వెళ్ళి ఆ పక్కనున్న రూమ్‌లో పడుకో" అందామె.

"రోజీ! నన్ను క్షమించి కడుపునిండా తిండిపెట్టి ఆకలి తీర్చావ్. కాళ్ళూచేతులూ కొంకర్లు పోతున్నాయి. నా అలవాటు తెలుసుగా.. ప్లీజ్! రెండంటే రెండు పెగ్గులిస్తే, నోర్మూసుకుని నిద్రపోతా" అన్నాడామె చేతులు పట్టుకుని.

'ఇవ్వకపోతే గంటలతరబడి వేధిస్తూనే వుంటాడు.. తాగి ఏదోమూలన పడుకొని వెళ్ళిపోతాడు' అనుకొంటూ, తన చేతుల్ని విడిపించుకొని, గెస్టులకోసం ఉంచిన బాటిల్స్ నుండి కొంత డ్రింక్ గ్లాస్‌లోకి వంపి, అతనికిచ్చి "ఈ విస్కీ తాగి పడుకో, ఇకమరి మాట్లాడకు. పొద్దుటే వెళ్ళిపో, నీ ముఖం రాహుల్‌కి కన్పించకూడదు" అంది కచ్చితంగా.

"సరే సరే, అలాగే" మోస్ట్ ఒబీడియెంట్

స్టూడెంట్‌లా అన్నాడతను, ఆ గ్లాస్ పది లంగా అందుకొంటూ.

'నాల్రోజులపాటు, దీని అడుగులకి మడుగులొత్తితే మళ్ళీ పాగా వేయొచ్చు' అనుకుని పక్కరూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

వాళ్లిద్దరినీ గమనిస్తున్న రాహుల్, మన సులోనే నిట్టూర్చాడు. తన తల్లి మంచిత నాన్ని ఆసరాగా తీసుకొని రాబర్ట్ ఆమె నెలా ఆడిస్తున్నదీ చిన్నపిల్లాడే అయినా, బాగా తెలుసతనికి.

మర్నాడతని రూమ్‌లోకి వెళ్ళి తట్టిలే పింది రోజీ. అతని వళ్ళు సలసలా కాగిపో తూండటం గమనించినా గమనించనట్లే "ఇక వెళ్ళు రాబర్ట్" అంది.

"రోజీ! అడుగు తీసి అడుగేసే ఓపిక లేదు. కాళ్ళూచేతులూ లాగేస్తున్నాయి. ఒళ్ళంతా నొప్పులు. ప్లీజ్! జ్వరం తగ్గగానే వెళ్ళిపోతాను" అంటూ గడ్డం పట్టుకొని బతిమాలాడు.

చేసేదేంలేక 'సరే' అందామె. అంతే, ఆ వంకన వారంరోజులు తిష్టవేశాడు రాబర్ట్.

ఎనిమిదోరోజున రాహుల్, రోజీలు బ యటికి కదలగానే కిచెను, అల్మైరాల్లో వెదికి, దొరికిన డబ్బుతో ఫుల్లుగా తాగేసి వచ్చాడు రాబర్ట్.

ఎర్రబడ్డ కళ్ళతో తూలిపోతున్న రాబ ర్ట్‌ని చూస్తూనే గ్రహించేసింది రోజీ, తనని లొంగదీసుకునేందుకే అతడలా తాగి వచ్చాడని. 'తాగితే ఎక్కడలేని ధైర్యమూ వస్తుంది తాగుబోతులకి. ఇక రాత్రికెంత రాద్ధాంతం చేస్తాడో, ఏంటో' మనసులో అనుకొంది భయంగా.

ఎందుకైనా మంచిది, ముందు రాహు ల్‌కి అన్నంపెట్టి నిద్రబుచ్చితే సరి' అను కుని, "రాహుల్! డిన్నర్ ఫినిష్ చేసేయ్" అంది టేబుల్‌మీద అన్నీ అమరుస్తూ.

"ఇద్దరం కలిసి తిందామమ్మా" అన్నాడు రాహుల్.

రాబర్ట్ రాద్ధాంతం చేసినప్పుడల్లా తల్లి అభోజనంగా పడుకోవటం ఎన్నోసార్లు చూసినవాడు కావటంవల్ల, తల్లిని తిన మంటూ ఒత్తిడి చేశాడు.

"సరే పద, తిందాం" అంటూ కూర్చుంది రోజూ కూడా.

వాళ్ళు తింటూండగా తూలిపోతూ అక్క డికొచ్చిన రాబర్ట్, "ఏం? నేను చచ్చాననుకున్నారా? తల్లీకొడుకులిద్దరే మెక్కేస్తున్నా రేంటి? " అంటూ కుర్చీలో కూలబడ్డాడు.

రాహుల్ వెంటనే తింటున్న ప్లేట్‌లోనే చేయి కడిగేసి, తన గదిలోకి వెళ్ళి బోల్ట్ పెట్టేసుకున్నాడు.

ఈ టైమ్‌లో అనవసరపు వాదనలెం దుకు అనుకొంటూ రోజీ కూడా చేయి కడు క్కొని, అతనికి వడ్డించింది.

ప్లేట్ వంక చూస్తూనే ముఖం చిట్లిం చాడు రాబర్ట్. "నాన్‌వెజ్ లేందే తిననని తెలీదా, ఈ ఆకుకూరలేంటి? " అంటూ ప్లేట్‌ని విసిరికొట్టాడు.

రోజీకెక్కడ్లేని కోపం ముంచుకొచ్చింది. కానీ ఎంతో కష్టంమీద తమాయించుకొని, నాలుగు గుడ్లు ఆమ్లెట్స్ వేసి అతని ముందుంచింది.

అతడు వాటిని నోటినిండా కుక్కుకొని, కరపరా నములుతూంటే కడుపులో తిప్పే సినట్లయింది రోజీకి. దానికితోడు అతని నుండి వస్తున్న దుర్గంధంవల్ల, అంతకు ముందు తిన్నదికాస్తా వాంతయింది. దాంతో నిస్త్రాణగా కూర్చుండిపోయింది.

'నిజంగా తనంత ఇడియట్ మరొకరుం డరు. వీడి సంగతి తెలిసీ రానిచ్చానేంటి? ' అని తనని తాను తిట్టుకోసాగింది. తిండి ముగించి మళ్ళీ గ్లాస్‌లోకి విస్కీ వంపుకుం టున్న రాబర్ట్‌ని చూసేసరికి ఒళ్ళుమం డింది. అయినా తమాయించుకొని లేచి "ఇకచాలు, వెళ్ళి పడుకో" అందతని చేతు ల్లోంచి బాటిల్‌ను లాక్కొంటూ.

"మరి నువ్వు నాపక్కన పడుకోవాలి, అలాగైతేనే ఆపుతా" అన్నాడు రాబర్ట్, రోజీ

# మంచి 'చెడ్డ'దేశాలు




అమెరికా వల్ల కొన్ని దేశాలపై చెడ్డ దేశాలుగా ముద్ర పడింది. కానీ అలాంటి దేశాలు కొన్ని మంచి పనులు కూడా చేశాయి.

★ మార్క్సిస్టు నియంత ఫెడెల్ క్యాస్ట్రో పాలించే క్యూబా, ఎబోలా వైరస్‌ని నాశనం చేయడానికి 66 దేశాలకి 50 వేల మంది డాక్టర్లని పంపింది. వాళ్లకి ఈ కష్టానికి నెలకి 67 డాలర్ల ఆదాయమే వచ్చింది.

★ నెల్సన్ మండేలా ఇరవయ్యోశతాబ్దపు శాంతి చిహ్నాలలో ఒకరు. అమెరికా, యుకె లాంటి దేశాలు మొదట్లో మండేలాని అధికారికంగా ఉగ్రవాదిగా చూశారు. లిబియా నియంత గడాఫీ ఆయన్ని ప్రజలకోసం పోరాడే వ్యక్తిగా గుర్తించాడు. తర్వాత ప్రపంచమంతా ఆయన్నే అనుసరించింది.



ఫెడెల్ క్యాస్ట్రో

★ 1964 నుంచి కొలంబియాలో మార్క్సిస్టు గెరిల్లా ఉగ్రవాదులు 2 లక్షల 20 వేల మందిని చంపారు. కొలంబియా శత్రుదేశం వెనెజులా అధినేత హ్యూగో చావెజ్ 2012లో ఉగ్రవాదులకి, కొలంబియన్ ప్రభుత్వానికి మధ్య సమావేశాన్ని ఏర్పాటు చేసి, వారి మధ్య శాంతిని నెలకొల్పాడు.

★ ప్రపంచంలో వాతావరణ కాలుష్యానికి చైనాది ప్రధాన బాధ్యత. ఎన్ని దేశాలు చెప్పినా అది తన పంథాని మార్చుకోలేదు. అకస్మాత్తుగా 2014 నుంచి చైనా తన దేశంలోని పరిశ్రమల మీద అనేక నిబంధనలను విధించి పర్యావరణ కాలుష్య నిరోధంలో నంబర్ వన్‌గా నిలుస్తోంది.

★ 2001లో ఆఫ్ఘనిస్థాన్‌తో అమెరికా యుద్ధం మొదలయ్యాక 38లక్షల ఆఫ్ఘన్ కాందిశీకులకి పాకిస్థాన్ సరిహద్దును తెరిచింది. 8లక్షలమంది పిల్లలకి వారు ఆఫ్ఘన్స్‌గా తమ దేశపు బర్త్ సర్టిఫికెట్ కూడా జారీ చేసింది ఉగ్రవాదాన్ని పెంచి పోషించే పాకిస్తాన్.

★ జింబాబ్వేలో ఆర్థిక మాంద్యం, నిరుద్యోగం ఎక్కువ. ఆయుఃప్రమాణం తక్కువ. దాని అధినేత ముగాబే హింసతో పదవిని కాపాడుకుంటున్నాడు. ఇటీవల జింబాబ్వే 90 శాతం అక్షరాస్యతని సాధించింది. ధనిక దేశాల్లో కూడా ఇంత అక్షరాస్యత లేదు.

వంక కాంక్షగా చూస్తూ.

ఆ చూపులకు కంపరం కల్గిందామెకి.

"రాబర్ట్! నీకెన్నోసార్లు చెప్పాను, ఇక మన మధ్య అలాంటి సంబంధం ఉండకూడదని. మర్యాదగా వెళ్ళిపో. ఆకలితో గుమ్మంలోకి వచ్చావని దయతలిస్తే, మళ్ళీ నరకాన్ని చూపిస్తున్నావ్. ముందు నా కళ్ళముందు నుండి పో, లేకుంటే ఏం చేస్తానో నాకే తెలీదు" అరిచింది గట్టిగా.

ఆమె ఉగ్రరూపాన్ని చూసి కాస్త జంకాడు రాబర్ట్. అయినా బింకంగా "ఓ, అలాగే వెళ్ళిపోతాను, కానీ నాకో ఫైవ్ హండ్రెండ్ పౌండ్స్ కావాలి. అవిస్తే ఇప్పుడే వెళ్ళిపోతా" అన్నాడు దొరికినంత చేజిక్కించుకోవాలని.

"నా దగ్గర నువ్వు దాచిందేదీ లేదు, గెట్ అవుట్" అరిచిందామె.

"నేను దాచిందేమీ లేదులేగానీ నువ్విపుడు రెండుచేతులా బాగానే సంపాదిస్తున్నావుగా, అదివ్వు" వంకరగా నవ్వుతూ అన్నాడు రాబర్ట్.

నిర్ఘాంతపోయిన రోజీ 'వీడు ఎప్పటికప్పుడు అన్ని విషయాలూ తెలుసుకుంటూనే ఉన్నాడన్నమాట' అనుకుని "సంపా

## కొత్తగాలి...

**నీటిని రక్షించు**
**దీవిస్తుంది!**
**చెట్టుని నరకొద్దు**
**శపిస్తుంది!**

*– లోగిశ లక్ష్మీనాయుడు,*
*సింహాచలం*

దిస్తున్నది ఎంతుంటుందని? ఎప్పటికప్పుడు ఖర్చయిపోతూనే ఉంది. అయినా నీకెందుకు లెక్కలు చెప్పాలి? ఇలా పేరసైట్‌లా బతకడానికి సిగ్గుగా లేదూ?" అంది ఛీత్కారంగా.

"ఏం? నీ కొడుకుని మేపటం లేదా? వాడికి ఖర్చు చేయడానికైతే నీ దగ్గర డబ్బుంటుంది గానీ నాకివ్వడానికి మాత్రం లేదా?" మత్తు బాగా తలకెక్కగా కోపంగా అన్నాడు రాబర్ట్.

"వాడితో నీకు సాపత్యమేంటసలు? తల్లిగా వాడిని పోషించే బాధ్యత నాకుంది. మనిద్దరం విడిపోయి చాలా కాలమైందని మర్చిపోయినట్లున్నావ్, మర్యాదగా వెళ్ళిపో"

"నువ్వలా అనుకొంటున్నావ్ గానీ నాకలా లేదు. మళ్ళీ మనం మునుపట్లా కలిసుందాం. నువ్వయినా మగతోడు లేకుండా ఎన్నాళ్ళని వుంటావ్?"

"డోంటాక్ రబ్బిష్! నీతో కలిసి బతకడం ఇష్టం లేకనేగా నువ్వు కోరినంత నీ ముఖాన పడేసి తెగతెంపులు చేసుకొన్నది. ఒంటరిగా వుండటంలోనే ప్రాణానికి సుఖం వుంది నాకు. కష్టపడి బతకడంలో ఆనందాన్ని వెదుక్కొంటున్నాను. అయినా ఇలా చేయిసాచి ఒకరి ముష్టినాశిస్తూ బతకడానికి సిగ్గుగా లేదా?" ఏహ్యంగా చూస్తూ అడిగిందామె.

"యూ బ్లడీ! నీకు బాగా బలుపు ఎక్కువయిందే. పల్లెటూరి వాటంలో చేతిలో పసిగుడ్డుతో వీధుల్లో అడుక్కు తినాల్సిన నీకు నేను ఆశ్రయం ఇవ్వకుంటే ఏమయ్యేది? నీ కాళ్ళమీద నువ్వు బతుకుతున్నానంటున్నావ్, అలా నువ్వు నిలబడటానికి నేనెంత చేశానో మరిచిపోయావా?" అని అరిచాడు.

"మర్చిపోలేదు కాబట్టే నువ్వు సంపాదించినా, సంపాదించకున్నా నిన్ను చాలా కాలం మేపాను, కానీ ఇలా ఏళ్ళ తరబడి జలగలా పీక్కుతింటూంటే భరించలేను. నీ దారి నీది, నా దారి నాది. నన్నడిగే ముష్టి ఏ నాలుగు వీధుల్లోనయినా అడుక్కొంటూ బతుకు. నా జోలికి మాత్రం రావద్దు" నిష్కర్షగా చెప్పింది.

"యూ ఇడియట్! డర్టీ బిచ్!" అంటూ కోపంతో విస్కీ బాటిల్‌ను ఆమె మీదకు విసిరేశాడు. చటుక్కున పక్కకి తప్పుకోబట్టి గానీ లేకుంటే రోజీ తల పగిలేదే.

విస్కీ చింది కార్పెట్ అంతా తడిసింది. సీసా పెంకులన్నీ చెల్లాచెదురుగా పడ్డాయ్.

రోజీకి ఒక్కపెట్టున కోపం వచ్చి "యూ, రాస్కెల్! మళ్ళీ నా ఇల్లు నాశనం చేస్తున్నావా? ఏదో కాస్త ప్రశాంతంగా వున్నాననుకుంటే, మళ్ళీ కల్లోలం సృష్టిస్తున్నావే. ఈ క్షణం బయటకు నడువు" అని తర్జని చూపిస్తూ బిగ్గరగా అరిచింది రోజీ.

ఆ కోపానికి ఓ క్షణంపాటు ఎలా రియాక్టవాలో తోచలేదు రాబర్ట్‌కి.

తాగి గొడవచేయడం, డబ్బివ్వకుంటే చేతికందినవన్నీ పగలగొట్టడం ఒళ్ళెరగకుండా తాగొచ్చి వాంతులు చేసుకుంటూ కార్పెట్లూ, ఇల్లూ పాడు చేయటం.. ఒక్కోసారి మలమూత్రాదులతో బెడ్‌షీట్స్ ఛండాలం చేయటం.. అవన్నీ క్లీన్ చేసుకోలేక తనకి శోష వచ్చినంతపనౌతుంది. అవన్నీ కళ్ళముందు కదలాడగా, రోజీ మొండిమానులా నిలబడిన అతన్ని

చూస్తూ "ఏంటీ, ఇంకా నిలబడ్డావ్? వెడతావా, లేదా? " అంది గట్టిగా.

"వెడతానే, వెడతాను. ఇప్పుడా విలియమ్స్గాడిని పట్టావుగా, నా అవసరం ఎందుకుంటుంది? వాడితో బాగా.." అంటూ భరింపశక్యంగాని, బూతు పదాలతో తిట్టడం మొదలెట్టేసరికి, మరి సహించలేక పోయింది రోజీ. అతడి తప్పుడు ఆరోపణలకు మనసంతా దహించుకుపోగా, "నా ఇష్టం వచ్చినట్టుంటారా, అడగడానికి నువ్వెవడివి? నన్నిలా హెరాస్ చేస్తే ఇక భరించేది లేదు. నీ మీద కేస్ బుక్ చేస్తే గానీ నీ రోగం కుదరదు. ఒక్క ఫోన్‌కాల్‌తో నిన్ను కటకటాల వెనక్కి పంపిస్తా" అంటూ ఫోనందుకొంది.

"నీకెంతధైర్యమే? " అంటూ ఆమె చేతిలోని ఫోన్ లాక్కోబోయాడతను.

రాబర్ట్‌తో పెనుగులాడుతున్న తల్లిని చూసేసరికి భయం వేసింది రాహుల్‌కి. కానీ అతడున్న పరిసరాల్లోకి పొరపాటునైనా రావద్దని తల్లి అంతకుముందు చేసిన హెచ్చరికలు గుర్తొచ్చి బయటకు రాలేదు.

ఫోన్ దొరకనివ్వకుండా దూరంగా వెళ్తున్న రోజీని అడ్డగిస్తూ "ఆ విలియమ్స్ గాడిని చూసుకునేనా నీకింత పొగరు? " అంటూ ఆమె చెంపమీద ఈడ్చి కొట్టాడు రాబర్ట్.

దాంతో విసురుగా వెళ్ళి గోడకు గుద్దుకొంది రోజీ. తలకు గాయమై రక్తం కారుతుంటే, పళ్ళ బిగువున లేచి "యూ బాస్టర్డ్! నన్నే కొడతావా? " అంటూ రాబర్ట్‌ని ఒక్క తోపు తోసింది.

దాంతో పిచ్చికోపం ముంచుకొచ్చిందతనికి. లేచి ఆమె పీక పట్టుకొన్నాడు. పెనుగులాటలో చేతిలోని ఫోన్ జారిపోయింది. వాడి చేతిపట్టుతో ఊపిరందక రోజీ గిజగిజలాడ్తుంటే ఇక ఆగలేక పరుగున బయటకు వచ్చాడు రాహుల్. అటూఇటూ చూసి అక్కడున్న తన బ్యాట్‌తో రాబర్ట్ తలమీద గట్టిగా కొట్టాడు.

"ఓ మైగాడ్!" అంటూ రాబర్ట్, రోజీని వదిలేశాడు.

రోజీ చటుక్కున కిందపడిన ఫోన్ అందుకొని రాహుల్‌ని దగ్గరకు అదుముకుని లోపలిగదిలోకెళ్ళింది వేగంగా. ఇక అక్కడుండటం తనకు క్షేమం కాదనుకొని పెద్ద పెద్ద అంగలు వేస్తూ బయటకు వెళ్ళిపోయాడు రాబర్ట్.

అతడు వెళ్ళిపోయింది నిర్ధారణ చేసుకొని డోర్స్ లాక్ చేసి తల్లి దగ్గరికొచ్చాడు రాహుల్. ఆమె తలకు అయిన గాయానికి ఫస్ట్‌ఎయిడ్ చేసి, కిచెన్‌లోకి వెళ్ళి పాలు కాచి తీసుకొచ్చి ఇచ్చాడు.

"అమ్మా ఈ పెయిన్ కిల్లర్ వేసుకో. పాలు తాగి కళ్ళుమూసుకొని పడుకో" అన్నాడు టాబ్లెట్ అందిస్తూ.

తండ్రిలా తనని అక్కున చేర్చుకొన్న రాహుల్ ఒళ్ళో తల దాచుకొని వెక్కివెక్కి ఏడ్చింది రోజీ. 'నాకీ శాస్తి జరగాల్సిందే. పువ్వులా అపురూపంగా చూసుకుంటున్న వారందర్నీ కాలదన్నుకొని వచ్చేసిన తనకి ఈ శిక్ష సరైందే' అనుకొంటూ కుళ్ళికుళ్ళి ఏడవసాగింది.

"బాగా నొప్పిగా వుందా అమ్మా? టాబ్లెట్ వేసుకున్నావ్‌గా తగ్గిపోతుందిలే. నువ్వు నిద్రపో, ఇదంతా నేను క్లీన్ చేసేస్తాలే" అన్నాడు ఏడుస్తున్న తల్లి తల మృదువుగా నిమురుతూ.

"వద్దులే నాన్నా? నొప్పి తగ్గాక నేనే క్లీన్ చేస్తాలే. నువ్విక్కడ పడుకో" అంటూ పక్కకి జరిగింది. అతడు నిద్రలోకి జారుకొనేంతవరకు అలాగే పడుకుంది రోజీ.

కాస్త ఒళ్ళునొప్పులు, తలబాధా తగ్గాక లేచి, గాజుపెంకుల్ని తీసేసింది. తర్వాత అతి కష్టమ్మీద కార్పెట్‌ని, గదిని శుభ్రం చేసింది. 'హుఁ.. ఆనాడు గోమాత సేవను ఈసడించుకొన్నాను. ఈనాడు ఈ గోమాయువు సేవలు చేస్తున్నాను' అను

కొంది భారంగా.

అప్పటి తన ప్రవర్తన గుర్తొచ్చి, కళ్ళ వెంట అశ్రువులు, తెగిన హారంలోని ముత్యాల్లా జారిపడ్డాయి.

నిద్రలేక, నీరసంతో ఒళ్ళుతూలిపోతుంటే మళ్ళీ మంచంమీద వాలిపోయింది.

'భగవంతుడు ప్రసాదించిన అందమైన జీవితాన్ని జారవిడుచుకొంది చేజేతులా. అమ్మానాన్నల ముద్దు మురిపాలను మరిచిపోయింది. భర్త చూపిన అనురాగాన్ని ఆస్వాదించలేకపోయింది. అత్తమామల లాలనని గమనించలేకపోయింది. అన్నీ తనే మూర్ఖంగా చేజేతులా దూరం చేసుకొన్నందుకే దేవుడిలా పనిష్ చేస్తున్నాడు' అనుకొనేసరికి ఏడ్పు ఆగలేదు.

నిద్రలోనూ వెక్కుతున్న తల్లి తలను ఓదార్పుగా నిమిరాడు, మెలకువ వచ్చిన రాహుల్. తల్లిపడుతున్న కష్టాలకు ఆ చిన్నారి మనసు ఎప్పుడూ కలత పడుతూనే వుంటుంది.

తల్లికిలాంటి పరిస్థితిని కల్పించిన రాబర్ట్ మీద కన్నా తన జన్మకు కారణమై, తల్లినిలా గాలికొదిలేసిన తండ్రి రాజారామ్మోహన్‌రావ్ మీద కోపం ముంచుకొచ్చింది రాహుల్‌కి. తల్లి ఇక్కడ అగచాట్లు పడుతూంటే ఆయనక్కడ మూడేసి పెళ్ళిళ్ళు చేసుకొని కులుకుతున్నాడని గుర్తొచ్చి అతడిమీద మరింత ద్వేషం కల్గింది. ఏ అండదండలూ లేకపోడం వల్లనేగా తల్లి, రాబర్ట్ చెంత జేరాల్సి వచ్చింది. తనకి ఊహ వచ్చిన దగ్గర్నుండీ రాబర్ట్‌తో అమ్మ నరకాన్నే చూస్తోంది. దానిక్కారణం తన కన్నతండ్రేగా.

తన క్లాస్‌లో కొందరు ఇండియా నుండి వచ్చిన పిల్లలున్నారు. వాళ్ళు తమ కుటుంబాలు, అనుబంధాల గురించి ఎంతో గొప్పగా చెబుతుంటే ఆశ్చర్యం కల్గుతుంటుంది రాహుల్‌కి. అలాంటి జీవితాన్ని తనకి దక్కనివ్వకుండా చేసిన కన్నతండ్రి పట్ల రోజురోజుకీ ద్వేషం, కోపం పెరుగుతూనే వున్నాయతనిలో.

తల్లితో ఈ ప్రస్తావన తెచ్చినప్పుడు "ఇదంతా మన ఖర్మ. దీనికెవరూ బాధ్యులు కారు. నువ్వీ టాపిక్ ఎప్పుడూ తీసుకురాకు. తెస్తే నాకు చచ్చిపోవాలన్నంత విరక్తి కల్గుతుంది. ఇలాంటి జీవితాన్ని నువ్వు భరించలేకపోతున్నావన్న బాధతో సూసైడ్ చేసుకోవాలన్పిస్తుంది. ప్లీజ్ నాన్నా! ఈ టాపిక్ తేవద్దు. నీకర్థం చేసుకొనే వయసొచ్చాక నేనే అన్నీ చెబుతా.. అదీ నాకు చెప్పాలన్పిస్తేనే" అంటూ భోరుమంది.

దాంతో మరెప్పుడూ ఆ ప్రస్తావన తేలేదు గానీ, 'తల్లిని వాళ్ళెంతగా కష్టపెట్టకుంటే పసికందుని తీసుకొని ఇల్లు వదిలి వస్తుంది? దేశం గాని దేశం వచ్చి ఇన్ని అగచాట్లు పడుతుంది' అనుకొంటుంటాడు.

తల్లికి ఇకమీదట ఎలాంటి కష్టాలూ రానీయకుండా చూసుకోగల్గితేనే తన జన్మ సార్థకమవుతుంది. తనకిప్పుడు పదమూడేళ్ళు. 'వీడినింకా మేపుతున్నావేంటి? ఎక్కడయినా పనిలోపెట్టు. వాడి బతుకేదో వాడు బతకాలి. వాడిని బయటకు పంపించెయ్' అని తల్లితో గొడవపడినప్పుడల్లా రాబర్ట్ అంటూంటే ప్రాణాలు బిక్కుబిక్కుమంటుంటాయ్.

"రాహుల్‌కి పెళ్ళయి పిల్లల తండ్రయినా వాడు నా కంటికి పసివాడే" అని తల్లి వెనకేసుకొస్తూ వుంటుంది.

"అదంతా మీ బ్లడీ ఇండియాలో, ఇక్కడ కాదు" అని రాబర్ట్ తిట్టినప్పుడల్లా, తననీ తను పుట్టినదేశాన్నీ తిడుతున్నందుకు తనకెక్కడ్లేని కోపం ముంచుకొస్తుంటుంది. ఆ వెంటనే భయమూ వేస్తుంటుంది. అతడి పోరు పడలేక, తనని ఏ బలహీన క్షణంలోనైనా బయటకు పంపించేస్తుందని.

మూడేళ్ళ క్రితం రాబర్ట్‌తో పెద్ద గొడవయింది. ఇక తెగతెంపులు అయిపోయా

యని రిలాక్స్ అయ్యేలోగా.. మళ్ళీ రాబర్ట్ రావడం, ఏదో వంకన డబ్బు గుంజుకెళ్ళ టమూ జరుగుతున్నాయి. మూడేళ్ళ తర్వాత మళ్ళీ ఇంత పెద్దగొడవ జరిగింది ప్పుడే. ఇంకా ఎంతకాలం ఇలా జరుగు తుందో? ఈ పీడ ఏనాటికయినా వదు ల్తుందో లేదో? ఇలా పలు రకాల ఆలోచ నలతో ఉక్కిరిబిక్కిరవుతూ ఆ రాత్రంతా నిద్రకు దూరమయ్యాడు రాహుల్.

## 2



**కా**లం వేగంగా పరుగులు తీస్తూనే వుంది. ఎందరివో సమస్యలను పరిష్కరి స్తూనే మరి కొందరికి సమస్యలను సృష్టి స్తూ ఉంటుంది. ఆ సమస్యల పరిష్కారా నికి మళ్ళీ కాలాన్నే ఆశ్రయించక తప్పదు.

గుమ్మంలో ఎడ్లబండి ఆగిన చప్పుడు కావడంతో, తలుపులు తెరిచి బయటకు వచ్చింది నమ్రత.

బండి దిగుతున్న తల్లి వసుంధరని చూడగానే సంతోషం కలిగినా, వెనువెం టనే కంగారూ కలిగింది. దాన్ని అణుచు కొంటూ "రామ్మా! ఎలా వున్నావ్?" అని ఆమె చేతిలోని బ్యాగ్ అందుకొంది. అది బరువుగా వుండటం చూసి మళ్ళీ ఏమేం మోసుకొచ్చిందో, వద్దంటే వినదు అను కుంది మనసులో.

"బాగానే ఉన్నాను గానీ నువ్వేంటే ఇలా తయారయ్యావ్? కళ్ళలో ప్రాణాలున్నట్ల య్యావేంటి? వాసూ ఏడి? వాడెలా ఉన్నాడు?" అని ఆత్రంగా అడిగింది వసుంధర.

"నేను బాగానే ఉన్నాలేమ్మా. పాపం వాసుకే వారం నుండీ జ్వరం. టాబ్లెట్స్ వాడుతూనే ఉన్నాను. తగ్గినట్లే తగ్గుతూ మళ్ళీమళ్ళీ వస్తోంది. రాత్రి నుండి మూసి నకన్ను తెరవకుండా అలా పడుకొనే ఉన్నాడు" అంటూ బెడ్‌రూమ్‌లోకి దారి తీసింది నమ్రత.

వసుంధర గబగబా వెళ్ళి వాసు నుదు టిమీద చేయి పెట్టి చూసింది. బాగా వేడిగా ఉండటంతో "అయ్యో! బిడ్డడెలా అయిపోయాడో? వారం నుండీ వీడిలా వుంటే నాకు కబురైనా చేయలేదేంటే?" అందామె, చెమర్చిన కళ్ళను కొంగుతో తుడుచుకొంటూ.

"ఇక్కడి హాస్పిటల్లో చూపించాను. వాళ్ళిచ్చిన మందులు వేస్తూనే ఉన్నా.. ఇంకా తగ్గుముఖం పట్టడంలేదు" బాధగా చెప్పింది నమ్రత.

"ఈ పల్లెటూరి డాక్టర్లిచ్చిన మందుల మీద నాకైతే నమ్మకం లేదు. వాడిని విజ యవాడకో, దగ్గరున్న మరో టౌన్‌కో తీసు కెళ్ళాల్సింది. అక్కడయితే పెద్దపెద్ద హాస్పి టల్స్ వున్నాయిగదా" అంది వసుంధర.

అది విజయవాడ, హైద్రాబాద్‌లకు మధ్యగా వున్న పల్లెటూరు కావడంతో అక్కడి డబ్బున్నవాళ్ళు, ఆ పట్టణాలకే వెడుతుంటారు పెద్ద వైద్య సహాయాలు అవసరం పడినప్పుడు.

'ఇక్కడున్న హాస్పిటల్‌కి తీసుకెళ్ళడానికే గతిలేదు. ఇక అంతంత దూరాలకు ఛార్జీలు పెట్టుకొని తీసుకెళ్ళేటట్లుందా? అయినా వాడికిప్పుడు మందులకన్నా కావ లసింది మంచి బలవర్ధకమైన ఆహారం. అది లేకనే రెసిస్టెన్స్‌పవర్ తగ్గి, మాటి మాటికిలా అనారోగ్యం పాలవుతున్నాడు' అనుకొంది నమ్రత.

"ఏంటీ, ఏమీ మాట్లాడవు? అల్లుడేడి?

మళ్ళీ ఊరినుద్ధరించను వెళ్ళాడా? " విసుగ్గా అడిగింది వసుంధర, విశాల్ జాడ లేకపోవడంతో.

నమ్రత మనసుకి కష్టంగా తోచింది. అయినా తమాయించుకొని "ఆయన పని మీద వెళ్ళారులే. మామూలు జ్వరానికి అంతంత దూరం వెళ్ళడం దేనికని నేనే అన్నాను" అంది నమ్రత.

"మామూలు జ్వరానికే పిల్లాడిలా వడిలిన తోటకూరకాడలా వేలాడిపోతాడేంటి? అస్తమానం జ్వరం వస్తోందంటే అదెలాంటి జ్వరమో, ఏంటో.. ఓసారి మంచి హాస్పిటల్లో అన్ని రకాల టెస్ట్‌లూ చేయిస్తే మంచిది కదా. అసలే ఏవేవో కొత్త జ్వరాలు వస్తున్నాయట" అందామె, వాసు వంక దిగులుగా చూస్తూ.

నమ్రత జవాబీయలేక వంటింట్లోకి వెళ్ళి మంచినీళ్ళ గ్లాస్‌తో వచ్చి తల్లికి అందించి "ఇన్ని రోజులూ మావయ్యా వాళ్ళూరికి వెళ్ళావేమో, రాగానే నాన్నని ఒంటరిగా వదిలేసి మళ్ళీ ఇక్కడికి రావాలా? పాపం నాన్నకి ఇబ్బంది కాదూ? " అంది.

తన రాక నమ్రతకంత ఇష్టత కలిగించడంలేదన్న విషయాన్ని వసుంధర గమనించలేకపోయింది. తండ్రిమీదున్న అభిమానం కొద్దీ అంటోందనే అనుకుని "ఆయనగారికే ఇబ్బందీ కలగకుండా రత్తమ్మకి అన్ని జాగ్రత్తలూ చెప్పే వచ్చాలే. ఎన్నో ఏళ్ళుగా మనింట్లో పని చేస్తున్న దానికి, నాకన్నా మీనాన్నగారి అలవాట్లు బాగా తెలుసులే. అన్నట్లు మీ అత్తమ్మ నీకిష్టమని జున్ను వండి ఇచ్చింది. అసలది ఇవ్వడంకోసమే పనులన్నీ చకచకా ముగించుకొని ఇలా వచ్చాను" అంటూ సంచిలోంచి స్టీల్‌కారియర్ పైకి తీసింది.

వసుంధర తల్లిగారిది దగ్గరున్న మరో పల్లెటూరు. అందుకే అటు అన్నగారి కుటుంబాన్ని చూడాలన్నా, ఇటు కూతురి దగ్గరకు రావాలన్నా ఎడ్లబండిలో వచ్చేస్తూంటుంది. వీలునుబట్టి సాయంత్రం వరకూ వుండటమో లేదా ఒకట్రెండు రోజులుండి వెళ్ళడమో చేస్తుంది.

'ఇప్పుడు వాసూ జ్వరం తగ్గేవరకూ తల్లిక్కడే వుండిపోతుందా? ' అనుకోగానే నమ్రతకు భయమేసింది. తల్లంటే ఇష్టం లేక కాదు. తాము పడే కష్టాలు ఆమెకెక్కడ తెలిసిపోతాయోనని. తెలిసి తెగబాధపడటమే గాదు, 'అల్లుడి అప్రయోజకత్వం వల్లనే ఈ కష్టాలు' అంటూ విశాల్‌ని ఏదో ఒకటి అనేస్తుంది. అది విని విశాల్ బాధపడుతుంటాడు. తను ఇద్దరికీ ఎంత సర్దిచెబుతూన్నా, ఇలాంటివి ఈమధ్య తరచూ జరగడం, దానివల్ల భార్యాభర్తల మధ్య తగాదాలు రావటం మామూలైంది. అందుకే తల్లి రాకపోకలీమధ్య కష్టం కలిగిస్తున్నాయి నమ్రతకు. 'రావద్దు' అని ముఖాన చెప్పలేకపోతోంది.

ప్రస్తుతం ఇంట్లో పట్టుమని పదిరూపాయల్లేవు. వంటచేసేందుకు బియ్యం, పప్పులు కూడా నిండుకున్నాయ్. ఇంట్లో ఉన్న అటుకులు, బ్రెడ్‌తో మూడ్రోజుల నుండీ నెట్టుకొస్తోంది. ఇప్పుడు తల్లికి వండిపెట్టాలంటే రెండు పిడికెళ్ళ బియ్యం తప్ప మరేంలేవు. ఏ పక్కింటికో వెళ్ళి అప్పోసప్పో చేసి వండినా ఇట్టే గ్రహించేస్తుంది. అయినా తనకి ఒకరింటికి చేబదులుకు వెళ్ళే అలవాటే లేదు. 'అప్పు, చేబదులు అనేవి తమని తాము లోకువ చేసుకోవడమేనని ఆ భార్యాభర్తల నమ్మకం. మరిప్పుడేం చేయటం? అంటూ మనసులో నులిబిలి కాసాగింది నమ్రత.

"గొడ్ల చావిట్లో లక్ష్మి లేదే? " అడిగింది వసుంధర.

లక్ష్మి వాళ్ళ ఆవు పేరు.

ఆలోచనల్లో మునిగిన నమ్రతకా ప్రశ్న విన్పించనే లేదు.

"నమ్రతా! నిన్నే అడిగేది, మన లక్ష్మికేమైంది? ఇందాకట్నుండీ చూస్తున్నా, అలా

పరధ్యానంగా ఉన్నావేంటి? " అని వసుంధర గట్టిగా అడిగేసరికి ఈ లోకంలోకొచ్చింది నమ్రత.

"ప్చ్! ఏంటో దానికీ ఇప్పుడే జబ్బు చేసింది. లక్ష్మిని తీసుకొనే మీ అల్లుడు పశువుల ఆస్పత్రికెళ్ళాడు" అంది దిగులుగా.

లక్ష్మి వారం రోజులుగా పాలివ్వకపోవడం వల్లగూడా రోజూ వచ్చే డబ్బులు రాకుండా పోయాయి. ముఖ్యంగా వాసుకి పాలు లేకుండా అయింది. రోజూ పాలు తాగే అలవాటున్న వాసు మరీ డీలా పడిపోయాడు. వాడికి అన్నం తినే అలవాటు తక్కువ, పాలు తాగే అలవాటు ఎక్కువ.

నమ్రతా వాళ్ళింట్లో ఆవు లక్ష్మిగాక, రెండు ఎడ్లు, కోళ్ళు, మేకలు, పావురాళ్ళు, కుందేళ్ళూ సందడి చేస్తూంటాయ్. వాటిని వాళ్లు తమ కుటుంబసభ్యుల్లాగే చూసుకొంటారు. ఇవిగాక తమ పొలంలోకి వచ్చే ఉడుతలనీ నెమళ్ళనీ వాసూ ఆడుకునేందుకు విశాల్ అప్పుడప్పుడు ఇంటికి తీసుకొస్తాడు. మళ్ళీ వాటిని పొలంలో వదిలిపెడుతుంటాడు వీటన్నింటితో చిన్నపాటి 'జూ'లా వుంటుంది వారి పెరడు.

"నమ్రతా! వెజిటబుల్ పలావ్, గుత్తొంకాయ కూరా తెచ్చా. వేడిగా ఉన్నప్పుడే తింటే బావుంటుంది. ముందవి తిను" అంది వసుంధర.

"సరే" అంటూ లేవబోయిన నమ్రతకి, తనతోబాటు మూడ్రోజులుగా మెతుకు ముట్టని విశాల్ గుర్తొచ్చాడు. దాంతో "మీ అల్లుడొచ్చాక, కలిసి తింటాలే" అంది.

ఇక ఏమీ అనలేకపోయింది వసుంధర. కానీ కాస్త చిన్నబుచ్చుకొన్న ఆమె "చల్లారిపోతే ఏం బాగుంటుందని తినమన్నానులే" అందామె.

వసుంధరకి వంటలు చేయడమంటే మహా ఇష్టం. అందుకే టీవీల్లో చూసినవి, పత్రికల్లో చదివినవి రకరకాలుగా ప్రయత్నిస్తూంటుంది. బాగా కుదిరితే మరోసారి చేసినప్పుడు నమ్రతకు పట్టుకొచ్చి ఇస్తూంటుంది. తల్లికున్న ఆసక్తి, ఓపిక చూసి నమ్రతకు ముచ్చటేస్తుంది. ఆ వంటలు తిని మెచ్చుకుంటే తల్లి మరింత ఇష్టపడ్తుందని తెలిసినా మూడ్ సరిగా లేక, తల్లి బాధపడ్తుందనే సంగతే విస్మరించింది.

కాసేపయ్యాక తల్లికి 'కాఫీ' ఇష్టమని తెలిసినా, కాఫీపొడి, అందుకు సరిపడా పాలులేక ఉన్న కాసిని పాలతో 'టీ' కలుపుకొచ్చి ఇచ్చింది.

"అదేంటీ, నా ఒక్కదానికే తెచ్చావ్? నువ్వు తెచ్చుకోలేదేం? " అందామె కప్పు అందుకుంటూ.

"నేనింతకుముందే తాగానమ్మా" అంది నమ్రత, అబద్ధం చెప్పాల్సి వస్తున్నందుకు బాధపడుతూ.

అక్కడే కూర్చుంటే, తల్లి ఇంకా ఎన్ని ప్రశ్నలేస్తుందోనని పెరట్లోకెళ్ళి అన్నీ సర్ద సాగింది. ఎంతవద్దనుకొన్నా ఆ ఉదయం జరిగిన సంఘటన కళ్ళలో మెదలసాగింది. పొద్దుటే "నమ్రతా, వాసుకెలా వుంది? వాడు స్కూల్‌కి రావటం లేదని ధాత్రి చెప్పింది. ఇంకా జ్వరం తగ్గలేదా? " అంటూ వచ్చింది రాధ.

రాధ, విశాల్‌కి వరుసకి మరదలవుతుంది. కానీ వారిద్దరూ అన్న చెల్లెళ్ళకన్నా ఎక్కువగా అభిమానంగా వుంటారు.

రాధకి బాల్యంలోనే వివాహం కావటంతో పుట్టింట్లోనే ఉండేది. ఆమె పెద్దమనిషయ్యాక, అత్తవారింట్లో దించిరావాలని అనుకొన్నాడామె తండ్రి.

పల్లెటూర్లో ఇంట్లో ఏ వేడుక జరిగినా దగ్గరివారిని, ముఖ్యంగా అల్లుడినీ, అల్లుడి తరపువారినీ దగ్గరుండి తీసుకురావటం, వాళ్ళకి శ్రద్ధగా మర్యాదలు జరిపి, బట్టలు పెట్టి, మళ్ళీ తామెళ్ళి దిగబెట్టడం లేదా ఛార్జీలిచ్చి పంపడం పరిపాటి.

కూతురికీ, అల్లుడికీ శోభనం జరిపించి, మూడునిద్రలూ అయ్యాక దిగబెట్టి వద్దా

మని వెళ్ళాడు రాధ తండ్రి. వాళ్ళందరూ వచ్చే టాక్సీని, లారీ గుద్దేయడంతో మామా, అల్లుళ్ళిద్దరూ స్పాట్‌లోనే చనిపోయారు. రాధ అత్తా, ఆడబడుచులకు గాయాలయ్యాయి. దాంతో రాధ అత్తింటి తరపువారంతా రాధని దురదృష్టజాతకురాలంటూ దుమ్మెత్తిపోశారు. జరిగిన ఘోరం తట్టుకోలేక తల్లి కూడా గుండెపోటొచ్చి చనిపోవడంతో, రాధ ఆత్మహత్య చేసుకోబోయింది. అది విశాల్ కంటపడటంతో రాధ ప్రాణాలతో మిగిలింది. విశాల్ తప్ప దగ్గరి బంధువులెవరూ లేకపోవడంతో రాధ తిరిగి మామూలు మనిషయ్యేంతవరకూ, ఆమెని కంటికిరెప్పలా చూసుకున్నాడు విశాల్. ఆమె అత్తింటివాళ్ళతో సామరస్యంగా మాట్లాడి రాధకు రావలసిందంతా ఇప్పించాడు. ఆమె ఉంటున్న ఇంటికి మరమ్మత్తులు చేయించాడు. అద్దె వచ్చేలా ఏర్పాటు చేశాడు. పొలంలో పంటలు పండించేందుకు కూలీలనేర్పాటు చేశాడు. అతని ప్రోత్సాహంవల్ల రాధ, తనో స్త్రీనన్న సంగతి విస్మరించి పొలం పనుల్లోకి దిగింది. అంతేగాక, విశాల్ తన స్నేహితులతో కలిసి తమగ్రామ సంక్షేమం కోసం చేసే పనుల్లోనూ పాలుపంచుకొంటూ వుంటుంది. ఊరంతా మగరాయుడు అంటూంటే నవ్వుకొనేంతగా ఎదిగింది.

ఎవరెన్ని చెప్పినా రెండోపెళ్ళికి మాత్రం ఒప్పుకోలేదు. విశాల్, నమ్రతలు ఎంతగానో నచ్చజెప్పినా "నేను మనసు పడ్డవాడు దొరకలేదు. అమ్మానాన్నలు కుదిర్చినవాడు పోయాడు, అందుకే పెళ్ళిమీద ఆసక్తి చచ్చిపోయింది" అనేది.

"ఎందుకు ఒంటరి బతుకు? " అని వాళ్లు నచ్చజెప్పబోతే "నాది ఒంటరిబతుకు కాకూడదనే కాబోలు ధాత్రిని ఇచ్చాడా దేవుడు" అంటుంది.

ధాత్రి ఎవరో కనిపారేసిన పిల్ల. ఆ పిల్లని అనాథాశ్రమంలో చేర్చారెవరో. అప్పుడప్పుడు అనాథాశ్రమానికి వెళ్ళి పళ్ళు మొదలైనవి పంచి వచ్చే రాధని ఆకట్టుకొంది ఆ పిల్ల. ఆమెకోసారి బాగా జ్వరమొచ్చి, ఓ కాలు చచ్చుబడినట్లైంది. ఆశ్రమంలో వెలేసినట్లు బతికే ఆ పిల్లని చూసేసరికి రాధ తట్టుకోలేక పోయింది. అంతే ఆమెను దత్తత చేసుకొని, ఇంటికి

## అనుభవాలే కథాంశాలుగా..



వాలి హిరణ్మయీదేవి

నా పేరు వాలి ఉమాదేవి. ముప్పైనాలుగు సంవత్సరాలుగా వాలి హిరణ్మయీదేవి పేరిట సాహితీరంగానికి సుపరిచితురాలిని. ఇప్పటివరకు 200లకు పైగా కథలు, 3 నవలలు, ఆకాశవాణిలో 20 నాటకాలు వెలుగు చూశాయి. ఇది నా నాలుగో నవల.

నేల విడిచి సాముచేసేకన్నా జీవితంలోని అనుభూతులను, అనుభవాలను కథలుగా మలిస్తేనే పాఠకుల మదిలో సుస్థిరంగా ఉంటాయని నా నమ్మకం.

నా రచనా వ్యాసంగానికి తోడ్పడుతూ సహకారాన్ని అందిస్తున్న నావారందరికీ, ప్రోత్సహిస్తూ ప్రచురిస్తున్న చతుర సంపాదకవర్గానికి, ఆదరిస్తున్న పాఠకదేవుళ్లకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

చిరునామా:

**వాలి హిరణ్మయీదేవి**
12-2-709/107, ఫ్లాట్ నె. 302
ప్రాస్ హైట్స్, నవోదయ కాలని
గుడిమల్కాపూర్, కూరగాయల
మార్కెట్ సందు, మెహదీపట్నం,
హైదరాబాద్-500028

## కొత్తగాలి...

**నాటే ప్రతిమొక్కా**
**నిలవాలి తరువై**
**కావాలి ప్రతి తరువూ**
**ప్రజలపాలిట కల్పతరువు!**

– బి.వి. నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

తీసుకొచ్చేసింది.

ఇక ధాత్రి పేరుకే రాధ బిడ్డగానీ వాసూ మూలంగా ఎక్కువగా నమ్రతా వాళ్లింట్లోనే గడుపుతుంటుంది. ధాత్రి అంటే వాసు కెంతో ముద్దు.

నమ్రత, విశాల్‌లు చూపించే ప్రేమాను రాగాలవల్లే, తల్లీ కూతుళ్ళు ఆ ఇంటిని తమ పుట్టింటిగా భావిస్తుంటారు. పొలం పనులతో, ఊరి వ్యవహారాలతో ఎంతో బిజీగా వుండే రాధ, రాకపోకలు జరిపేది నమ్రతా వాళ్ళింటికి మాత్రమే.

"నమ్రతా! వాసుకెలావుందని అడుగు తూంటే ఆలోచిస్తున్నావేంటి? " అంటూ ఆమె భుజం తడుతూ, రాధ మరోసారి అడిగేసరికి ఈ లోకంలోకొచ్చి "ఏంటో, వీడి జ్వరం వల్ల మతి మతిలో లేదు రాధా. పాపం కడుపులో ఏమీ లేదుకదా నీరసంతో పడుకున్నాడలా" అంది గబు క్కున నమ్రత.

"అరరే! లక్ష్మి నాల్రోజులుగా పాలి వ్వడం లేదుకదా, మరిచేపోయా" అంటూ వెళ్ళి, పావుగంటలో చెంబెడు పాలూ బ్రెడ్డూ తీసుకొచ్చింది రాధ.

"నువ్వీ పాలు వెచ్చజేసి, పంచదార కలిపి తీసుకురా, అంతవరకూ వీడి దగ్గర నేనుంటాలే" అంటూ వాసు దగ్గరికి నడి చింది రాధ.

నమ్రత పాలు కలిపి, తెచ్చివ్వబోయింది. ఆకలితో ఉన్న వాసూ ఆత్రంగా వాటిని అందుకోబోయాడు, కానీ నీరసం వల్ల పట్టు తప్పటంతో గ్లాసు కిందపడి, పాలన్నీ నేలపాలయ్యాయి.

నమ్రతకు ఒక్కసారిగా కోపమూ, ఏడ్పూ ముంచుకొచ్చాయి.

"దరిద్రుడా! చిన్న గ్లాసు సరిగ్గా పట్టుకో లేకపోయావూ? " అంటూ వాసు చెంప మీద కొట్టింది.

ఎప్పుడూ కనీసం గట్టిగా కోప్పడని తల్లి ఒక్కసారిగా చెంప చెళ్ళుమన్పించేసరికి బెదిరిపోయి, ఏడ్వందుకొన్నాడు వాసు.

రాధ నివ్వెరపోయింది. వెంటనే తేరు కొని వాసుని దగ్గరికి తీసుకొని "నమ్రతా, నీకేమైనా మతిపోయిందా ఏంటి? వీడింకా పసిపిల్లాడు. మీలా అన్నిటికీ తట్టుకొనే శక్తి లేనివాడు. మిగిలిన పాలున్నాయేమో వెళ్ళి తీసుకురా" అంది.

ఈ లోగా వంటింట్లో చప్పుడు కావ డంతో, పరుగున వెళ్ళింది నమ్రత. పాల గిన్నె పడేసి, కింద వలికిపోయిన పాలను తాగుతున్న పిల్లి కనిపించింది. చేష్టలు దక్కి, నిస్సహాయంగా చూస్తూ నిలబడిపో యింది నమ్రత.

ఆమె వెనుకే వచ్చి జరిగిందంతా చూసిన రాధ "పోనీలే నేను వెళ్ళి మళ్ళీ పట్టుకొస్తాను" అంటూ కిచెన్ గట్టు వంక చూసి "ఏంటీ, వంట చేసినట్లే లేదు. ఏం నేను చచ్చాననుకొన్నారా? ఒక్కమాట చెబితే ఏం పోయింది? నేనంత పరాయి దాన్నయ్యానా? " అంది బాధగా.

దాంతో, ఒక్కసారిగా బరెస్టయి, ఆమెను పట్టుకొని ఏడ్చేసింది నమ్రత.

"రాధా! ఎంతకని సాయం చేస్తావ్? మా అత్తమామలు పోయినపుడు ఖర్చంతా నువ్వే భరించావ్. ఈ ఆరు నెలలుగా అడపాదడపా ఆదుకుంటూనే వున్నావ్. మా అమ్మనాన్నల సాయం తీసుకోవటం విశాల్‌కిష్టం వుండదని, నువ్వే ముందు

కొచ్చి సహాయం చేస్తున్నావ్. ఎన్నాళ్ళని చేస్తూంటావ్? మా ఖర్మేంటో గానీ పంటలు సరిగ్గా పండక, డబ్బుకి కటకట మొదలైంది. ఇప్పుడే కోళ్ళకి రోగాలొచ్చి చావటం, లక్ష్మికి జబ్బు చేయటం, వీడికి జ్వరం రావటం.. ఏంటి? ఆ దేవుడెందు కిలా మమ్మల్ని పరీక్షిస్తున్నాడో?

డబ్బూ, బంగారం కరిగిపోయాయి. వాసుకి రోజూ ఇచ్చే పాలూ గుడ్డూ కరు వయ్యే ఇలా అర్భకంగా మారాడు. చేతికం దాల్సిన డబ్బూ అందడంలేదు. నువ్వ యినా ఎన్నాళ్ళని సాయం చేస్తావ్ చెప్పు? " అంటూ బావురుమంది నమ్రత.

రాధ కళ్ళు చెమర్చాయి. ఆమెను దగ్గ రకు తీసుకొంటూ "ఛ, ఊరుకో. రోజులన్నీ ఒకేలా ఉంటాయేంటి? మీకీమాత్రం సాయం చేయగలుగుతున్నానంటే, దాని క్కారణం విశాలేగా. విశాలే పూనుకోకపోతే నేనిలా వుండేదాన్నా? అయినా డబ్బు సాయందేముంది, అలా బ్యాంక్‌లో మూలి గేకన్నా ఇలా అవసరపడితేనేగా సద్విని యోగమైనట్లు. మా పొలాలపక్కనే మీ పొలాలూ వున్నా బావుండిపోయేది. నీటికి లోటుండేది కాదు.

విశాల్ ఎన్నాళ్ళని నీళ్ళులేక బాధప డ్తాడు చెప్పు? నా మాట విని మీ పొలా లని ఎవరికైనా కౌలుకిచ్చేసి, పట్నం వెళ్ళ మను. ఏదో ఒక జాబ్ దొరక్కపోదు. పైగా తన 'కీ' బోర్డ్ ప్రావీణ్యానికి మెరు గులు దిద్దుకోవచ్చు. అక్కడైతే టీవీల్లోనో, సినిమాల్లోనో ఛాన్స్ దొరికే అవకాశముం దంటే విన్పించుకోడేంటి? పల్లెటూళ్ళు దేశా నికి పట్టుకొమ్మలని ఇక్కడే వుండి తిప్పలు పడ్తున్నాడు. నువ్వూ అందుకు వంత పాడుతున్నావు. ఈ పల్లెటూళ్ళ బాగు కోసం మేమంతా లేమా? నువ్వూ కాస్త నచ్చజెబుతూ వుండు. తనలో ఎంత టాలెంట్ వుందో విశాల్‌కి అర్థం కావడం లేదు. అక్కడికెడితే తను తప్పకుండా సక్సెస్ అవుతాడు. సంకల్పం గట్టిగా వుంటే విజయం వెన్నంటి వస్తుంది. ప్రతీ ప్రయత్నం సత్ఫలితాన్నివ్వకపోవచ్చనేది నిజమేగానీ అసలే ప్రయత్నించకుంటే ఎలా? తను వెళ్ళాక మీరిద్దరూ ఇక్కడ ఇబ్బంది పడతారేమోనన్న భయంతో జంకుతున్నట్లుంది. డబ్బు గురించి ఇబ్బంది పడొద్దను. అంతగా అయితే మళ్ళీ తిరిగివ్వొచ్చు గదా నాకు. నేనివాళే డబ్బు డ్రా చేసి తెచ్చిస్తాను. నువ్వెలాగైనా విశాల్‌ని హైద్రాబాద్ వెళ్ళి ప్రయత్నాలు మొదలెట్టమని చెప్పు" అంటూ అప్పటిక ప్పుడు బ్యాంక్‌కి వెళ్ళి డబ్బు తెచ్చిచ్చింది.

ఎంతో నచ్చజెప్పాక విశాల్ హైద్రాబాద్ వెళ్ళడానికి అంగీకరించాడు. అక్కడ ఎవ రినో కలిసి వస్తానన్నాడు. లక్ష్మిని దారి లోనే ఉన్న హాస్పిటల్లో చేర్చి, తిరిగివచ్చేట ప్పుడు ఇంటికి కావల్సినవన్నీ పట్టుకువస్తా నని చెప్పి వెళ్ళాడు. బహుశా సాయంత్రా నికల్లా తిరిగిరావచ్చు. ఇంకొంచెం ముందు గానే వచ్చేస్తే బాగుండును అనుకొంటూ వాకిలివైపే చూడసాగింది నమ్రత, మధ్య లో తల్లి అడిగే ప్రశ్నలకు జవాబులిస్తూ.

వాసు 'దాహం' అనేసరికి, నీళ్లకోసం వంటింట్లోకి వెళ్ళింది వసుంధర. అక్కడ వంట చేసిన జాడలేవీ కన్పించకపోయేస రికి ఎంతో బాధ కల్గింది. కూతుర్ని, మన వడిని పస్తులుంచుతున్న అల్లుడిమీద పీక లవరకూ కోపం ముంచుకొచ్చింది. తర్వాత ఆ కోపం నమ్రత మీదకు మళ్ళింది.

'ప్చ్, ఎంత చెప్పినా వినకుండా ఆస్తిపా స్తుల్లేని విశాల్‌ని పట్టుబట్టి మరీ పెళ్ళా డింది. పెళ్ళయిన కొత్తలో ఏం బాగు న్నారో గానీ ఈమధ్య కాలంలో ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు' అను కొంటూ కళ్ళొత్తుకుంది.

వాసుకు గ్లాసుతో మెల్లిగా నీళ్ళు పట్టిం చింది. జ్వరంతో నీరసించిన వాడిని చూస్తోంటే ఆమెకు కడుపులో బాధ సుళ్ళు

తిరిగింది.

ఆమె కళ్ళముందు నమ్రత చిన్ననాటి సంగతులు, పెళ్ళికి ముందు జరిగిన సంఘటనలు కదలసాగాయి.




"ఏంటే? మతి వుండే మాట్లాడుతున్నావా? రాఘవకేం లోటుందని? ఎంచక్కా అమెరికాలో వుంటూ బోలెడు సంపాదిస్తున్నాడు. వాడిని పెళ్ళి చేసుకొంటే నువ్వు జీవితాంతం సుఖంగా వుంటావ్" అంది వసుంధర.

రాఘవ ఆమె అన్న కొడుకు.

"బావని నేనా దృష్టితో ఎప్పుడూ చూడలేదు" స్థిరంగా చెప్పింది నమ్రత.

వాళ్లిద్దరి మధ్యా ఎనిమిదేళ్ళ తేడా వుండటంతో నమ్రత, రాఘవని ఒక అన్నలా భావించింది.

"పోనీ రాజుబావ మీదైనా ఆ దృష్టి ఉందా? " అప్పటివరకూ తల్లీకూతుళ్ళ సంభాషణ వింటున్న, నమ్రత తండ్రి ఆదివిష్ణు అడిగాడు.

రాజు, అతని అక్క కొడుకు. బెంగళూర్లో ఇంజనీర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు. అతడికి తన కూతుర్నిచ్చి పెళ్ళి చేయాలనుంది ఆదివిష్ణుకి.

"నాన్నా, ఈ మేనరికాలు మంచివి కావని తెలుసుగా. నేను రాఘవ బావని గానీ, రాజు బావని గానీ చచ్చినా పెళ్ళి చేసుకోను" కొంచెం కోపంగానే కచ్చితంగా చెప్పింది నమ్రత.

ఇంతకుముందు కూడా ఆ విషయం చెప్పినా, మళ్లీ వాళ్ళిద్దరూ ఆ టాపిక్ తేవడం నచ్చలేదు నమ్రతకు.

వసుంధరకి విపరీతమయిన కోపం ముంచుకొచ్చింది "ఏం, నేనూ మేనరికమే చేసుకొన్నాను. నువ్వే అవకరంతోనూ పుట్టలేదుగా? " అంది కూతురుతో తన వాదనని బలపరచుకొంటూ.

"తరతరాలుగా మేనరికాలు చేసుకొంటూ పోతే బుద్ధిమాంద్యం ఉన్న పిల్లలు పుడతారు, అపుడు వాళ్ళతో జీవితాంతం బాధ పడవలసి ఉంటుంది" నచ్చజెబుతున్నట్లు అంది నమ్రత.

రాఘవ అక్కడో అమ్మాయినిష్టపడుతున్నాడని అతనే చెప్పగా తెలిసింది. అతడి అభ్యర్థన మేరకే ఆ విషయాన్ని రహస్యంగా ఉంచుతోంది నమ్రత. అది తెలియని తల్లి తనని ఆ ఇంటి కోడలిని చేయాలనుకొంటోంది. తన వదినకు డబ్బుయావని తెలిసినా, ఆమె కోరినంత ఇచ్చి పెళ్ళి జరిపించాలని తల్లి కోరిక.

"అలా జరగాలనేం రూల్ లేదులేవే. నా మాట విని రాఘవని కట్టుకో. నాల్గుతరాలు కూర్చొని తిన్నా తరగని ఆస్తి వుంది. కష్టమనేది తెలీకుండా జీవితం గడిచిపోతుంది. ఈ ఒక్కసారీ నామాట వినవే తల్లీ" బతిమాలింది వసుంధర.

"ఆస్తి ఉంటే చాలా? మరి అంత ఆస్తి ఉండీ అత్త కట్నం ఆశిస్తున్నదెందుకు? మీరేమో ఉన్నదంతా నాకోసం ఖర్చుచేసి ఎలా బతుకుతారు? అయినా అమెరికా అంటే అదో స్వర్గంలా భావిస్తావెందుకమ్మా? అక్కడిద్దరూ యంత్రాల్లా మారి సంపాదించనిదే గడవదు. అయినవారిని కష్టాలపాల్జేసి వెళ్ళి నేనో యంత్రంలా మారవలసి వస్తుందంతే. ఏ ఆనందానికీ నోచుకోకుండా వుండటంలో ఏం సుఖముందమ్మా? ఏళ్ళ తరబడి ఒకర్నొకరు

చూసుకోకుండా ఉండాల్సొస్తుంది తెల్సా? నువ్వు అలా వుండగలవా? " చిరాగ్గా అంది నమ్రత.

"బెంగళూరైతే, మరీ అంతదూరం కాదుగా, ఏడాదిలో నాలుగుసార్లయినా చూసుకోగలం కదా" ఆశ చావక మళ్లీ అడిగాడు ఆదివిష్ణు.

"నాన్నా, నాకు మనూరిని వదిలెళ్ళాలని లేదు. మనూళ్ళో కాలేజి లేక, మిమ్మల్ని వదిలి మూడేళ్ళపాటు హాస్టల్లో ఉన్నప్పుడు ఎంత నలిగిపోయానో! మధ్యమధ్యలో అక్కడే ఉన్న శర్వాణత్త ఇంటికి వెళ్ళబట్టి కాస్త బెంగ తగ్గేది. శర్వాణత్త కూతురు మిసిమి, తోబుట్టువులాగే మసలుకొనేది కాబట్టి, వాళ్ళింట్లోనైనా ఫ్రీగా వుండగలిగే దాన్ని. మీకు దూరంగా వెళ్ళే ప్రసక్తే లేదు. నేను తప్పించి మిమ్మల్ని పట్టించుకొనే వాళ్ళు ఇంకెవరూ లేరు కదమ్మా" అంటూ వాకిట్లోకి వెళ్ళిపోయింది, పావురాళ్ళకి జొన్నలు జల్లే మిషమీద.

"ఏడ్చినట్లే ఉంది. 'బుద్ధి భూములేల మంటే రాత రాళ్ళేరమందన్నట్లు', ఈ పల్లె టూళ్ళోనే పాతుకుపోతానంటావేం? " నమ్రత వెనుకే వెడుతూ అంది వసుంధర.

తనెంతగా ఆ టాపిక్‌ని కట్ చేయబో యినా, తల్లి సాగదీయడంతో, నమ్రతకు అసహనం కలిగింది. అది గమనించిన ఆదివిష్ణు, ఆమె వంక సాలోచనగా చూసి "పోనీ, నీకు నచ్చిన వారెవరైనా ఇక్కడు న్నారా? " అడిగాడు లాలనగా.

"ఉంటే, వాడికెవరికో ఇచ్చి కట్టబెట్టే స్తారా? " అంటూ గయ్యిమంది వసుంధర.

"అబ్బ, కాసేపు నువ్వు మాట్లాడకు" అంటూ వసుంధరని గసిరాడు ఆదివిష్ణు.

"నమ్రతా! నువ్వేం చిన్నపిల్లవి గాదు. ఏదైనా తెలివిగా ఆలోచిస్తావనే నా నమ్మకం. నీ మనసులో ఏముందో నిస్సం కోచంగా చెప్పు. ఎవరినైనా ఇష్టపడ్డావా? " నెమ్మదిగా అడిగాడతను.

'అదేం ప్రశ్న? ' అంటూ వసుంధర ఏదో అనబోతూంటే "నిన్ను మధ్యలో మాట్లాడొ ద్దన్నానా? " కోపంగా చూస్తూ అన్నాడు ఆదివిష్ణు.

భర్తలో అంతకోపాన్ని ఎప్పుడూ చూడని వసుంధరకు అయిష్టంగానే మౌనం వహిం చక తప్పలేదు.

నమ్రత ఇబ్బందిగా చూసింది.

"అమ్మ మాటలకేంగానీ చెప్పమ్మా, నువ్వెవరినైనా ప్రేమించావా? " బుజ్జగిస్తు న్నట్లు అడిగాడు ఆదివిష్ణు.

"నిజం చెప్పాలంటే ఇష్టమో, ప్రేమోగానీ, అది ఏకపక్షంగానే ఉంది" అంది నమ్రత నసుగుతున్నట్లు.

"ఏడ్చినట్లుంది, ఈ మాత్రానికేనా రాఘ వని పెళ్ళాడనని వాడి మొహాన్నే చెప్పావ్? " చిరాగ్గా అంది వసుంధర.

"వసూ" కోపంగా గద్దించాడు ఆదివిష్ణు.

దాంతో, వాళ్లిద్దరివంకా కోపంతో చూస్తూ కూర్చుంది వసుంధర.

"చెప్పు నమ్రతా! ఆ అబ్బాయెవరు? మ న ఊరేనా అతనిది? "

"మనూరు కాదు గానీ, ఈ చుట్టుపక్కల పల్లెటూరే అనుకుంటా. హాస్టల్లోనే ఉండే వాడు. నా సీనియర్, పేరు విశాల్. 'కీబోర్డ్' అద్భుతంగా ప్లే చేస్తాడు. అతనికి పల్లెటూళ్ళన్నా, వ్యవసాయమన్నా ఎంతో ఇష్టమని అతడి మాటల్లో, డిబేట్స్‌లో తెలి సింది" అంది నమ్రత.

నవ్వొచ్చింది ఆదివిష్ణుకి. "చూడమ్మా, కాలేజీలో చదివే మీకు ఈ వాస్తవ ప్రపంచం గురించి తెలీదు. ఏవో కలలు గంటుంటారు. అయినా అతడేదో అన్నంత మాత్రాన, ఇష్టాలు కలిశాయనుకొంటూ, ఏకంగా జీవితాన్నే పంచుకోవాలనుకోవడం చిన్నపిల్లల చేష్టగా ఉంది. ఈనాటి కుర్రకా రంతా ఆశించేది వైట్‌కాలర్ జాబ్‌లేగా. వ్యవసాయం చేస్తూ బతకాలనుకోవడం, దూరపు కొండలు నున్నగా ఉన్నాయని

భ్రమించడం లాంటిదే" అన్నాడు.

"విశాల్ మాటలమనిషి కాదు నాన్నా, చేతల మనిషే. అందరూ ఉద్యోగాల వేట మొదలెడితే, విశాల్ మాత్రం తనూళ్ళో వ్యవసాయం మొదలెట్టాడని మా ఫ్రెండ్ చెప్పగా తెల్సి అతడి మీదున్న గౌరవం రెట్టింపయింది" అంది నమ్రత.

"కానీ ఇప్పుడు వ్యవసాయం గాలివాటుగా మారిందమ్మా. నీకో సెక్యూర్డ్ లైఫ్‌ని అందించాలని మా తాపత్రయం. అర్థం చేసుకో" అన్నాడతను.

"భద్రతనేది ఉద్యోగాలని బట్టి ఉంటుందనుకోను" మొండిగా అంది నమ్రత.

"ఇంతకీ వాళ్ళది మన కులమేనా? ఏమన్నా ఆస్తిపాస్తులున్నాయా? " ఇక ఆగలేక, ఆరాగా అడిగింది వసుంధర.

"ఏమో, అవన్నీ తెలీవమ్మా" ఇబ్బందిగా అంది నమ్రత.

"కనీసం మీరిద్దరెప్పుడైనా మాట్లాడుకొన్నారా, లేదా? " అనుమానంగా అడిగాడు ఆదివిష్ణు.

"మాట్లాడుకోడం అంటే అతని ఆర్టికల్స్ చదివినప్పుడు రెండుమూడుసార్లు అభినందించాను. డిబేట్స్‌లో చక్కగా మాట్లాడితే మెచ్చుకొన్నాను. నిజానికి నేనతనికి ప్రత్యేకంగా తెలుసో, లేదో, గుర్తున్నానో లేదో కూడా తెలీదు. చాలామందే అభినందించి ఉంటారు నాలా. ఒకసారి మాత్రం నా ఆర్టికల్స్, నా భావాలూ తనకూ నచ్చుతాయని చెప్పాడు" అంది నమ్రత.

"సరిపోయింది సంబడం. ఈ మాత్రం దానికే.." అంటూ ఇంకా ఏదో అనబోతున్న వసుంధరని వారించాడు ఆదివిష్ణు.

"అతని అడ్రెస్ ఉంటే ఇవ్వు. ఓసారి వెళ్ళి కలుస్తాను" అని ఆదివిష్ణు అంటుంటే ఇక ఊరుకోలేకపోయింది వసుంధర.

"మీకేమైనా మతిపోయిందా? చిన్నపిల్ల దానికేం తెలుసని? అది చెప్పడం, మీరు వినడం.. చాలా బాగుంది. అయినా పిల్లాడి తరపు వాళ్ళొచ్చి పిల్లనిమ్మని అడగడం మన సంప్రదాయం. అంతేగాని మీరు ఎగేసుకుంటూ వెళ్ళడమేంటి? " అంది గట్టిగా, 'అదేం జరిగే పనిగాదని' మనసులో అనుకుంటూ.

ఆమె మాటలు ఆదివిష్ణు తెలుగు కాలెండర్ తిరగేసి "వారం తర్వాత దశమి. ఆరోజు వెళ్ళి మాట్లాడ్తాను. వారు పెళ్ళికి సుముఖత చూపిస్తే, పెద్దలను పిలిపించి మాట్లాడుకొందాం" అన్నాడు, ఇక అదే ఫైనల్ అన్నట్లు.

'అమ్మయ్య' అనుకొంది నమ్రత.

వసుంధరకి మాత్రం గుండెల్లో రైళ్ళు పరుగెత్తినట్లయింది. మనసులో రకరకాల ఆలోచనలు చేస్తూ 'ఎలాగయినా, ఈ నాల్రోజుల్లో వదినను ఒప్పించి రప్పించాలి' అనుకొంది.

"నాన్నా నా దగ్గర అతని అడ్రెస్ లేదు. నా ఫ్రెండ్ రమ కాలేజీలో సెక్రటరీ కాబట్టి దాని దగ్గర వివరాలు ఉండొచ్చు. కానీ తనిప్పుడు వైజాగ్ వెళ్ళింది. రావటానికింకా నాలుగైదు రోజులు పట్టొచ్చు" అంది నమ్రత.

"సరే, ఆ అమ్మాయ్ వచ్చాక అడ్రస్ తీసుకొని వెడతాను" అన్నాడు ఆదివిష్ణు.

'ఆ పిల్ల రావడానికింకో పదిరోజులు పడితే బాగుణ్ణు' అనుకొంది వసుంధర.

ఎలాగయినా కూతుర్ని రాఘవకిచ్చి పెళ్ళి చేయాలని ఎన్నెన్నో ఆలోచిస్తూ కూర్చుండి పోయిందామె. కూతురు అమెరికా వెడితే, ఆ వెనుక, తనూ వెళ్ళొచ్చన్న ఆశ ఉందామె మనసులో.

ఆ మరునాడు టీవీలో ఏదో పాత తెలుగు సినిమా వస్తుంటే చూస్తూ కూర్చున్నారు వసుంధర, ఆదివిష్ణులు. చాలా విషయాల్లో భిన్నాభిప్రాయాలే ఉన్నప్పటికీ, పాతసినిమాల విషయంలో మాత్రం వారిది ఏకాభిప్రాయమే. కలిసి సినిమా చూడటం ఇద్దరికీ ఇష్టం.

అక్షరం

ప్రపంచంలో అణ్వస్త్రాలను మించిన ఆయుధం
మనకున్న సహనం
రక్తపాతంతో గెలవలేనిది
చిన్న చిరునవ్వుతో గెలవగలం

– గౌతమబుద్ధుడు



ప్రతి ఆదివారం ఏదో ఒక స్పెషల్ వంటకం చేయడమంటే నమ్రతకు ఇష్టం. ఆ ఇష్టాన్ని వసుంధరే కలిగించింది, కూతురికి పనీపాటలతోబాటు వంటలూ, పిండి వంటలూ రావాలని.

ఆరోజు ఆదివారం కావడంవల్ల కిచెన్‌లో బిజీగా ఉంది నమ్రత.

గుమ్మంలోకి ఎవరో వచ్చినట్లనిపించి తొంగి చూసింది వసుంధర. ఆమె చూపులననుసరించి చూసిన ఆదివిష్ణుకి ఓ జంట కన్పించగా వెళ్ళి తన సహజసిద్ధమయిన చిరునవ్వుతో "ఎవరు కావాలండీ మీకు? " అనడిగాడు.

అతని నవ్వుముఖం చూస్తూనే ఇంప్రెసై పోయారా దంపతులు.

"నమస్తే! నా పేరు సూర్యనారాయణ మూర్తి, ఈవిడ నా భార్య, పేరు ఛాయా దేవి. మీతో మాట్లాడాలి" అన్నాడతను చిరునవ్వుతో.

ఆశ్చర్యాన్ని మనసులోనే అణచుకుంటూ "రండ్రండి. లోపలికొచ్చి కూర్చోండి" అంటూ సోఫా చూపించాడు.

వసుంధర భర్త వంక చూసింది 'వారెవరన్నట్లు? '

అది గమనించిన సూర్యనారాయణ మూర్తి "మాది పక్కనున్న రఘునాథపురం. ఇక విషయమేమిటంటే, మేం మా అబ్బాయికి పెళ్ళి సంబంధాలు చూడాలనుకుంటుంటే, మావాడు మీ అమ్మాయిని ఇష్టపడ్తున్నానని చెప్పాడు. మీకూ ఇష్టమైతే పెళ్ళి విషయాలు మాట్లాడ్దామని వచ్చాం" అన్నాడు సూటిగా.

"మీ అబ్బాయి పేరేంటి? " అడిగాడు ఆదివిష్ణు.

"విశాల్. బి.ఎస్సీ అగ్రికల్చర్ చేశాడు. తనకైతే అమ్మాయి కొద్దిగా తెలుసు, కానీ ఆమెకి తనంతగా తెలుసో లేదోనన్నాడు. అందుకే ఫొటో తీసుకొచ్చాం, చూడండి" అంటూ విశాల్ ఫొటో అందించాడు సూర్యనారాయణమూర్తి.

ఆదివిష్ణు వసుంధరలు ఆశ్చర్యంతో ముఖముఖాలు చూసుకొంటూ ఫొటో అందుకున్నారు. 'ఎంత కో ఇన్సిడెన్స్! ముందురోజేగా తను వెళ్ళాలనుకొన్నాడు' అనుకొన్న ఆదివిష్ణు ఫొటో చూసి 'బాగున్నాడు' అనుకొన్నాడు.

ఇంతలో తను చేసిన 'గోబీ మంచూరియా'ని ప్లేట్‌లో పెట్టి తీసుకొస్తూ "అమ్మా, టేస్ట్ చూసి చెప్పు సరిగ్గా కుదిరాయో లేదో? " అంటూ వచ్చిన నమ్రత, అక్కడ కూర్చొని ఉన్న అపరిచితుల వంక చూస్తూ, అలాగే నిలబడిపోయింది.

బంగారుఛాయలో, నాజూకైన కనుముక్కుతీరుతో ఒక్క ముక్కలో చెప్పాలంటే బాపూ గీసిన బొమ్మలా ఉన్న నమ్రతను చూడగానే వారి కళ్ళు మెరిశాయి. కొడుకు ఎన్నికపట్ల గర్వమూ కలిగింది సూర్యనారాయణ దంపతులకు.

"అలా టీపాయ్ మీద పెట్టమ్మా, అతిథులు గూడా రుచి చూస్తారు" అన్నాడు ఆదివిష్ణు కూతురితో.

"కతికితే అతకదంటారు, క్షమించాలి" అన్నాడు సూర్యనారాయణ.

"రండి, ఇల్లంతా చూద్దురుగాని" అంటూ



వసుంధర ఛాయాదేవిని లోపలికి తీసుకొని వెళ్ళింది.

వీలయినంత సౌమ్యంగా మాట్లాడుతూ వారి నుండి వివరాలను రాబడుతున్న తల్లిని గమనిస్తూ నవ్వుకొంది నమ్రత.

"మాకైతే అమ్మాయి చాలా నచ్చింది. మీరు మా ఇంటికొచ్చి అబ్బాయిని చూసి వెళ్ళండి. వివరాలు నచ్చితే ప్రొసీడవచ్చు" అన్నాడు సూర్యనారాయణ.

అతని సంస్కారంపట్ల చాలా ఇంప్రెసైన ఆదివిష్ణు "అలాగే" అన్నాడు నవ్వుతూ.

"బొట్టు పెడతానుండండి" అంటూ ఛాయాదేవికి బొట్టుపెట్టి తమ పెరట్లోని జామపళ్లను ఆమె చేతికి అందించింది వసుంధర.

నవ్వుతూ వారినుండి సెలవు తీసుకొన్నారా దంపతులు.

వాళ్ళు వెళ్ళాక వసుంధర గొంతు విప్పింది. "వాళ్ళకి ఇల్లూ, ఐదెకరాల పొలమూ ఉన్నాయట. అమ్మాయికి ఇరవై తులాల బంగారం పెట్టదలచుకొన్నారట. 'మీ ఇష్టంతో మీ అమ్మాయికి ఏమిచ్చుకుంటారో ఇచ్చుకోండి. మేమేం కట్నకానుకలు డిమాండ్ చేయం' అందావిడ. మనిషి సౌమ్యురాలిలాగే ఉంది. ఆడపడుచుల్లేరు. ఈ అబ్బాయొక్కడేనట. బరువు బాధ్యత



లన్నీ అతనివేనట. మాటల్ని బట్టి చూస్తే తల్లిదండ్రుల్ని చూసుకొంటూ వ్యవసాయం చేసుకోవటమే తమ కొడుక్కి ఇష్టమన్నట్లు తేల్చింది మరి" అంది వసుంధర.

"తల్లిదండ్రుల పట్ల బాధ్యతగా ఉన్న వాడే భార్యనీ అపురూపంగా చూసుకోగ లడు" ఒక్కమాటలో తన ఇష్టాన్ని తెలియ జేశాడు ఆదివిష్ణు.

"సర్లెండి.. ఉద్యోగం సద్యోగం లేకుండా పల్లెటూళ్లో పడి ఉంటే ఎదుగుదల ఏముం టుంది? అయినా వ్యవసాయం, పాడీ ఉన్న ఇంట్లో ఎంత పని ఉంటుందో నాకు తెలీదా? అమ్మాయి అంతగా కష్టపడటం నాకిష్టం లేదు" అంది వసుంధర.

"వసూ, పనంతా అమ్మాయిమీదే పడు తుందని ఎందుకనుకుంటున్నావ్? పాలే ర్లుండరా, ఏం? ఉద్యోగం లేకున్నా చక్కగా వ్యవసాయం చేసుకొంటే స్వతంత్రంగా ఉంటూనే, ఆదాయాన్నీ పొందొచ్చు. అంతగా వ్యవసాయం లాభించకున్నా డిగ్రీ హోల్డర్ కాబట్టి ఎక్కడో ఓచోట జాబ్ చూసుకొంటాడులే. మన అమ్మాయినిష్టప డినా, పద్ధతిగా పెద్దలకు చెప్పి ఒప్పించి, వారినిక్కడకు పంపించాడంటే ఆ అబ్బా యెంత పద్ధతైన మనిషో తెలీడంలేదూ" అన్నాడు ఆదివిష్ణు.

"మంచి సంబంధం చూసి పెళ్ళి చేయాలనుకుంటుంటే మీరేంటిలా మాట్లాడుతున్నారు? " అంటూ మూతి ముడిచిందామె.

"మంచి సంబంధానికి నీ నిర్వచనం ఏంటో చెప్పు. మనమ్మాయిని అంతగా ఇష్టపడి వారికైవారు రావడం, అమ్మాయిని తప్ప అన్యమేదీ ఆశించకపోవడంలో తెలీడంలేదా వారి మంచితనం? " గట్టిగా అన్నాడు ఆదివిష్ణు.

నమ్రతలాగే విశాల్ కూడా తల్లిదండ్రులను అభిమానించడం, పెద్దల ద్వారానే అప్రోచ్ అవడం.. వారిది మంచి జంట అవుతుందని నమ్మకం కల్గించింది ఆదివిష్ణుకి. కూతురి కళ్ళలోని మెరుపులూ అతని మనసుని తాకాయి. నమ్రతా, విశాల్‌లు ఏకాభిప్రాయంతో ఆదర్శప్రాయంగా ఉండే జంట అవుతారని అతనికి బలంగా అన్పిస్తోంది.

"కాణీ కట్నం వద్దనడం, సింపుల్‌గా పెళ్ళి జరిపించమనడం ఏంటో నాకైతే అనుమానంగా ఉంది" అంది వసుంధర.

"వసూ! మనం నలుగుర్నీ వాకబు చేద్దాం. ఆ తర్వాత వాళ్ళూరికి వెళ్ళి ఇల్లూ వాకిలీ ఎలా ఉన్నాయో చూసొద్దాం, వాళ్ళ స్నేహితులు, బంధువుల్ని చూసి మాట్లాడితే వాళ్ళెలాంటివాళ్ళో తెలిసిపోతుంది కదా.. లేనిపోని అనుమానాలెందుకు? " అన్నాడు నచ్చజెబుతున్నట్లు.

"సరే" అంది వసుంధర. కానీ భర్తకూ నమ్రతకు తెలీకుండా, తన వదినతో ఫోన్‌లో మాట్లాడింది. అక్కడినుండి సరైన రెస్పాన్స్ రాకపోవడంతో బాధపడింది.

ఈలోగా కనుక్కున్న వివరాలు సంతృప్తికరంగా ఉండటంతో ఆదివిష్ణుతోబాటు విశాల్ వాళ్ళ ఊరికి వెళ్ళక తప్పలేదామెకి. వారి పద్ధతులు, మాటామన్నన, మర్యాదలు నచ్చడంతో 'ఊ' అనాల్సి వచ్చింది.

విశాల్ ఛామనఛాయ రంగు. ఆస్తిపాస్తులంతగా లేకపోవడం రుచించకపోయినా, తల్లిగా కూతురి ఇష్టానికి తలొంచక తప్పలేదామెకి.

తర్వాత పెద్దలంతా కూర్చొని మాట్లాడుకొని సంప్రదాయబద్ధంగా నమ్రత, విశాల్‌ల వివాహం జరిపించారు. సింపుల్‌గానే అయినా ఆహ్లాదకర వాతావరణంలో జరగడంతో వసుంధర తృప్తిపడింది.

ఆ తర్వాతర్వాత వారందరి ఆప్యాయతానురాగాలు, తమపట్ల చూపే గౌరవాభిమానాలకు ఆమెలోనూ వారంటే అభిమానం పెరగసాగింది. దగ్గరలోనే కూతురి అత్తవారిల్లుండటమూ ఆ దంపతులకు ఎంతో ఊరటనిచ్చింది.

పెళ్ళయిన మూడేళ్ళకి నెల తప్పింది నమ్రత. ఐదో నెల్లో ఆమెను తీసుకొచ్చి ఆర్భాటంగా శ్రీమంతపు వేడుకలు జరిపించింది వసుంధర. నమ్రతకు నెలలు నిండి బిడ్డ పుట్టేవరకూ తెగ ఆరాటపడిపోయింది. 'బాబు పుట్టాడని' చెప్పిన నర్స్‌కి తన చేతి ఉంగరం తీసిచ్చేసిందంటే, ఆమె ఆనందమెంతటిదో తెలిసిపోతుంది.

బాబుకి 'శ్రీనివాస చక్రవర్తి' అని పేరు పెట్టి ఎంతో ఆర్భాటంగా బారసాల చేసింది. ఇంట్లో మాత్రం వాసూగా స్థిరపడిపోయిందా చిన్నారి పేరు. మనవడంటే ఆమెకు పంచప్రాణాలు.

★ ★ ★

ఆ నాల్గేళ్ళలో విశాల్, తన ఫ్రెండ్స్‌తో కలిసి చేసిన ఆధునిక వ్యవసాయం, ఔషధమొక్కల పెంపకం, కోళ్ళు, కుందేళ్ళ పెంపకం బాగా గిట్టుబాటయి, బ్యాంక్ బాలెన్స్ పెరగసాదింది. అలా వాళ్ళు అభివృద్ధి చెందటంతో వసుంధర మనసు తేలికైంది. అల్లుడంటే గౌరవమూ పెరిగింది. ఇక ఆమెకు మనవడంటే పంచప్రాణాలు కావడంతో తరచూ వాడికోసం వెళ్ళటం అలవాటైంది.

ఆదివిష్ణు ఎప్పుడైనా మాత్రమే కూతురి ఊరికి వెళ్ళేవాడు. వెళ్ళినా, ఆడపిల్ల ఇంట్లో

ఏమీ తినకూడదు, వీలైతే, అంతో ఇంతో పెట్టడమే సరైన పద్ధతని అలాగే నడుచుకొనేవాడు. తప్పనిసరై భోజనం చేయవలసివస్తే, దానికి రెండింతలో మూడింతలో ఏదో రూపేణా ముట్టజెప్పేవాడు. విశాల్‌ని కొడుకులాగే భావించేవాడు. ఆ మావా, అల్లుళ్ళ అనుబంధం ఎందరికో మార్గదర్శకమైందంటే అతిశయోక్తి కాదు.

నమ్రత జీవితం నవ్వులనదిలో పువ్వుల పడవలా సాగి పోతోందనుకుంటూ వసుంధర అనుకొనేలోగా, విధివక్రించి వరదలొచ్చి కొంత, జబ్బులొచ్చి కుందేళ్ళు, మేకలు, కోళ్ళూ చచ్చిపోయి కొంతా నష్టం వాటిల్లింది. స్నేహితులకు ష్యూరిటీ ఇచ్చి వారు బిచాణా ఎత్తేయడంతో ఆ అప్పులు తీర్చి పరువు కాపాడుకోటానికి నగానట్రా అమ్మేయక తప్పలేదు విశాల్‌కి. నమ్రత పరిస్థితులనర్థం చేసుకుని తనకి అండగా నిలబడటం అతనికెంతో ధైర్యాన్నిచ్చింది. కష్టాల్లో భార్య తోడుండటమే పెద్ద అదృష్టమనుకొనేవాడు.

వాళ్ళ ఇబ్బందులను గమనించి ఆది విష్ణూ వసుంధరలు సహాయం చేయబోతే నమ్రత సున్నితంగానే తిరస్కరించేది, విశాల్ ఆత్మాభిమానం తెలిసి. దాంతో వాళ్ళు బాధపడవలసివచ్చేది. అక్కడికీ ప్రాణమాగక వాసుకి అదంటే ఇష్టం ఇదంటే ఇష్టం అంటూ తినుబండారాలో, స్వీట్లో, పళ్ళో కొని పట్టుకెళ్ళడం మొదలుపెట్టింది వసుంధర. వాటిని కూడా వద్దంటే తల్లి మరింత బాధపడ్తుందని, మౌనం వహించేది నమ్రత.

మీ ఆయనకి స్నేహితులంటే అంత మక్కువ దేనికి? ముందుచూపనేది లేకుండా వారిని నమ్మి మోసపోయింది చాలక ఇంకా స్నేహితులంటూ, ఊరి వ్యవహారాలంటూ ఆ తిరుగుళ్ళు దేనికి? ఇందుకే అన్నాను, మంచి ఉద్యోగస్తుడ్ని కట్టుకొంటే బాధలుండవని- అంటూ వసుంధర బాధ కొద్దీ నోరుజారడం, అవి

## కొత్తగాలి...

**నీలాకాశం హరివిల్లు**
**భూమి ఎదపై నీటి బాణాలు**
**సూటిగా సంధించి**
**మబ్బుచాటు నుంచి వింత**
**చూస్తోంది!**

– కె..వి. సుబ్రహ్మణ్యం,
సింహాచలం

విశాల్ చెవినబడి, మనసుని కష్టపెట్టుకోవడం జరుగుతూ నమ్రతను ఇరకాటంలో పడేస్తున్నాయి.

అలాగే నమ్రత తోటివాళ్ళెవరి గురించేదైనా ఆమె యథాలాపంగానే చెప్పినా, విశాల్‌కి బాధ కలిగేది.

"నువ్వు నన్ను కట్టుకొని సుఖపడటం లేదని అత్తగారికి చాలా బాధగా వుంది. నా పట్ల చిన్నచూపూ కలుగుతోందని తెలుస్తూనే ఉంది. పోనీ వాళ్ళ తృప్తికోసం నువ్వూ వాసూ వెళ్ళి కొన్నిరోజులుండి రండి" అనేసరికి నమ్రతకూ బాధ కల్గింది.

దాంతో తల్లి ఏదైనా చెప్పబోతే "ప్లీజ్, మా విషయంలో జోక్యం కల్పించుకోవద్దమ్మా. నువ్వు చెప్పేది మా మంచికే కావొచ్చు. కానీ విశాల్‌కి అవన్నీ ఆచరణలో పెట్టే వీలుండాలి. తనకి ఇష్టం వుండాలి కదా. ఇంతకుముందు నిన్ను 'అత్తమ్మా' అని సంబోధించే ఆయన, ఇప్పుడు 'మీ అమ్మగారంటూ మాట్లాడుతున్నారు. మనమధ్య సత్సంబంధాలు మిగిలుండాలంటే నువ్వు మా వ్యవహారాల్లో తలదూర్చకు" అంటూ నిక్కచ్చిగా చెప్పేసింది. అప్పటినుండి నోటిమీద కంట్రోల్ తెచ్చుకొని మాట్లాడటం మొదలుపెట్టింది వసుంధర.

★ ★ ★

## కొత్తగాలి...

**ప్రకృతి ఆకృతి**
**మొక్క!**
**నాటి పరిరక్షించు**
**ఎంచక్కా!**

*– బి. చంద్రశేఖరయ్య,*
పలమనేరు, చిత్తూరు జిల్లా

"ఏంటమ్మా, ఏదో ఆలోచనలో ముని గావ్?" నిశ్శబ్దంగా కూర్చున్న తల్లివంక చూస్తూ నమ్రత ప్రశ్నించేసరికి, ఈలోకం లోకి వచ్చిన వసుంధర "ఏమీ లేదులే" అంది ముభావంగా.

తమ కష్టాలకు తల్లి మనసు అల్లాడిపో తోందని గ్రహించిన నమ్రత, ఆమె మూడ్‌ని మార్చడానికన్నట్లు "ఇంద్రాణి అత్త ఎలా ఉంది? తన ఆరోగ్యం బావుం టోందా?" అనడిగింది.

తన పుట్టింటి వాళ్ళ విషయాలనెత్తితే, వసుంధరకి ఒళ్ళు తెలీదు. అందుకే కూ తురు అలా అడిగింది.

నమ్రత ఆశించినట్లే ఆ మాటతో వసుం ధరలో చలనం వచ్చి "ఇప్పుడు బాగానే వుంటోందిలే. రాఘవదగ్గరికి వెళ్ళొచ్చింది గానీ అక్కడ వుండలేకపోయింది. హాయిగా అక్కడి వింతలూ విశేషాలూ చూస్తూ గడపొచ్చుగా? ఇల్లూవాకిలీ పారి పోతాయన్నట్లు పరుగెత్తుకొచ్చేసింది. అన్నట్లు అక్కడ వాళ్ళంతా దిగిన ఫొటోలు చూపించింది. రాఘవ కట్టుకొన్న బిల్డింగ్ ఎంత బాగుందో? పడవలంత కార్లు రెండున్నాయి. వాడి కూతురు స్వీటీ, అచ్చం దొరసాని పిల్లలా ఎంత ముద్దుగా, బొద్దుగా వుందో! రాఘవ భార్య, స్వీటీలు వేసుకొన్న నగలూ, డ్రెస్‌లూ చూడటానికి రెండు కళ్ళూ చాలవనుకో. ఏంటో, అవన్నీ నీకు చెందాల్సినవి కావూ?" అంది.

"అమ్మా!" వారిస్తున్నట్లు గట్టిగా అంది నమ్రత. 'ఈ మాటలు పొరబాటున విశాల్ చెవిలో పడితే ఎంత బాధపడ తాడో.. ఈవిడకెందుకు అర్థంకాదు' అను కొంటూ కణతలు రుద్దుకొంది.

"ఏదన్నా అంటే నీకిట్టే కోపం వస్తుంది గానీ, నువ్వు వాడిని కాదనుకొని, ఇక్కడే మన్నా సుఖంగా ఉన్నావా? ఆఖరికి పస్తు లుంచే స్థితికి దిగజార్చాడు నీ భర్త. నా మనసుకెంత క్షోభగా వుందో తెలుసా?" అంది వసుంధర కోపంగా.

"అమ్మా! విశాల్ శ్రీరామచంద్రుడి ప్రతి రూపం. నాకది చాలు. రాఘవ బావ పెళ్ళిచేసుకొని, ఒక బిడ్డకు తండ్రయ్యేంత వరకూ అన్నీ రహస్యంగా దాచాడు. మీరు నన్ను కట్టబెడితే రెండో భార్యనయ్యేదాన్ని, సవతి పోరుండేది.. నీకు అన్న కొడుకు కాబట్టి బావ చేసింది తప్పు అన్పించకపో వచ్చు. అలాంటివాడికి భార్య కాకుండా ఆ దేవుడే నన్ను కాపాడాడని నేననుకుం టాను. అయినా ఎవరిష్టం వారిది. రాఘవ బావ తనిష్టమొచ్చినట్లు తను న్నాడు. ఆ దేశాల్లో తప్పు బట్టరు కాబట్టి, మనకవి అనవసరం. ఇంకోసారి అలాంటి టాపిక్ తేవద్దు.. అంతే!

అయినా ఏదో ఈ రెండేళ్ళుగా కొద్దిగా తిప్పలు పడుతున్నాం. మళ్ళీ కోలుకో లేమా? ఈ కాసిని ఇబ్బందులు తప్పించి మేమిద్దరం అన్యోన్యంగా ఉంటున్నాం గదా! అది చాలు. వాసు ముద్దుమాటలతో ఎలాంటి బాధనైనా మర్చిపోతుంటాం. ఏ లోటునీ ఫీలవడంలేదు. ఏదో పరిస్థితులు అనుకూలించకగానీ ఎప్పటికీ ఇలాగే ఉండి పోతామేంటి? చీకటి వెన్నంటి వెల్తురుం టుంది. విశాల్ కొత్త ప్రయత్నాలు మొద లెట్టాడు. ఇకమీదట మాకన్నీ మంచిరో జులే" అంది నమ్రత ఎంతో నమ్మకంగా.

'తల్లీ, నా కూతురి నమ్మకాన్ని నిజం

చేయమ్మా' అంటూ కనకదుర్గమ్మని మన సులో వేడుకొంది వసుంధర.

చిన్నబోయిన తల్లి ముఖాన్ని చూసి, 'హర్ట్ చేశానా? ' అనుకుని..

"అన్నట్లు చిన్న మావయ్యావాళ్ళు.. ముఖ్యంగా మిసిమి ఎలా ఉంది? " అంటూ టాపిక్ మార్చింది నమ్రత.

వసుంధరకు ఇద్దరన్నలు. వారి భార్యలు ఇంద్రాణి, శర్వాణీలు. అక్కాచెల్లెళ్ళు కావ డంతో వారిమధ్య రాకపోకలు ఎక్కువగానే ఉంటాయి. ఇంద్రాణి కొడుకు రాఘవ. శర్వాణి కూతురు మిసిమికి నమ్రతంటే చాలా ఇష్టం. ఇద్దరిమధ్య స్నేహమే అధికం బంధుత్వం కన్నా.

తన చిన్నన్న సంగతి తీసుకురాగానే మళ్ళీ మామూలు మనిషైపోయిన వసుం ధర "మిసిమి ఈమధ్య వాళ్ళ మ్యూజిక్ ట్రూప్‌తో కలిసి కచేరీలిచ్చేంతదైందే. మొన్నటి నెలలో తిరుపతి, ఈ నెలలో శ్రీశైలం వెళ్ళొచ్చింది. వాళ్ళే ఛార్జీలు పెట్టు కొని తీసుకెళ్ళడమే గాక తిండీతిప్పలూ, వసతి ఏర్పాటు చేస్తారు. ముఖ్యంగా క్యూలో నిలబడే అవసరం లేకుండా భగవ ద్దర్శనం చేయిస్తారు. స్వామివారి సన్ని ధిలో పాడగల్గడం వాళ్ళు చేసుకొన్న అదృష్టం.." అంటూ ఏవేవో చెప్పసాగింది.

మిసిమి చక్కని గాయనిగా ఎదగడం, పేరు తెచ్చుకోవడం నమ్రతకు ఎంతో సంతోషాన్నిచ్చింది.

ఇంతలో విశాల్ ఆటోలో ఇంటిముందు దిగేసరికి 'అమ్మయ్య' అనుకొంటూ చెంగున లేచింది నమ్రత. ఆరోజు నుండీ తమకన్నీ శుభాలే జరుగుతాయన్న ఆమె నమ్మకానికి తొలిబీజం పడింది.

★ ★ ★

కాలగర్భంలో రోజులు నెలలుగా, నెలలు సంవత్సరాలుగా మారుతున్నాయి.

రాహుల్ చదువు ముగించాడు. తన పట్ల ఎంతో ప్రేమానురాగాలు చూపించే తన ప్రొఫెసర్ కమ్ డాక్టర్ అయిన

## కొత్తగాలి...

**ఉదయ సూర్యుడి ముఖం**
**సిగ్గుతో ఎర్రబారింది!**
**ముత్తయిదువ**
**నుదుటి బొట్టు చూసి!**

*- లోగిశ లక్ష్మీనాయుడు,*
సింహాచలం

రాఘవ హాస్పిటల్లోనే అతని అసిస్టెంట్‌గా అపాయింట్ అయ్యాడు.

రాఘవకి డాక్టర్‌గా మంచి హస్తవాసి, పేరు, డిమాండ్ అన్నీ ఉన్నాయ్. అతను బాస్‌లా అధికారం చూపించక సొంత తమ్ముడిని ఆదరించినట్లు రాహుల్‌ని అభి మానించేవాడు. దాంతో మరో జాబ్ ప్రయత్నం చేయకుండా అతని దగ్గరే తర్ఫీదు పొందుతున్నాడు రాహుల్. రాఘవ చెల్లించే జీతం కూడా సంతృప్తిక రంగా వుంటోందతనికి.

ఆరోజు రాహుల్ నిద్రలేచేసరికి "రమ్యంగా కుటీరాన రంగవల్లులల్లింది..." అంటూ రోజీ పాడుకుంటూ కన్పించింది. కళ్ళు మూసుకొని మరికాసేపు ఆ పాట వింటూ పడుకొన్నాడలాగే.

"అమ్మా! నువ్వెంత సూపర్బ్‌గా పాడుతు న్నావో? ఆ పాత పాటల్ని వింటూ అలా వుండిపోవాలన్పిస్తుంది. అన్నట్లు నువ్వు సింగర్‌గా ఎందుకు ప్రయత్నించలేదు? " అడిగాడు, దగ్గరికొచ్చిన తల్లిని.

"ఏంటి విషయం? పొద్దుటే నన్ను మునగచెట్టెక్కిస్తున్నావ్? " అంటూ కొడుకు చేతికి కాఫీ కప్ అందించింది.

"మామ్, నేనిప్పుడు జాబ్‌లో చేరాను కదా. ఎటూ నీ బిజినెస్ పట్ల నాకింట్రెస్ట్ లేదు. అవన్నీ సెటిల్ చేసుకొని రెస్ట్ తీసు

కోవచ్చుగా" అన్నాడు.

కొడుకు మాటలకు మనసులో మురిసినా "ఊరికే కూర్చుంటే బోర్ కొడుతుందిరా. డాన్స్ ప్రోగ్రామ్స్ తగ్గించుకొని నెలకో నాల్గు క్లాసులు మాత్రమే తీసుకొంటున్నాను. సగం బిజినెస్‌ని విలియమ్ అంకులే చూసుకొంటున్నారాయె.. నేనేమంత కష్టపడ్తున్నానని? అయినా ఒంట్లో శక్తున్నంతవరకూ మనిషి కష్టపడాలి" అందామె స్థిరంగా, ఫ్రెండ్‌గా పరిచయమైనా, సొంత అన్నలా తోడుంట్ను విలియమ్స్ మీద నమ్మకంతో.

"సరేలే ఎప్పుడూ నువ్వు నీ మాటే నెగ్గించుకొంటావ్‌గా" చిరు అలకను ప్రదర్శిస్తూ అన్నాడు రాహుల్.

ఆ మాటని పలు సందర్భాల్లో రాజా రామ్మోహన రావ్ అనేవాడు. కాదుకాదు, తనే అనేలా చేసేది. ఆ మూర్ఖత్వం మొండితనాల్ని పాపం ఎలా భరించాడో అతను అనుకుంది రోజీ.

తల్లి ఏవో ఆలోచనల్లోకి జారుకోవడం చూసి "అమ్మా! మా ఫ్రెండ్ కొత్త పాటల్ని డౌన్‌లోడ్ చేశాడట, విన్నావా వాటిని? " అడిగాడు రాహుల్.

ఉలిక్కిపడిన రోజీ "ఆ, ఆ.. విన్నాను, కొత్త సింగర్స్ అయినా బాగానే పాడుతున్నారు గానీ పదాలు పలికే తీరే చాలా మారిపోయింది. కొత్త ట్రెండ్ కదా! అన్నట్లు నేను అడిగిన బుక్స్ తెప్పించావా? " ప్రశ్నించింది రోజీ.

రాహుల్ తెలుగు చదవటం, రాయటం మరిచిపోకూడదని చిన్నప్పటినుంచి అతనికి తెలుగు నేర్పించింది. ఇంట్లో రాహుల్‌తో తెలుగులోనే మాట్లాడుతూంటుంది. ఎక్కువగా తెలుగు పాటలే వినిపిస్తూంటుంది. వాటి అర్థాలు వివరిస్తూంటుంది. తెలుగు నవలలు తను చదివి, బాగున్నవనిపించినవి అతనికీ ఇచ్చి చదివిస్తుంది. తామిద్దరి మధ్యా సాన్నిహిత్యం బలపడాలని వాటిగురించి డిస్కస్ చేస్తుంది. అందరూ వాళ్ళని 'మీరు తల్లీ కొడుకుల్లాగాకుండా ఫ్రెండ్స్‌లా ఉంటారు' అని అంటుంటారు.

రాహుల్ ఫ్రెండ్స్‌కి కూడా రోజీ అంటే చాలా అభిమానం. వారంతా వీకెండ్స్‌లో, రాహుల్ ఇంటికొస్తుంటారు. వాళ్ళందరితో ఆ ఇల్లు కళకళలాడుతుంటుంది.

ఆనందంగా గడుస్తున్నాయి రోజులు.




**పా**లేరు మల్లేశం తమ పొలంవైపు పరుగెత్తుకురావటం చూసి, చేస్తున్న పని నాపి, తనే ఎదురెళ్ళి "ఏంటిలా పరుగెత్తుకొస్తున్నావ్? ఏమైంది మల్లేశం? " అనడిగాడు విశాల్.

"చిన్నయ్యగారూ, మీ మావగారికి పక్షవాతం వచ్చిందిట. మీ ఫోన్ స్విచ్ఛాఫ్ అని వస్తోంటే, రాధమ్మకి ఫోన్ చేశారు. ఆమె ముందుగా వెళ్ళి మీకీ సంగతి చెప్పి రమ్మంది" అన్నాడు మల్లేశం వగరుస్తూ.

"చిన్నమ్మగారికి చెప్పలేదుకదా? " అనుమానంగా అడిగాడు.

"రాధమ్మ, నమ్రతమ్మకిప్పుడే చెప్తానంది. అందుకే నేరుగా మీ దగ్గరికే వచ్చానిలా" అన్నాడు.

"మంచి పని చేశావ్. నేనిప్పుడే అక్కడికి వెడుతున్నానని రాధమ్మకి చెప్పు. చిన్నమ్మగారితో, ఏదో అర్జంట్ పనిమీద విజయవాడ వెళ్ళానని చెప్పి, ఏదోలా మేనేజ్

చేయ్. నేనక్కడికి వెళ్లి, పరిస్థితిని బట్టి ఫోన్ చేస్తాను" అంటూ హుటాహుటిన అత్తగారింటికి బయల్దేరాడు విశాల్, తన ఫ్రెండ్ కారులో.

★ ★ ★

విశాల్‌ని చూస్తూనే బావురుమంది వసుంధర.

ఆమెకు ధైర్యం చెప్పి, ఆదివిష్ణుని తీసుకొని హాస్పిటల్‌కి వెళ్లాడు విశాల్. వసుంధర కూడా కారెక్కింది.

ఆ హాస్పిటల్లోని డాక్టర్, విశాల్ చిన్ననాటి స్నేహితుడే కావటంవల్ల, ఆదివిష్ణుకు మంచి అటెన్షన్ ఇచ్చి, వెంటనే ట్రీట్‌మెంట్ అందించారు.

"మరేం ఫర్వాలేదు, స్ట్రోకేం సివియర్‌గా రాలేదులెండి. పది రోజులపాటు ఈ మెడిసిన్స్ వాడండి" అంటూ డాక్టర్ ధైర్యం చెప్పిన తరువాతే, నమ్రతకు ఫోన్ చేశాడు విశాల్. ఆమెకు తండ్రంటే వల్లమాలిన ప్రేమాభిమానాలని తెలుసతనికి.

అందుకే విషయాన్ని మెల్లగా వివరించి "మావయ్యని, అత్తమ్మనీ తీసుకొని వస్తున్నాను. మన బెడ్‌రూమ్‌ని వారికనుగుణంగా సర్దేయ్" అని చెప్పి వారిద్దర్నీ తమ ఊరికి తీసుకొచ్చేశాడు విశాల్.

ప్రతిరోజూ రెండుపూటలా, తను తయారుచేసిన తైలాన్ని ఆదివిష్ణుకు మసాజ్ చేయటం మొదలుపెట్టాడు. మధ్యాహ్నం వేళలో వసుంధరగానీ, నమ్రతగానీ చేసేవారు. మందులవల్ల, మసాజ్‌ల వల్ల, పది రోజుల్లోనే ఆయన లేవగలిగేలా చేశాడు. ఆయన ఆరోగ్యం కుదుట పడటం, వారందరికీ ఎంతో ఆనందాన్నిచ్చింది.

"చిన్నవాడివైపోయావ్ గానీ, లేకుంటే నీ కాళ్ళమీద పడి కృతజ్ఞతలు చెప్పుకొనేదాన్ని" అంటూ వసుంధర, కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"పరాయివాళ్లని చేసి మాట్లాడకండి అత్తమ్మా, నాకు మా నాన్నెంతో మావయ్యగారూ అంతే" అన్నాడు విశాల్.

తల్లి పశ్చాత్తాపం, భర్త సంస్కారం నమ్రతకు సంతోషాన్నిచ్చాయి. 'నా ఎన్నిక సరైనదే' అని ఎప్పటిలాగే మళ్ళీ అనుకొంది. విశాల్‌మీద మరింత గౌరవాభిమానాలు కలిగాయ్.

"నెల తిరక్కుండా, మీ మావగారిని లేచి తిరిగేలా చేశారట. ఏ మందులు వాడారు? ఏ తైలం వాడారు? " అంటూ ఇంటికొచ్చి అడిగేవారి సంఖ్య అధికమైంది.

"నువ్వుల నూనెలో వెల్లుల్లి, మిరియాల పొడి, కర్పూరం కలిపి చేసిన తైలమది. దాంతో రోజుకి మూడు పూటలా, క్రమం తప్పకుండా, రోగికి ధైర్యం చెబుతూ ప్రేమతో మసాజ్ చేస్తుండాలి. ఇది నేను పుస్తకాల్లో చదివిచేస్తున్నదే తప్ప సొంతంగా సృష్టించింది కాదులెండి" అంటూ చెప్పినా, విశాల్‌కి ఊళ్లో మంచి పేరే వచ్చేసింది.

"ఆ తైలాన్ని చేసివ్వగలరా? ఎంత ఖర్చయినా ఫర్వాలేదు" అంటూ రాసాగారు.

"నేను ఏమేంటి, ఎంతెంత పాళ్ళలో వేయాలో చెబుతాను. మీరు ఇంట్లోనే తయారు చేసుకోవచ్చు. మసాజ్ చేయొచ్చు. ఆ మసాజేదో మొక్కుబడిగా కాకుండా ప్రేమతో చేయాలి. విసుగుతూ చేస్తే బాధితుడికి, తనవారికి తనెంతో ఇబ్బంది కల్గిస్తున్నానన్న బాధ కలిగి తగ్గదు సరికదా మరింత ఎక్కువవుతుంది. ఆత్మీయస్పర్శ సగం రోగాన్ని మాయం చేస్తుంది" అంటూ వారికి నచ్చజెప్పేవాడు విశాల్.

"విశాల్! వ్యవసాయమదీ మానేసి ఈ వైద్యమందిస్తూ డాక్టర్‌గా చెలామణీ అయిపోతే పేరుకి పేరు, డబ్బుకి డబ్బు" అంటూ రాధ వెటకారమాడేది.

"మా వదినకు పక్షవాతం వచ్చినప్పుడు నమ్రతా, విశాల్‌లేగా తమ దగ్గరుంచుకొని, తగ్గించారు. కొడుకు డాక్టరయినా అందు

బాటులో లేకపోవడంతో, అవసరానికి పని కిరాకుండానే అయ్యాడు. విశాలే సొంతకొడుకు కన్నా మిన్నగా చూశాడు" అంటూ వసుంధర, విశాల్ మంచితనం గురించి అందరికీ చెప్పేది.

"ఒక్క విశాలేనా? అతనికి తగ్గ ఇల్లాలు మీ నమ్రత. మూడు నెలలపాటు మీ వదినగారికి సేవలు చేసింది ఇంట్లో ఉంచుకొని" అనేవాళ్లు విన్నవాళ్లు.

"వారిద్దరి మంచితనమే వారికి శ్రీరామ రక్ష" అనేవాడు ఆదివిష్ణు.

అల్లుడి ఆర్థికస్థితి చక్కబడటంతో, వసుంధరకది నిజమే అన్పిస్తోంది.

★ ★ ★

మసక చీకట్లు తొలగుతూ ప్రశాంతంగా ఊరు తెల్లవారుతోంది. అది గమనించక నిద్రలో తూగుతున్నవారికి 'కొక్కొరోకో' అంటూ కోళ్ళు కూతబెట్టి చెబుతున్నాయి.

ప్రభాత భానుడు ఇక తప్పదన్నట్లు, మేఘాలమధ్య నుండి మెల్లమెల్లగా బయటకు వస్తున్నాడు. సంక్రాంతి రోజులు.. చలి వణికిస్తోంది, అయినా చలిని లెక్క చేయకుండా ఆడవాళ్లంతా పేడతో కళ్ళాపి జల్లి, పచ్చని ముంగిలిలో తెల్లటి ముగ్గుపిండితో ఆనందంగా పెద్దపెద్ద రంగవల్లులు వేస్తూ తమ కళాకౌశలాన్ని ప్రదర్శిస్తున్నారు, నడుంనొప్పిని లెక్కచేయకుండా.

'మా ఇంటి ముందరి ముగ్గు బాగుందంటే, మా ఇంటి ముందరి ముగ్గు బాగుందంటూ' పిల్లలు కేరింతలు కొడుతున్నారు. గుడిలో ప్రభాతసేవలు మొదలైన సూచనగా గంటలు మోగుతూ భక్తుల్ని ఆహ్వానిస్తున్నాయి.

'చుయ్ చుయ్' అంటూ పాలధారలు చెంబుని నింపుతున్న సవ్వడికి నిద్రలేచింది నమ్రత. ఇక తమని తల్లుల పొదుగుల దగ్గరికి వదులుతారన్న సంబరంతో లేగదూడలు సంతోషంగా గంతులేస్తుంటే, ముచ్చటగా వాటివంక చూసింది నమ్రత.

విశాల్ వంక చూస్తూ "నన్నూ మీతో బాటే లేపకపోయారా? " అని బాత్‌రూమ్‌లోకి నడిచింది. స్నానాదులు ముగించుకొని పూజామంటపం దగ్గరకు వెళ్లింది.

ఆమె పూజ ముగించేలోపునే తనూ స్నానం చేసి తయారై వచ్చాడు విశాల్. ఆమె ఇచ్చిన హారతిని కళ్ళకద్దుకుని, తీర్థ ప్రసాదాలు తీసుకున్నాడు. అతను న్యూస్ పేపర్ చదివేలోపునే, తెల్లటి మల్లెల్లాంటి ఇడ్లీలను అతని ముందుంచింది నమ్రత. దాదాపు రోజూ జరిగే తంతే ఇది.

విశాల్ పొలం, అట్నుండి రచ్చబండ దగ్గరకు వెళ్ళి ఊరి వ్యవహారాలు చక్కబెట్టుకొని వచ్చేసరికి ఇంటిపని, వంటపని ముగించుకొని, అతనికోసం ఎదురుచూస్తూ వుంటుంది. స్కూల్ దగ్గరే కాబట్టి వాసు, ధాత్రిల్ని తనే వెళ్ళి తీసుకొస్తుంది. విశాల్ రాగానే నలుగురూ కలిసి ముచ్చట్లాడుకుంటూ భోజనాలు ముగిస్తారు.

తర్వాత పిల్లల్ని మళ్ళీ స్కూల్లో దించి వచ్చి, ఓ గంటపాటు నిద్రపోతాడు విశాల్. అతను నిద్రలేచేసరికి, ఘుమఘుమలాడే కాఫీ రెడీ చేస్తుంది నమ్రత. అది తాగి, కాసేపు కీబోర్డ్ ప్రాక్టీస్ చేసుకొని ఐదు గంటలకల్లా బయటకు వెడతాడు. వ్యక్తిగత పనులు, ఊరి పనులూ పరోపకారాలన్నీ ముగించుకొని ఎనిమిదిన్నరా, తొమ్మిదికల్లా ఇల్లు చేరతాడు.

ఎలాంటి హడావుడి, ఉరుకులూ పరుగులూ ఉండవు కాబట్టి ప్రశాంతంగా జీవితాన్ని, నవ్వుల నదిలో పువ్వుల పడవ ప్రయాణంలా, గడపగల్గుతున్నారు.

కీబోర్డు ప్లేయర్‌గా అతని టాలెంట్ తెలిసినవాళ్లు కోరితే తప్ప, తనకైతాను అవకాశాల కోసం దేబిరించడు విశాల్. ఐతే గంధపుపరిమళం తనకైతానే వ్యాపించినట్లు, అతని ప్రావీణ్యం నల్గురికీ తెలిసి, వాళ్లకై వాళ్లే అతని ప్రోగ్రామ్స్ కోసం బుక్ చేసుకునేవారు. రాశికన్నా వాసికే ప్రాధాన్య

తనీయడం, అత్యాశకు పోకపోవడం వల్ల రెండు పడవల్లో అతడి ప్రయాణం సాఫీగానే సాగుతూ ఆర్థికంగా, హార్దికంగా సంతృప్తినిస్తోంది. అందుకు నమ్రత, అతని 'టీమ్' అందిస్తున్న సహకారం మెచ్చుకోదగింది.

★ ★ ★

తల్లి ఇంట్లో లేకపోవడంతో, హాలిడేని స్వీటీతో గడపాలనుకున్నాడు రాహుల్. తండ్రిలేని లోటు తెలీకుండా తనని పెంచినా, ఎంతోకొంత నిరుత్సాహం అతడిని వేధించింది. పేరెంట్స్‌లో ఏ ఒక్కరు లేకున్నా అది వెలితే! ఆ వెలితి బాధించేది రాహుల్‌ని. అలాంటి బాధనే అనుభవిస్తున్న స్వీటీపట్ల ఏర్పడిన సింపతీవల్ల రాహుల్ ఆమెని చెల్లెలిలా అభిమానించసాగాడు. చిత్రంగా రాహుల్‌పట్ల అదే సోదరభావంతో స్వీటీ ఉండటంవల్ల, చాలా తొందరగా వారు దగ్గరయ్యారు.

రాహుల్ వెళ్లేసరికి స్వీటీ హుషారుగా కన్పించింది. అతడిని చూస్తూనే "ఇవాళ ఇండియా నుండి మా ఇంటికి ఓ గెస్ట్ వస్తోంది, తెలుసా? " అంది ఉత్సాహంగా.

"ఓ, ఆ వచ్చేవాళ్లెవరో గానీ నీకు చాలా స్పెషలని అర్థమవుతోందిలే" నవ్వుతూ అన్నాడు రాహుల్.

తన జీవితంలో అంతవరకూ, ఏ బంధువులనీ చూడని అతనికి, స్వీటీ సంతోషం చాలా వింతగా, కొత్తగా అన్పించి ముచ్చటగా చూశాడు.

ఇంతలో డాక్టర్ రాఘవ రావటంతో, నవ్వుతూ విష్ చేశాడు రాహుల్.

"రాహుల్! ఇవాళ మా చెల్లెలు వస్తోంది, తనని రిసీవ్ చేసుకోడానికి వెడుతున్నాం. నీకభ్యంతరం లేకుంటే, నువ్వూ మాతోబాటు రావొచ్చు" అన్నాడు రాఘవ.

"ఓకే, పదండి" అన్నాడు రాహుల్.

అరగంటలో ఎయిర్‌పోర్ట్ చేరుకున్నారు.

రాయంచలా శ్వేతవస్త్రాల్లో వస్తోన్న ఓ అమ్మాయిని చూపిస్తూ "అదిగో, తనే" అంటూ గబగబా ఆమెకు ఎదురెళ్ళాడు రాఘవ.

అంతవరకూ భయాన్ని నింపుకున్న ఆమె కళ్ళు, రాఘవని చూస్తూనే మెరవడం గమనించి నవ్వుకున్నాడు రాహుల్.

ఒకసారి తనేదో పుస్తకం చదువుతూ, 'భీతహరిణేక్షణ అంటే ఏంటి' అని అడిగితే, తల్లి వివరంగా చెప్పినా సరిగ్గా అర్థంకాలేదు. కానీ ఇప్పుడా పదానికి అర్థం ఆ అమ్మాయి కళ్ళని చూసేసరికి క్లియర్‌గా అర్థమయింది.

"మీట్ మై సిస్టర్ మిసిమి.. ఇతను నా అసిస్టెంట్ మిస్టర్ రాహుల్" అంటూ వారిద్దర్నీ ఒకరికొకర్ని పరిచయం చేశాడు డాక్టర్ రాఘవ.

చక్కటి ముఖ కవళికలతో, పసిమిఛాయతో అందంగా, అంతకంటే చక్కటి ఆరోగ్యంతో వున్న రాహుల్ వంక మరోసారి చూడాలన్పించింది మిసిమికి.

"గ్లాడ్ టు మీట్ యూ" అని అతను చేయి జాచినా, "నమస్తే" అంటూ, చేతులు జోడించి నవ్విందామె.

నవ్వితే డింపుల్స్ పడిన ఆమె బుగ్గల వంక అడ్మయిరింగ్‌గా చూస్తూ, తనూ చేతులు జోడించి 'నమస్తే' అన్నాడతను.

"ఏయ్, స్వీటీ, బాగా పొడుగైపోయావే" అని స్వీటీని దగ్గరకు లాక్కొంది మిసిమి.

"పో, నేనేం నీతో మాట్లాడను, రాగానే నన్ను పలకరించలేదేం? " అంటూ బుంగమూతి పెట్టేసింది.

"సారీరా పండూ! నాన్న అతడిని పరిచయం చేస్తోంటే 'హాయ్' అనకపోతే బాగుంటుందా చెప్పు? !" అంటూ స్వీటీ బుగ్గలమీద ముద్దులు పెట్టేసరికి, ఆమె కోపం ఇట్టే మాయమైపోయింది.

దారి పొడవునా కన్పిస్తున్న బహుళ అంతస్థుల భవనాల్ని, విశాలమైన రోడ్లనీ, పచ్చగా ఎత్తుగా ఉన్న వృక్షాలనీ ఆసక్తిగా

అ
క్ష
రం

దేవుడిముందు
మనమంతా సమానంగా తెలివైనవాళ్ళం.
అంతే సమానంగా తెలివితక్కువవాళ్ళం.

- ఆల్బర్ట్ ఐన్‌స్టీన్



చూడసాగింది మిసిమి.

వెలుగుతున్న ఆమె ముఖాన్ని చూస్తుంటే, రాహుల్ పెదవులమీదకి అల వోకగా పాట దూసుకొచ్చింది- "నిన్న లేని అందమేదో / నిదురలేచె నెందుకో.. నిదు రలేచె నెందుకో.." అంటూ రాహుల్ పాడుతోంటే, చటుక్కున తలతిప్పి అతని వంక చూసింది మిసిమి.

"ఎప్పటిపాట ఇది! ఇలా ఇప్పుడు మీ నోట, ఇక్కడ వినడం చాలా అద్భుతంగా వుంది" ఎగ్జయిట్ అవుతూ అందామె.

"రాహుల్‌కీ, వాళ్ళమ్మగారికీ పాటలంటే ప్రాణం. వీళ్ల మదర్ దగ్గర పాతపాటల కలెక్షన్ చాలా ఉంది. రాహుల్ ఎప్పుడూ ఏదో ఒకటి హమ్ చేస్తూ వుంటే, ఇండియాలో నేను చూసిన ఆ సినిమాలు గుర్తొచ్చి ఆనందం కలుగుతుంటుంది" అన్నాడు రాఘవ.

"మీరు సంగీతంగానీ నేర్చుకొన్నారా?" ఆసక్తిగా అడిగింది రాహుల్‌ని.

"అబ్బే లేదండి. ఏదో బాత్‌రూమ్‌లో తీసే 'ఖూని' రాగాలే తప్ప" నవ్వుతూ అన్నాడు రాహుల్.

"నాకైతే 'కుహూరవాల్లా' అన్పిస్తున్నాయ్ మరి" అంది మిసిమి.

"నిజంగానా? లేక వెక్కిరిస్తున్నారా?" అనుమానంగా అడిగాడు రాహుల్.

"లేదు, నిజంగానే చెబుతున్నాను. మీ తెలుగు ఆక్సెంట్ కొంచెం వేరేలా ఉన్నా, పాట మాత్రం అచ్చంగా, తెనుగులో మా ఘంటసాలలాగే పాడారు" అంది మిసిమి.

"మీ ఘంటసాల ఏంటండి బాబూ?, మన ఘంటసాల" కరెక్ట్ చేశాతడు.

"అవును గదూ, మనమంతా ఎంత పుణ్యం చేసుకొన్నామో, ఆయన పాటలు ఇప్పటికీ వినగల్గుతున్నందుకు"

"మా అమ్మగూడా అలాగే అంటుంది. తనకి జేసుదాసు పాటలంటే ఇంకా ప్రాణం. వారిద్దరి తర్వాత బాగా అభిమానించేది బాలసుబ్రహ్మణ్యాన్ని. నాకైతే చాలా ఇష్టం. అతని గొంతు ఇంకా ఇప్పటికీ చెక్కుచెదరకుండా వున్నందుకు ఆశ్చర్యంగా వుంటుంది. ఆయన ప్రోగ్రామ్స్‌కి అటెండ్ అవుతుంటా" అన్నాడు రాహుల్.

"అమ్మయ్య, ఇక్కడికొస్తున్నప్పుడు కాస్త భయపడ్డాను, నాతో ఇలా అన్నీ మాట్లాడే వాళ్ళుంటారో లేదోనని. ఇప్పుడు ఫర్వాలేదు" సంతోషంగా అంది మిసిమి.

"మాంచి వాగుడుకాయ దొరికాడని అనుకొంటున్నారా ఏంటి?" భయంగా అన్నాడు రాహుల్.

"అబ్బెబ్బె! అలా అనుకోవడం లేదు. అన్నయ్య హాస్పిటల్‌కి, స్వీటీ స్కూల్‌కీ వెడితే, టైమ్‌పాస్ ఎలా అవుతుందో అనుకొన్నాను. చక్కగా తెలుగు మాట్లాడే మిమ్మల్ని చూస్తే సంతోషంగా వుంది"

"నాకు తెలుగు వచ్చుగానీ, ఈ 'మీరూ, అండీ' లాంటి పదాలతోనే నాకు ఇబ్బంది. పొరపాటున 'నువ్వు' అనిగానీ అంటే తప్పవుతుందా?" సంశయంగా అడిగాడు రాహుల్.

"మీకన్నా చిన్నదాన్నే కాబట్టి నన్ను 'నువ్వు' అనొచ్చు మరేం ఫర్వాలేదు" నవ్వుతూ అంది మిసిమి.

"నవ్వితే నువ్వు చాలా బాగున్నావు" అన్నాడతను చటుక్కున.

అతనన్న విధానానికి మిసిమి, స్వీటీ మళ్ళీ ఫక్కుమన్నారు.

'నవ్వితేనే ఎవరైనా బావుంటారు' మనసులో అనుకొన్నాడు డాక్టర్ రాఘవ, ఎప్పుడూ చిటపటలాడుతూ కన్పించిన భార్య జూలీ గుర్తొచ్చి. అలా మాటల్లోపడి నిముషాల్లో ఇల్లు చేరారు.

ఇల్లంతా చకచకా తిరిగిచూసి "వావ్!" అంది మిసిమి. ఆ తర్వాత తన బ్యాగ్‌లో నుండి ఓ బాక్స్ తీసి స్వీటీకిచ్చింది.

"ఏంటి? " కళ్ళెగరేస్తూ అడిగింది స్వీటీ.

"మూత తీసి చూడు"

బాక్స్ తెరిచి "ఓ.. పూతరేకులు!" సంతోషంగా అరిచింది.

తనెప్పుడో ఫోన్‌లో చెప్పింది గుర్తుపెట్టుకొని, తనకోసం వాటిని తేవటం, ఎంతో తియ్యగా తోచింది స్వీటీకి. గభాల్న వెళ్ళి మిసిమి బుగ్గలమీద ముద్దు పెట్టింది.

"ఆ పూత రేకులింత తియ్యగా వుంటాయో, లేదో మరి" అంది మిసిమి.

స్వీటీ తింటూ "బావున్నాయ్" అంది.

"స్నానం చేసొస్తేగాని తోచదు" అంటూ బట్టలు తీసుకొని బాత్‌రూమ్‌వైపు నడిచింది మిసిమి.

అరగంటలో కడిగిన ముత్యంలా వచ్చిన మిసిమి మీదనుండి చూపులు మరల్చుకోవడం కష్టమే అయింది రాహుల్ కి.

'ఇక్కడిందరు అమ్మాయిల్ని చూసినా కలగని ఈ వింత భావమేమిటి? పదేపదే మిసిమిని చూడాలన్పిస్తోందేంటి? తన ఫీలింగ్స్‌ని రాఘవసర్ కానీ గమనించటం లేదు కదా' అనుకొంటూ అతడివైపు క్రీగంట చూశాడు.

రాఘవ ఏవో మెడికల్ రిపోర్ట్స్ పరిశీలిస్తూ కన్పించేసరికి 'అమ్మయ్య' అనుకొని రిలాక్స్ అయ్యాడు.

మాటల్లో ఎంత సమయం గడిచిందీ తెలీలేదు వాళ్ళకి.

"ఆకలి దంచేస్తోంది, ఇక భోంచేద్దామా? " అంది మిసిమి.

"నేనివాళ నీకోసం కష్టపడి అన్నమూ, పప్పూ చేశాను తెలుసా" అంది స్వీటీ.

"అబ్బో అలాగా! థాంక్యూ డియర్!" అంటూ తను తెచ్చిన పికిల్ బాటిల్స్ టేబుల్‌మీద పెట్టింది మిసిమి.

"అన్నయ్యా రావాలి! మిస్టర్ రాహుల్ మీరు కూడా రండి" అంటూ వారిని పిలిచింది మిసిమి, ప్లేట్స్‌లో వడ్డిస్తూ.

ఆకలిగా లేకున్నా, మిసిమితో మరి కాసేపు దగ్గరగా గడపొచ్చన్న తలపుతో రాహుల్ ముందుకు అడుగేశాడు.

"అన్నమూ, పప్పులకు మంచి కాంబినేషన్ ఆవకాయ" అంటూ ప్లేట్లని అందించింది మిసిమి.

రూమంతా ఒక్కసారిగా ఆవకాయ పరిమళంతో గుబాళించింది.

రాహుల్, ఆ వాసనని గుండెల్నిండుగా పీల్చుకొంటూ "స్మెల్ అదిరింది!" అన్నాడు.

"రుచి మరింత అదిరింది, కళ్ళముందు స్వర్గం కనిపిస్తోంది" అర్ధ నిమీలిత నేత్రాలతో మొదటిముద్ద నోట్లో పెట్టుకోగానే అన్నాడు రాఘవ.

"మరి ఈ ఆవకాయ ఎవరు పెట్టారనుకొంటున్నావ్, నమ్రతక్క" అంది మిసిమి.

నమ్రత వరుసకి 'వదిన' అయినా, ఆమెకి చిన్నప్పటి నుండీ 'అక్కా' అని పిలవడం అలవాటు మిసిమికి.

నమ్రత పేరు వింటూనే, తండ్రి ముఖం ప్రఫుల్లం కావటం చూసిన స్వీటీకి, వెంటనే వెళ్ళి 'ఆ నమ్రతను' చూడాలన్పించింది.

రాహుల్, మొదటి ముద్ద నోట్లో పెట్టుకొని కాస్త నమిలాడో లేదో "ఓ గాడ్!" అని అరిచేశాడు.

అతని పసిమివదనం కాస్తా అరుణిమను సంతరించుకొంది. కళ్ళెంటా,

చమత్కారం,

# ఆశీస్సులో అంతరార్థం!



అమ్మ మగడు.. అక్క మగడు.. దానమ్మ మగడు... అంటూ పరుషోక్తులు కనిపించినా ఈ కింది పద్యం చాలా చమత్కారయుతమైంది. శ్రీమహాలక్ష్మి పరంగా ఆశీర్వదిస్తూ చెప్పిన ఈ పద్యంలో విశేషమైన అర్థం ఉంది. ఫలానా వారు మనకు దూరపు బంధువులు అని చెప్పుకుంటూ ఉంటాం. ఆ వ్యక్తి బంధుత్వం వివరించాలంటే ఎంతో మందిని ప్రస్తావించాల్సి ఉంటుంది. అలాగే ఇక్కడ లక్ష్మీదేవిని చెప్పడానికి ఎంతో మందిని పేర్కొంటూ వాళ్లవాళ్ల సంబంధ బాంధవ్యాలను చెప్పుకుంటూ వచ్చారీకవి. ఈ సబంధాల నేపథ్యంలో ఎన్నో దివ్యచరితలు మన మదిలో ఒకసారి కదులుతాయి.

ఆయా పౌరాణిక సన్నివేశాలు స్ఫురణకు రాగానే మనస్సులో దివ్యమైన భక్తిభావం పరిమళిస్తుంది. ఇంతకీ ఆ చమత్కార పద్యమేమిటో.. దాని అర్థమేమిటో తెలుసుకుదాం!

ఆలి నొల్లకయున్నవా నమ్మమగని
నందులోపల నున్నవా నక్కమగని
నమ్మినాతని జెరచు దానమ్మ సవతి
సిరులు మీకిచ్చు నెప్పట్ల గరుణతోడ!

ఆలి నొల్లక యున్నవాడు = వివాహం చేసుకోనని ప్రతిజ్ఞ చేసిన భీష్ముడు, వాని అమ్మ = భీష్ముని తల్లి గంగాదేవి, ఆమె మగడు = నదులకు భర్త సముద్రుడు, అందులోపల ఉన్న = సముద్రంలో నక్కిన మైనాక పర్వతం, వాని అక్క = ఆ పర్వతానికి అక్క అయిన పార్వతీదేవి

ఆమె మగడు = పార్వతీదేవి భర్త శివుడు, ఆ శివుని నమ్మినవాడు = శివుని గురించి పెద్ద తపస్సు చేసిన రావణాసురుడు, ఆతని చెరచునది = ఆ రావణుని వినాశనానికి కారణమైన సీతాదేవి, ఆమె తల్లి = సీతమ్మ తల్లి అయిన భూదేవి, ఆమెకు సవతి = శ్రీమహావిష్ణువు భార్య అయిన భూదేవికి సవతి శ్రీమహాలక్ష్మి, దయతో ఆ లక్ష్మీదేవి మీకు సకల సంపదలు ఇచ్చుగాక అని శుభాశీస్సులు!

సేకరణ : వై.వి.శివకాంత్

ముక్కువెంటా నీళ్ళు కారుతుంటే ఉక్కిరిబిక్కిరయ్యాడు. వెంటనే మిసిమి నిమ్మచెక్కను ఉప్పులో అద్ది, అతనికిస్తూ "దీన్ని కాస్త నాలుక్కి రాసుకోండి, కారం తగ్గుతుంది" అంది.

అతడలా చేశాక తేరుకొన్నాడు.

రోజీకి పచ్చళ్ళు, ఊరగాయలు పెట్టడం రాక కొంత, ఆరోగ్యానికంత మంచివిగావని కొంతా పచ్చళ్ళు కొనడంగానీ తినడం గానీ చేయదు. అందుకే రాహుల్ వాటికి దూరంగా ఉన్నాడు.

"ఈమాత్రం కారానికే అలా అయిపోయారేంటి? " ఆశ్చర్యంగా అడిగింది మిసిమి, లొట్టలేసుకొని తింటున్న స్వీటీని చూపిస్తూ.

"స్వీటీ! నువ్వెలా తినగల్గుతున్నావ్? " ఆశ్చర్యంగా అడిగాడు రాహుల్.

"ఇదుగో.. ఇలా నెయ్యి, పప్పులను కూడా పచ్చడిలో కలుపుకొని" అంది స్వీటీ రహస్యం చెబుతున్నట్లు.

దాంతో అంతా నవ్వేశారు.

"అబ్బో చాలా హెవీగా తినేశాను, వెళ్ళి కాసేపు పడుకొంటానేం? " అంటూ స్వీటీ తన రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

అంతా హాల్లోని సోఫాలో కూర్చున్నారు.

రాహుల్ అక్కడి ఏవో మాగజైన్స్ తిరగేయసాగాడు.

మిసిమి వెళ్ళి రాఘవ పక్కన కూర్చొని, అతనికి మాత్రమే వినిపించేలా "అన్నయ్యా! స్వీటీ వదిన లేని లోటుని ఎలా తట్టుకొంటోంది? అంతా ఓకేనే కదా? !" అంది అడగలేక అడుగుతూ.

"అది చిన్నపిల్లేగానీ పరిస్థితులు దాన్ని మెచ్యూర్డ్‌గర్ల్‌గా చేశాయి. కొత్తలో బెంగగా వుండేది. దాంతో హాస్పిటల్ పనులను సగానికి సగం తగ్గించుకొని తనతో టైమ్ స్పెండ్ చేశాను. ఈ విషయంలో రాహుల్ నాకు బాగా కో-ఆపరేట్ చేశాడు. తనుగూడా స్వీటీ మూడ్స్‌కు అనుగుణంగా, దాన్ని బయటికి తీసుకెళ్ళడం, రోజీ ఆంటీతో కూడా స్వీటీ గడిపేలా తమింటికి తీసుకెళ్ళడం చేశాడు. అలా ఆ తల్లీకొడుకుల మాటలవల్ల స్వీటీలో చాలా మార్పొచ్చింది. మంచేదో చెడేదో తెలుసుకొనే జ్ఞానం సంపాదించేసిందిలే" అన్నాడు రాఘవ కాస్త విచారంగా.

"అలాగా, థాంక్స్ మిస్టర్ రాహుల్! మీ మదర్‌కిగూడా నా తరపున థాంక్స్ చెప్పండి" అంది మిసిమి ఉద్వేగంగా రాహుల్ వంక తిరిగి.

"రాహుల్! మనమైనా ఈ ఫార్మాలిటీస్ పాటిస్తామో లేదో గాని, మా మిసిమి మాత్రం తప్పక పాటిస్తుంది. ఎంత బిజీగా వున్నా తన మనసులోది వెంటనే చెప్పేస్తుంది" నవ్వాడు రాఘవ.

"అన్నయ్యా! నువ్వు మళ్ళీ వదినను కలుసుకోలేదా? తనలో ఇంకా మార్పు రాలేదా? " బాధగా అడిగింది.

రాఘవ మౌనం వహించేసరికి ఆమెకర్థమైపోయింది, జూలీలో ఇంకా ఏ మార్పూ రాలేదని.

"నేనూ నాలుగైదుసార్లు మిసెస్ జూలీని కన్విన్స్ చేయబోయాను కానీ ఆమె వినిపించుకోలేదు. పైగా విసుక్కొంటూ, తమ పర్సనల్ వ్యవహారాల్లో కల్పించుకుంటే బాగుండదంటూ హెచ్చరించేసరికి మౌనం వహించక తప్పలేదు" కొద్దిగా జంకుతూ చెప్పాడు రాహుల్.

తనకోసం జూలీతో మాటలు గూడా పడినందుకు, ఆ విషయం దాచినందుకు రాహుల్ వంక బాధగా చూశాడు రాఘవ.

"జీవితాంతం ప్రయత్నించినా మూర్ఖుల్లో మార్పు తీసుకురాలేం. ఆమెకు మనం, మన పద్ధతులు నచ్చవు. పెద్దవారినెలా గౌరవించాలో తెలీదు. ఆఖరికి కట్టుకొన్న భర్తని, కన్నకూతుర్నీ ప్రేమించడమూ తెలీదు. ఎంతసేపూ లగ్జరీలైఫ్.. విందులూ వినోదాలూ కావాలంతే. ప్చ్. ఆ

మనిషి గురించి మాట్లాడుకోవటం శుద్ధ దండగ. దయచేసి ఆమె టాపిక్‌ని ఇక మీదటెప్పుడూ తీసుకురావద్దు" చిన్నగా అయినా కచ్చితంగా చెప్పాడు రాఘవ.

ఎర్రబారిన అతని ముఖమూ, కళ్ళూ చూసిన మిసిమికి అర్థమయింది, అతను బయటకు ఏడవలేకపోతున్నాడని.

"సారీ, అన్నయ్యా!" అంది మిసిమి, దిగులుగా.

అతని మనసుకి మరోసారి కష్టం కల్గించేలా చేయనంటూ రాహుల్ కూడా ప్రామిస్ చేశాడు.

కాసేపు మౌనం రాజ్యమేలిందక్కడ.

"తను లేనిదే నయమైందిలే. తనుంటే నిన్నిలా రిసీవ్ చేసుకోగలిగే వాడిని కాదేమో. ఆమె చూపించిన నిరాదరణవలనేగా అమ్మ వారం కాకముందే తిరిగెళ్ళిపోయింది. పాపం, ఇక్కడే మాతో ఉండాలనుకొని వచ్చింది. అలాంటి దాన్ని గుండెలనిండా బాధతో తిప్పి పంపించాల్సివచ్చింది. కొడుకుగా నేను మాత్రం ఉద్ధరించిందేం ఉందిలే. అమ్మకి పెరాల్సిస్ స్ట్రోక్ వచ్చినపుడు, నేనిక్కడ సెమినార్స్ వల్ల ఫుల్ బిజీ. విశాల్, నమ్రతలు అమ్మను చూసుకొంటున్నారని తెలీగానే నిశ్చింత కల్గింది. తర్వాత మధ్యలో ఓసారి వచ్చి కలుద్దామనుకున్నానుగానీ ముఖం చెల్లలేదు.

జూలీ మమ్మల్ని వదిలి వెళ్ళాక, నేను ఇక్కడివారితో గూడా మాట్లాడ్డం మానుకొన్నాను, నా మెతకదనం చూసి అందరూ నవ్వుకొంటారని. నేనే ఇలా వుంటే స్వీటీ మరీ డీలా పడుతుందని రాహుల్ పదే పదే అనడంవల్ల, ఈ మాత్రమైనా తేరుకోగలిగాను. పాపం ఇవేవీ తెలీని అమ్మ ఎంతగా బాధ పడుతోందో ఏంటో? " వేదనగా అన్నాడు రాఘవ.

"పెద్దమ్మ, నిన్నెప్పుడూ తప్పుపట్టదులే. తనకిక్కడి వెదర్ పడక వచ్చేశానంది గానీ.. వదిన గురించేమీ చెప్పనేలేదు" అంది మిసిమి.

## కొత్తగాలి...

**మొక్కలు నాటినాం**
**ఫొటోలు దిగినాం**
**పోషణ.. రక్షణ**
**మరచినాం!**

– చాడా మునిశేఖర్‌రెడ్డి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా

"చెప్పుకొంటే పరువు పోతుందిగా" అన్నాడు రాఘవ.

"అన్నయ్యా! నువ్వు ఫోన్ చేస్తేచాలు పెద్దమ్మ ఎంతో సంబరపడుతుంది. ఆమెకి ఆ సంతోషాన్నయినా ఇవ్వొచ్చుగా" అంది మిసిమి.

"నిజమే, ఇక మీదట, తరచూ మాట్లాడతాలే" అన్నాడు రాఘవ. తర్వాత రాహుల్ వైపు తిరిగి "రాహుల్! మా మిసిమికి బోర్ కొట్టకుండా చూడటం నీ ఫస్ట్ డ్యూటీ. ఇకనుండి వారంపాటు హాస్పిటలు, మిగిలిన పనులు మరచిపో. స్వీటీకి, మిసిమికీ లండన్ విశేషాలన్నీ చూపించడం నీ వంతు. అలాగే మీ అమ్మగారిని వీలైనప్పుడల్లా తీసుకొస్తూండు, సరేనా!" అన్నాడు.

ఆ మాటలు, రాహుల్‌కి ఎంతో మధురంగా తోచాయి.

"ఇక రెండు రోజుల్లో హాలిడేస్ స్టార్ట్ అవుతున్నాయి, ఎలా గడపాలో అనుకొన్నాను గానీ నేనేం బోర్‌గా ఫీలవ్వక్కర్లేదిక" సంతోషంగా అంది అప్పుడే గదిలోంచి వచ్చిన స్వీటీ.

"రాహుల్! నేను కాన్ఫరెన్సులతో చాలా బిజీగా ఉన్నాను. వీళ్లిద్దర్నీ ఎంటర్‌టెయిన్ చేసే బాధ్యత నీదే. నాకు వీలైనప్పుడల్లా మీతో జాయిన్ అవుతుంటాలే! రేపు స్వీటీ

స్కూల్‌కి వెళ్లిన తర్వాత మా మిసిమికి మీ మదర్‌ని పరిచయం చేస్తే, ఆమెతో బాటుగా మీరంతా లండన్ చుట్టేయొచ్చు" అన్నాడు రాఘవ.

రాహుల్‌తో చెల్లెలిని ఒంటరిగా పంపించడమంత బాగోదేమో, ఆమె ఇబ్బందిగా ఫీలవుతుందేమోనని ఆలోచించాడు అన్నగా. కానీ, ఓ పెద్దదిక్కు వారికి తోడుండటం శ్రేయస్కరమని అతడలా చెప్పాడని మిసిమికి రాహుల్‌కీ అర్థమైంది.

"అలాగే సర్! అమ్మ ఎలాగూ స్వీటీని చూసి చాలా కాలమైందని అంటూనే ఉంది. ఎల్లుండినుండి స్వీటీ ఇంట్లోనే వుంటుంది కాబట్టి అమ్మని తీసుకొని వస్తాను" అన్నాడు రాహుల్.

అన్నమాట ప్రకారమే, రెండ్రోజుల తర్వాత తన తల్లిని రాఘవ ఇంటికి తీసుకొని వచ్చాడు రాహుల్.

ఆమెను చూస్తూనే మిసిమి కళ్ళు ఇంతయ్యాయి, ఆశ్చర్యంతో.

"ఆంటీ! ఎంత బాగున్నారో? ఇప్పుడే ఇలా వుంటే వయసులో ఇంకెంత బాగుండేవారో? " అంది మనస్ఫూర్తిగా.

"నీకన్నా బాగున్నానా? బాపూ గీసిన బొమ్మలా వున్నావ్" అంటూ రోజీ, మిసిమి నుదుట చుంబించింది.

అది వారి ఫార్మాలిటీనే అయినా, ఆ చిన్ని చర్యతో ఆమె ఎంతో ఆత్మీయురాలిలా అన్పించింది మిసిమికి.

ఎప్పుడెప్పుడు, ఎక్కడికి వెళ్ళాలో రాహుల్, రాఘవా కలిసి ప్లాన్ చేశారు. లండన్‌లో పిల్లలకు హాలిడేస్, ఆగస్ట్ నెలలో ప్రారంభమవుతాయి. అందువల్ల పిల్లలు, పెద్దలు, వచ్చే పర్యాటకులతో షాపింగ్ సెంటర్లు, పర్యాటక ప్రదేశాలు కిటకిటలాడుతుంటాయి.

ఉదయపు ఫలహారాదులు ముగించుకొని బయల్దేరారు రోజీ, రాహుల్, మిసిమీ, స్వీటీలు.

రాఘవ ముఖ్యమైన ఆపరేషన్ చేయాల్సి వుండటంతో వారికన్నా ముందే వెళ్ళిపోయాడు.

'ఎక్కడ చూసినా పార్కులేనే' అంటూ ఆశ్చర్యపోయింది మిసిమి. హైడ్, రీజెంట్స్, రిచ్‌మండ్ పార్కులను చూస్తూ, "అబ్బ! నా కళ్ళెంత పుణ్యం చేసుకొన్నాయో, ఇవన్నీ చూడగల్గుతున్నందుకు" అంటూ సంబరపడుతుంటే 'ఇండియాను చూస్తూ నేనలా అనుకొనే రోజులెప్పుడొస్తాయో' అనుకొంది స్వీటీ.

"అబ్బ! ఆకాశానికి నిచ్చెనలేసినట్లు, ఎంతెంత పొడవైన వృక్షాలో" అంటూ మిసిమి తలెత్తి చూడలేక, మెడ పట్టుకుని మరీ చూస్తోంటే రోజీకి ముచ్చటేసింది.

ప్రతీ కూడలిలో ఎన్నో షాపింగ్ కాంప్లెక్సులున్నప్పటికీ, ఎక్కడికక్కడ ఇసుకవేస్తే రాలనట్లున్న జనాన్ని చూసి ఆశ్చర్యపోయింది మిసిమి.

ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్, రీజెంట్ స్ట్రీట్స్‌లోని హ్యామ్లీస్‌కి వెళ్ళారు.

"ఇవి ప్రపంచంలోనే అతి పెద్ద షాపింగ్ సెంటర్‌లు. ఇక్కడ దొరకని వస్తువంటూ ఉండదు" చెప్పాడు రాహుల్.

"లండన్ అందాలు చూడాలంటే థేమ్సునదిలో పడవ ప్రయాణం చేయాల్సిందేనని మా ఫ్రెండ్ చెప్పింది, నిజమేనా? " అడిగింది మిసిమి.

"అవును, ఆ మాట నిజమే. సుమారు రెండుగంటలు సాగే ఈ ప్రయాణంలో, పడవ రోడ్డుమీద నుండి నీటిలోకి, నీళ్ళల్లో నుండి రోడ్డు పైకి వస్తూంటే ఎంతో థ్రిల్‌గా ఉంటుంది" చెప్పింది రోజీ.

"రోజూ ఉదయం పదకొండు గంటలకే ప్రయాణం మొదలవుతుంది, సరిగ్గా సమయానికే చేరుకొన్నాం, పదండి వెళ్దాం" అన్నాడు రాహుల్.

వర్ణించ వీలుతరంగాని ఆ అనుభూతిని సొంతం చేసుకొన్నారంతా.

**అ**
**క్ష**
**రం**

నిజమైన స్నేహితులంటే
మనకు మరో రూపాలన్నమాట.

– అరిస్టాటిల్



మర్నాడు వెస్ట్ మినిస్టర్ బ్రిడ్జ్ రోడ్‌లో ఉన్న లండన్ అక్వేరియంకి బయల్దేరారు.

"ఇందులో మూడొందలయాభై రకాలకి పైగా జీవులున్నాయి. షార్కులు, నత్తలు, ఈల్, నక్షత్రపు చేపల్లాంటివెన్నో దీనిలో వుంటాయి. స్వేటీ! నువ్వు సరదాగా వాటి కేమైనా తిన్పించాలనుకుంటే తిన్పించొచ్చు" అన్నాడు రాహుల్.

ఆ తరువాత హోర్నిమన్ మ్యూజియంకు వెళ్ళారు. అక్కడున్న అనేక దేశాల, వివిధ సంగీత వాయిద్యాలు చూస్తూ పరవశించి పోయింది మిసిమి.

మరునాడు రెస్ట్ తీసుకొన్నారు. రోజీకి విలియమ్స్ నుండి ఫోన్ రావటంతో "అర్జెంజ్ పని వుందట. నేను వెళ్ళాలి, సారీ..! మీరంతా వెళ్ళి ఎంజాయ్ చేయండి" అంటూ వెళ్ళిపోయింది రోజీ.

ఆమెకి పనిపట్ల ఉన్న నిబద్ధతను చూసి మిసిమికి చాలా ముచ్చటేసింది. ఇండియాలో ఇంటిపట్టునే ఉంటూ ఆ కాస్త పనులకే ఎంతో అలసిపోయామనే ఆడవాళ్ళు గుర్తొచ్చారామెకి.

లండన్‌లోని అద్భుతమైన కట్టడం బ్రిటీష్ పార్లమెంట్ భవనాన్ని బయట నుండే చూశారు.

ఆ తర్వాత అలసట కలిగేవరకూ మరిన్ని ముఖ్యమైన ప్రదేశాలు చూసి ఇంటికి బయల్దేరారు. స్వేటీ, మిసిమిలను ఇంటికి భద్రంగా చేర్చి, తనింటికి బయల్దేరాడు రాహుల్.

★ ★ ★

ఆ రాత్రి అతని కలలనిండా మిసిమే నిండిపోయింది. రాహుల్ పొద్దుటే నిద్ర లేచి హుషారుగా తయారవుతూంటే రోజీ వింతగా చూసింది. అతని ముఖంలో తొణికిసలాడుతున్న ఆనందం ఆమెకి ఓ పక్క ఆనందాన్ని కలిగించినా, మనసులో ఏదో ఒక మూల తెలీని ఆందోళన పీకు తోందామెను.

'ఒక ముఖ్యమైన డాన్స్‌ప్రోగ్రామ్‌ని కండక్ట్ చేయవలసి వున్నందున రాలేనని' రోజీ అనేసరికి, రాహుల్ వెళ్ళాడు.

అప్పటికే తయారై, అతనికోసం ఎదురు చూస్తున్నారు మిసిమి, స్వేటీలు.

ముగ్గురూ కలిసి బర్మింగ్‌హామ్ వెళ్ళారు. అక్కడి బొటానికల్ గార్డెన్, నేచర్ సెంటర్లలో వేల రకాల మొక్కలు, చెట్లనీ ఎన్నో కొత్తరకాల జంతువులనీ చూసి ఎంజాయ్ చేశారు. ఆ తర్వాత వెంకటేశ్వ రాలయానికి వెళ్ళి దర్శనం చేసుకొన్నారు.

అలసటగా కారుసీట్‌కి జారగిలబడి కళ్ళు మూసుకొంది మిసిమి.

ఆమెను చూస్తున్నకొద్దీ ఇంకా చూడాలన్పించసాగింది రాహుల్‌కి.

'చూస్తున్నా, చూస్తున్నా, చూస్తూనే ఉన్నా..' పాటని అతడు పాడుకొంటూంటే, మనసులో గిలిగింతగా అన్పించింది మిసిమికి. పైకి మాత్రం "ప్రయాణాల్లో అలసట తెలీకుండా ఇలా ఏవో ఒకటి పాడుకొంటూంటే బాగుంటుంది కదూ" అంది.

"నిజమే. ఎలా ఉంది మా లండన్?" అడిగాడు రాహుల్.

"మీ లండనా? ఎంతక్కొన్నారేంటి?" కొంటెగా అడిగింది మిసిమి.

## కొత్తగాలి...

**మానవత్వం కురిపిస్తారు**
**మాటల్లో!**
**దానవత్వం చూపిస్తారు**
**నైజంలో!**

*- నండూరి లీలాప్రసూనాదేవి,*
*సికింద్రాబాద్*

నవ్వేశాడు రాహుల్.

"ఏమనిపించిందో చెప్పారుగాదు" రెట్టించాడు, ఆమెతో మాటలు పొడిగించాలని.

"ఇక్కడివారి క్రమశిక్షణ చాలా నచ్చింది. రూల్స్‌ని ప్రతొక్కరు సక్రమంగా పాటించడంవల్ల ట్రాఫిక్ చాలా సాఫీగా ఉంది. ముఖ్యంగా వృద్ధులు, పిల్లలు, అంగవికలాంగులకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించడం నిజంగా అభినందనీయం. మన ఇండియా గూడా ఇవన్నీ పాటించగల్గితే.. ఓహ్ ఎంత బావుంటుంది? మంచి ఎక్కడున్నా గ్రహించాలి అంటుంటారు మా నాన్న" అంది మిసిమి.

"మీరు నిశితంగా గమనిస్తారే? " మెచ్చుకున్నాడు రాహుల్.

"ఇంత అద్భుతమైన, అతి సుందరమైన నగరాన్ని అలాగే చూడాలి కదా" అందామె.

"ఇన్నేళ్ళుగా ఇక్కడున్నా, ఎన్నోసార్లు చూసినా ఈ అందాలన్నీ ఇప్పుడే కన్పిస్తున్నాయేంటో" అన్నాడు రాహుల్, మిసిమి వంక ఆరాధనగా చూస్తూ.

అతని చూపులు గిలిగింతలు రేపుతూంటే సిగ్గుతో కళ్ళను వాల్చుకొంది మిసిమి.

వంపుతిరిగిన ఆమె కనురెప్పలపై ముద్దాడాలనిపించిందతనికి.

బాగా చీకటి పడేంతవరకూ తిరిగి ఇల్లు చేరారు.

స్వీటీ రాగానే సోఫాలో వాలిపోయింది.

"ఇవాళ ఎప్పటికన్నా ఎక్కువగా తిరిగాం కదా! పాపం స్వీటీ సోఫాలో వాలిందో లేదో నిద్రలోకి జారుకొంది. మనం బయటే డిన్నర్ చేసి రావడం నయమైంది. నాకు మాత్రం అలసటా, ఒళ్లునొప్పులు తీరాలంటే, స్నానంచేసి తీరాల్సిందే. నేను స్నానంచేసి వచ్చేవరకూ స్వీటీ దగ్గరుండండి ప్లీజ్. తొందరగా వచ్చేస్తా" అంది మిసిమి, రిక్వెస్టింగా.

"సరే" అని రాహుల్, అక్కడున్న మరో సోఫాలో ఒరిగాడు.

రెండు నిముషాలైనా గడవకముందే కెవ్వుమనే కేక వినిపించింది, బాత్‌రూమ్ నుండి.

ఉలిక్కిపడి అటువైపు పరిగెత్తాడతను. ఓరగా తెరుచుకొన్న బాత్‌రూమ్ డోర్‌ని నెట్టిచూశాడు. మిసిమి పడిపోయి ఉండటం చూసి కంగారుపడ్డాడు.

'ఏమై ఉంటుంది, బహుశా తడిచేత్తో స్విచ్‌గానీ వేస్తే షాక్ కొట్టి ఉంటుందా? ఇంకా నయం, బాత్‌రూమ్ బోల్ట్ సరిగ్గా పడలేదు, గాబట్టి సరిపోయింది' అనుకొంటూ మిసిమిని లేపే ప్రయత్నం చేశాడు గానీ స్పృహతప్పి పడివున్న ఆమె లేవకపోయేసరికి చేతుల్లోకి తీసుకోకతప్పలేదతనికి. ఆమె వంటిమీద పెటీకోట్ మాత్రమే వక్షోజాలని కప్పి ఉంచటంతో, అర్థనగ్నంగా కన్పిస్తోన్న దేహం పసిడికాంతులు వెదజల్లుతూంటే, క్షణంపాటు వివశుడైపోయాడు. ఆమె స్పర్శ మెత్తగా తగులుతూంటే, అతనిలో కోరిక పురులు విప్పుకోసాగింది. కానీ వివేకం హెచ్చరించేసరికి, ఆమెను బెడ్‌రూమ్ వరకూ మోసుకెళ్లి, బెడ్‌మీద పడుకోబెట్టాడు. పొడిగా ఉన్న టవల్‌ను ఆమెకు చుట్టి, మెల్లగా తడిసిన పెట్టీకోట్‌ని లాగేశాడు. వేరే పొడి టవల్‌తో ఒళ్ళు తుడిచి, కాళ్లూ చేతులను

మర్దనా చేసి, తలపై నుండి నైటీని తొడి గాడు. తర్వాత అతను చేసిన ఫస్ట్ ఎయి డ్‌తో, ఆమె కళ్లు తెరిచింది.

క్షణంపాటు ఏం జరిగిందో అర్థం కాలే దామెకు. తర్వాత మెల్లగా జరిగిందేమిటో తెలిసి, తనెలా బెడ్ మీదకు రాగలిగిందో ఊహించుకొనేసరికి బుగ్గల్లోంచి వేడి ఆవిర్లు వచ్చేశాయి.

ఈలోగా పాలను వేడి చేసి తెచ్చి "ఇవి తాగి పడుకోండి. గుడ్‌నైట్. ఏదన్నా అవ సరముంటే ఫోన్ చేయండి" అని చెప్పి కదిలాడు రాహుల్.

ఆటోమాటిక్ లాక్ సిస్టం కావటాన డోర్ లాకయింది. మిసిమి పాలు తాగేసి, నిద్రలోకి జారుకొంది.

మరునాడు నిద్రలేచాక రాత్రి జరిగిం దంతా లీలగా గుర్తుకొచ్చింది. తనవంటి మీదున్న నైటీ రాహుల్ తొడిగాడన్నది స్ఫురించగానే మిసిమి ఒళ్లంతా ఝల్లు మంది. తన నగ్నదేహాన్ని రాహుల్ చూశాడన్నది తలపుకొస్తున్నకొద్దీ సిగ్గు ముంచుకు రాసాగింది.

పది గంటలకల్లా రాహుల్ వచ్చేశాడు. స్వీటీ రమ్మంటోన్నా అతనిముందుకు ఎప్పట్లా రాలేకపోయింది మిసిమి.

తను అడిగినవాటికి, లోపలి గదిలో నుండే జవాబిస్తోన్న మిసిమిని చూస్తే రాహుల్‌కి కొత్తగా, వింతగా అన్పించింది.

'భారతదేశపు.. అందునా తెలుగమ్మా యిలకు సిగ్గు ఎక్కువ' అని తాను విన్నది గుర్తుకొచ్చింది.

'ఇక్కడివాళ్ళు దాదాపు అర్ధనగ్నంగానే డ్రెస్సవుతారు. ఎంతో మామూలుగా తిరు గుతుంటారు. నగ్నత్వానికి, శీలానికి అంతగా ప్రాధాన్యతనీయరు. అలాంటి వారినెందరినో చూసినందుకేమో, తన లోనూ ఏదో తెలియని సంచలనం కల్గు తోంది' అనుకొన్నాడు రాహుల్.

మిసిమిలో కలిగిన సంకోచాన్ని పోగొ ట్టాలనుకుని "రాత్రి నిన్నొక పేషెంట్‌లా గానే ట్రీట్ చేశాను మిసిమీ! దానికి నువ్విలా సిగ్గుపడితే ఎలా? నువ్వేమీ మాట్లాడకుండా, ముడుచుకుపోయి నా ముందుకు గూడా రాకుంటే ఎలా? ఇంకా మనం చూడాల్సినవి చాలా ఉన్నాయ్ మరి" అంటూ ఎంతో నచ్చజెప్పాక గానీ, మిసిమి బయటికొచ్చి మామూలుగా మాట్లాడలేకపోయింది.

లోపలినుండి వచ్చి బిడియంగా కూర్చుంది. ఎర్రబడిన ఆమె బుగ్గలను చూస్తూ 'అబ్బో, ఈమె మామూలుగా అవ టానికింకా టైమ్ పట్టేటట్లుంది' అనుకొ న్నాడు రాహుల్.

అదేమీ గమనించలేని స్వీటీ ఎక్కడికైనా వెడదామంటూ వేధించసాగింది.

"ఇవాళ ఎంచక్కా పాటలు వింటూ గడి పేద్దాం. మీ అక్కకి హెల్త్ సరిగ్గా లేదట" అన్నాడు రాహుల్.

"అయ్యో అలాగా? సరే పాటలే విందాం మరి" అందామె.

దాంతో పాటలు వింటూ గడిపేశారు.

★ ★ ★

ఆ రాత్రి మళ్లీ ఆ సంఘటనే గుర్తుకురా సాగింది రాహుల్‌కి. పదేపదే ఆ దృశ్యమే కళ్లముందుకు వస్తూంటే పెదవుల మీదికి అలవోకగా చిరునవ్వు రాసాగింది. కళ్లు మూసినా, తెరిచినా మిసిమి రూపమే కద లాడుతూంటే బెడ్ మీద అస్థిమితంగా కద లసాగాడు.

"ఏంట్రా! రోజూ రాగానే నిద్రపోయేవా డివి, ఇవాళేమైంది? ఇంకా పడుకోవటం లేదు? ఇవాళెక్కడికి వెళ్లారు? మిసిమి ఏమంటోంది? " అంటూ రోజీ ప్రశ్నిస్తుంటే, తేలుకుట్టిన దొంగలా ఉలిక్కిపడ్డాడు రాహుల్.

"ఇవాళ ఎక్కడికీ వెళ్లలేదమ్మా" అన్నాడు చిన్నగా.

"ఓహో, మాటలతోనే గడిపేశారా? "




అందామె మామూలుగా.

"అవునమ్మా, పాటలు వింటూ గడిపాం. తనూ ఆ పాటలతో గొంతు కలుపుతూంటే, 'అబ్బ ఇన్ని పాటలొచ్చా?' అని ఆశ్చర్యపోయాం నేనూ, స్వీటీ" అన్నాడు పరవశంగా.

"ఒక్కరిలో ఇన్ని కళలుండటం అరుదు. అందం, ఐశ్వర్యం, గానం, పనితీరు అన్నీ ఉన్నాయ్. ఆరోజు చూశాగా, చకచకా వంట చేసింది. చక్కగా సర్వ్ చేసింది. ఇంటిని కూడా ఎంత నీట్‌గా సర్దిందో? మిసిమి కళ్లలో తొణికిసలాడే ఆ ఆత్మవిశ్వాసం, ఉత్సాహం చూస్తోంటే ఎంతో ముచ్చటేసింది. తన భవిష్యత్తు గురించి వేసుకొన్న ప్లాన్స్, ధ్యేయంగా పెట్టుకొన్న ఆశయాల గురించి చెబుతోంటే, ఆ వయసులో నేనలా ఎందుకు ఉండలేకపోయానన్పించింది. ఎంతైనా ఈ కాలపు అమ్మాయిలకు తెలివితేటలూ, దూరపుచూపూ ఎక్కువే" అందామె.

తల్లికి మిసిమి అంతగా నచ్చటం, రాహుల్ మనసుకి తెలీని సంతోషాన్ని




కలిగించింది.

★ ★ ★

"అక్కా! ఫోన్" అంటూ వచ్చింది స్వీటీ.

"అక్కా ఏంటే 'అత్తా' అనాలి గానీ" అంది మిసిమి.

"ఏంటో అక్కా అని పిలవడమే అలవాటైంది, అదే బాగుంది గూడా" అంది ఫోన్ మిసిమికి అందిస్తూ.

ఫోనందుకొని "అమ్మా! ఎలా ఉన్నావ్? నేను బాగానే ఉన్నా" తల్లి గొంతు వింటూనే ఆనందంగా అంది మిసిమి.

"నువ్వక్కడ బాగానే ఉన్నావేమో గానీ నువ్వు లేకుండా రేపు గుడికెలా వెళ్ళాలో తోచటంలేదు" అంది తల్లి.

"దేనికీ? "

"దేనికేంటి, రేపు నీ పుట్టినరోజు కదా, పండుగనాడు పాయసం, నీకిష్టమైన బొబ్బట్లు చేసి పెట్టేదాన్ని. అక్కడెవరు చేసి పెడ్తారు? " అందామె దిగులుగా.

"నేను రాగానే చేసి పెడుదువుగానిలే. అయినా నాకూ కాస్తాకూస్తో చేయడం వచ్చుగా, చేసి స్వీటీకి రుచి చూపిస్తాను"

అందామె మనసుకి నెమ్మది కలిగేలా. మరికాసేపు మాట్లాడి ఫోన్ పెట్టేసింది. స్నానం, పూజ అయ్యాక స్వీటీని తీసుకెళ్లి షాపింగ్ చేసుకొని వచ్చింది మిసిమి.

మరుసటిరోజు, స్వీటీకోసం కొన్న డ్రెస్ ఇచ్చి, తనూ కొత్తడ్రెస్ వేసుకొంది మిసిమి.

"ఏంటివాళ స్పెషల్, కొత్తడ్రెస్‌లు దేనికి? " అని అంతలోనే "దొంగా! ఇవాళ నీ బర్త్‌డే కదూ" అంది స్వీటీ ఏదో స్ఫురించినట్లు.

నవ్వుతూ తలూపింది మిసిమి.

"మెనీ హ్యాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అంటూ పరుగున తండ్రి దగ్గరికెళ్ళి విషయం చెప్పింది స్వీటీ.

"హ్యాపీ బర్త్‌డేరా" అంటూ బీరువాలోంచి ఇయర్‌రింగ్స్ తీసి గిఫ్ట్‌గా ఇచ్చాడు రాఘవ.

"ఓ! నీకు ముందే తెలుసు, గుర్తుంది కదూ, నేనే మర్చిపోయా" నాలుక కరుచుకొంది స్వీటీ.

"మరి మీ అత్తకు స్పెషలేం చేస్తావ్? " అడిగాడు రాఘవ.

"నేనేం చేయగలను? మంచి కేక్‌ని ఆర్డరిస్తాను" అంది స్వీటీ.

ఈలోగా రాహుల్, రోజీలు వచ్చారు.

"కేక్ ఎవరికోసం? అంటూ లోపలికి వచ్చాడు రాహుల్.

"అక్క బర్త్‌డే కదా మరి" నవ్వుతూ చెప్పింది స్వీటీ.

"ఓ! అలాగా, హ్యాపీ బర్త్‌డే' అన్నారిద్దరూ ఒకేసారి.

"అమ్మకీ సంగతి ముందే తెలిసినట్లు, మీకోసం పులిహోరా, బొబ్బట్లు చేసి తెచ్చింది" అంటూ కారియర్స్ అందించాడు రాహుల్.

వింటూనే స్వీటీ గెంతులేసింది.

"నాకిష్టమయిన బొబ్బట్లను ఈసారి దగ్గరుండి తినిపించలేకపోతున్నానని నిన్న ఫోన్‌లో చెప్పి బాధపడింది అమ్మ. థ్యాంక్స్ ఆంటీ, అమ్మకి చెబుతాను, అమ్మలాంటి ఆంటీ నాకు బొబ్బట్లు తెచ్చిందని" అంది సంతోషంగా మిసిమి, రోజీ చేతులను, తన చేతుల్లోకి తీసుకొంటూ.

"ఓహో! నిన్న నాకు రుచి చూపిస్తానంటూ నాన్నమ్మకి చెప్పింది వీటి గురించేనా? " అడిగింది స్వీటీ.

"అమ్మ డైరెక్షన్‌లో తప్ప సొంతంగా ఎప్పుడూ చేయలేదు వీటిని. అందుకే చేస్తే ఎలా వస్తాయోనని భయపడ్డాను. పాపం స్వీటీ మీదే నా తొలి ప్రయోగం అనుకున్నాను. మీరా గండంనుండి తప్పించారు" అంది మిసిమి.

ఆ మాటలకందరూ నవ్వారు.




**చూ**స్తుండగానే రోజులు ఇట్టే దొర్లిపోతున్నాయి.

కిటికీలోంచి బయటకు చూస్తూ ఏదో దీర్ఘాలోచనలో పడిన రాహుల్‌ని గమనించి "ఏంట్రా, అంత డల్‌గా ఉన్నావ్? " అనడిగింది రోజీ.

"మిసిమి నాలుగురోజుల్లో వెళ్ళిపోతుందమ్మా" దిగులుగా చెప్పాడు రాహుల్.

ఆ మాటల్లో తొంగిచూస్తోన్న బాధ రోజీ మనసుని బలంగా తాకింది. పైకిమాత్రం "వెళ్ళక తప్పదుగా మరి" అంది.

రాహుల్ మాటల్లో, చూపుల్లో మిసిమి పట్ల వున్న ప్రేమ, అభిమానం, ఆరాధన తెలుస్తూనే వుంది. వారి జంట చూడము

చ్చటగా ఉందని తను ఎన్నోసార్లు అనుకుంది కూడా.

యథాలాపంగా అడిగినట్లు "మిసిమి ఇంకా చదువుతుందా? లేక పెళ్ళి సంబంధాలు చూస్తున్నారా?" అని రాఘవను అడిగిందోసారి.

"మా పిన్ని, బాబాయ్‌లకు మిసిమి ఒక్కతే కూతురు. మంచి సాంప్రదాయం, ఆస్తిపాస్తులు ఉన్న సంబంధం కోసం చూస్తున్నారు. మిసిమి తమ కళ్ళముందు లేదా చుట్టుపక్కలే వుండాలని వారి కోరిక. ఎన్నో మంచి సంబంధాలు వస్తున్నప్పటికీ హైద్రాబాద్‌లో వుండే అబ్బాయికి ప్రాధాన్యతనిస్తున్నారు" అన్నాడు రాఘవ.

'సాంప్రదాయం, కులగౌరవాలకు పెద్ద పీట వేసేవాళ్ళు తమ సంబంధానికి ఒప్పుకోరు. ఒకవేళ ఒప్పుకున్నా మిసిమిని ఇంతదూరం ఇవ్వటానికసలే ఒప్పుకోరు, తన గురించి తెలిస్తే, అసలు రాహుల్ ముఖమైనా చూస్తారో లేదో? తన జీవితపు నీలినీడలు రాహుల్ జీవితాన్ని అంధకారబంధురం చేస్తాయా?' అనుకొంది మొదటిసారిగా.

అందుకే రాహుల్ మనసేంటో అర్థమవుతున్నా ఏం గ్రహించనిదానిలా నటిస్తోంది. మిసిమి, తమకు అందరాని చందమామ అని అతడు గ్రహించేలా మాట్లాడక తప్పటంలేదు.

మిసిమి వెళ్ళేరోజు రానే వచ్చింది.

అందమైన పూల బోకే తీసుకొని వెళ్ళారు రాహుల్, రోజీలు.

చూడగానే మనసుని హత్తుకొనేలా వివిధ వర్ణాలతో పరిమళాన్ని వెదజల్లుతోన్న ఆ పుష్పగుచ్ఛాన్ని ఎంతో ఇష్టంతో అందుకొన్న మిసిమి అపురూపంగా ఆ పూలని తన బుగ్గలకు రాసుకొంటూ మురిసిపోయింది. ఆమె కళ్ళలోని ఆనందం వారికెంతో తృప్తినిచ్చింది.

'ఇంత చక్కటి పిల్ల తన కోడలు కాకపోతోందే?' అని బాధపడింది రోజీ.

పైకి నవ్వుతూ మాట్లాడుతోన్నా, తల్లి మనసులో దేనిగురించో బాధపడుతోందని గ్రహించిన రాహుల్ "ఏంటమ్మా? ఏడుస్తున్న స్వీటీని అనునయించాల్సింది పోయి నువ్వే ఇంతగా బాధపడిపోతే ఎలా?" అన్నాడు.

దాంతో తనని తాను కంట్రోల్ చేసుకుని "మళ్ళీ నిన్నెప్పుడు చూస్తానో? ఎప్పుడు నీ పాటలు వింటామో, ఇప్పుడేదైనా పాట పాడమ్మా" అంది మిసిమితో.

మిసిమి, రాహుల్ వంక చూసింది. అతని కళ్ళలోనూ అదే రిక్వెస్ట్ కన్పించేసరికి గొంతు సవరించుకుని 'రాముని వారము, మాకేల విచారము' అంటూ పాడింది. ఆమె స్వరమాధుర్యానికి వాళ్ళు ఏ లోకాల్లోకో వెళ్ళిపోయారు.

రోజీకైతే ఆనందాశ్రువులు చెంపలమీదకు జాలువారాయి.

'ఇలా వింటూ కన్ను మూయగల్గితే, అంతకుమించిన అదృష్టం ఉంటుందా?' అనుకొందామె.

'అందచందాలు, వాటిని మించిన వినమ్రత, సంగీతజ్ఞానం ఉన్న మిసిమి ఎవరి సొంతమవుతుందో గానీ, అతడిని మించిన అదృష్టవంతుడు మరొకడుండడు' అనుకొన్నాడు రాహుల్, తనే ఆ లక్కీ ఫెలో కానందుకు బాధపడుతూ.

'ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళి, మిసిమి కళ్లముందే దూరమవుతూంటే చూడలేను' అనుకుని అర్జెంట్ పని ఉందని చెప్పి, అక్కడినుండి భారమైన మనసుతో కదిలాడు రాహుల్.

అతడంత త్వరగా, అలా వెళ్ళిపోవడం మిసిమికి కష్టంగా తోచింది. కన్నీరు మున్నీరవుతోన్న స్వీటీని ఊరడిస్తూ "ఏయ్ పండూ! ఇలా ఏడవటం ఏమీ బాగోలేదు. ఈ గ్లోబలైజేషన్ వల్ల ప్రపంచమంతా మన గుప్పిట్లోనే ఉంది కదా. తరచూ మాట్లాడుకొంటూ టచ్‌లో ఉందాం, సరే

నా? " అంది స్వీటీని దగ్గరకు తీసుకొని.

"ఇప్పుడిలాగే అంటావ్, అక్కడికి వెళ్ళ గానే బిజీగా అయిపోతావ్" ఏడుస్తూనే అంది స్వీటీ.

"ఎంత బిజీగా ఉన్నా, నువ్విలా ఏడుస్తూ సెండాఫ్ ఇస్తే, నిన్ను తల్చుకొన్న ప్పుడల్లా ఈ ఏడ్పు ముఖమే గుర్తుకొ స్తుంది, ప్లీజ్ నవ్వుతూ నన్ను పంపిం చవా? " బతిమాలుతూ అంది మిసిమి.

నవ్వడానికి చాలా ప్రయత్నమే చేయవ లసివచ్చింది స్వీటీకి. తనతల్లి తెగతెంపులు చేసుకొని వెళ్ళిపోయిన రోజయినా ఇంతగా ఏడవలేదు. పైగా రోజూ జరిగే గొడవలు ఇకనుండైనా ఉండవన్న ఆలోచన రిలీఫ్‌నే కల్గించిందప్పుడు.

కానీ మిసిమి, కన్నతల్లికన్నా ఎక్కువగా ప్రేమాభిమానాలను అందించినందుకేమో, ఆమె వెడుతూంటే తట్టుకోలేకపోతోంది.

మిసిమి వచ్చిన నెలరోజులకే స్వీటీ మెచ్యూర్ అయింది. ఆ సమయంలో ఎలా ఉండాలో, తనకేవేవి తినడానికి వ్వాలో ఏయే జాగ్రత్తలు తీసుకోవాలో తన తల్లికి ఫోన్లమీద ఫోన్లు చేస్తూ, తనకవన్నీ చేసింది శ్రద్ధగా. తనకిష్టమైన వంటకాలని చేసి పెడుతూ, కొసరికొసరి తిన్పించింది. ఆమె చర్యలవెనుక ప్రేమించేమనసు గ్రహించగలిగింది కాబట్టే, ఆమె తమని వదిలి వెడుతోందంటే, తన శరీరంలోని ముఖ్యమైన అవయవమేదో దూరమవుతు న్నట్లు ఫీలవుతోంది స్వీటీ.

"ప్చ్. నేనిక్కడికి రాకుండా ఉండా ల్సింది, వచ్చినా ఇన్నినెలలు ఉండవల సింది కాదు" స్వగతంలా అన్నది మిసిమి.

"ఏంటలా అంటున్నావ్, నీకేదైనా బాధ కల్గించామా? " బాధగా అడిగాడు రాఘవ.

"మీ ఇద్దర్నీ ఇలా బాధపెడుతున్నది నేనేగా మరి" అంది, తడి కళ్ళతో నవ్వుతూ.

"దూరమవుతున్నది మళ్ళీ దగ్గరవ్వడా నికే అనుకొంటే, ఇంత బాధగా వుండదు" అంది రోజీ ఓదార్పుగా.

ఆత్మీయులకు దూరంగా వుండటంవల్ల, అనుబంధాల విలువేంటో తెలుసామెకి. చేసేది లేక బాధని అణిచిపెట్టుకొని, నవ్వుతూ మిసిమికి సెండాఫ్ ఇవ్వక తప్ప లేదు ఆ తండ్రీ కూతుళ్లకు.

★ ★ ★

మిసిమి వెళ్ళాక చాలా వెలితిగా ఫీల య్యారా తండ్రీ కూతుళ్ళు. ప్రతిరోజూ, బెడ్‌మీదకు చేరగానే ఇండియాలోని తమ వారందరి గురించి, తన స్నేహితుల గురించి, అక్కడ ఏ పండుగ ఎలా జరుపు కుంటారు, వాటి వెనకున్న కథలు, అక్కడి ఫంక్షన్లు, పద్ధతులు, ఆచారాల గురించి అన్నీ వివరంగా చెప్పేది. మధ్యమధ్యలో అమ్మాయిలు ఎలా మసలుకోవాలో, ధైర్యంగా ఎలాంటి పరిస్థితులనెదుర్కో వాలో చిన్న కథలుగానో, హింట్స్‌తోనో చెప్పేది మిసిమి. అలా రోజూ ఏదో ఒకటి వినడం అలవాటైన స్వీటీకి, ఆ రాత్రి ఎంతకీ నిద్రపట్టలేదు.

"ఏంట్రా! ఇంకా నిద్రపోలేదూ? " అంటూ వచ్చి, స్వీటీ మంచమ్మీద కూర్చు న్నాడు రాఘవ.

"నాన్నా! నువ్వసలు ఇండియా వదిలి ఎందుకొచ్చావ్? రాకుండా ఉండాల్సింది. లేదూ మమ్మీని పెళ్ళి చేసుకోకుండానైనా ఉండాల్సింది" అంది స్వీటీ.

ఆ మాటలకు ఒక్కసారిగా ఉలిక్కిప డ్డాడు రాఘవ.

'నిజమే, ఆ రెండు పొరపాట్లే జీవితా న్నిలా మార్చేశాయ్' అనుకొంటూ "ఇప్పుడా మాటలన్నీ దేనికిలేమ్మా? కళ్ళు మూసు కొని నిద్రపో" అన్నాడు స్వీటీకి దుప్పటి కప్పుతూ.

"గుడ్‌నైట్ డాడీ!" అంది స్వీటీ.

వెళ్ళి తన మంచంమీద ఒరిగాడేగానీ, అతనికి నిద్రపట్టలేదు.

అక్షరం

ఇతరులు చేసిన గాయాలను మర్చిపో.
కానీ, ఇతరులు చూపిన కరుణను మాత్రం
ఎన్నటికీ మర్చిపోకు.

– కన్‌ఫ్యూషియస్



తను చదువుకోసం అమెరికా వెడతానంటే తల్లి ఒప్పుకోలేదు. అయినా పట్టు బట్టి వచ్చేశాడు. అక్కడేవుంటే తననెలా గోలా ఒప్పించి నమ్రతతో పెళ్లి జరిపించేదేమో. కానీ నమ్రత తనకన్నా చిన్నది కావటంతో ఆమెమీద అలాంటి అభిప్రాయం ఏర్పడలేదు. తనకూ అంతే కావడం మూలంగా ప్రొసీడ్ కాలేదు. కానీ నమ్రత పట్ల తెలీని ఇష్టం మనసులో ఉండేది. ఆ తర్వాత జాబ్ రావటం, జూలీతో పరిచయం.. ఆమె 'తనవాళ్ళంతా లండన్‌లో ఉన్నారు, అక్కడే మంచి క్లినిక్ పెట్టుకోవచ్చు' అంటూ పోరు పెట్టేసరికి, లండన్‌కి షిఫ్ట్ అయ్యాడు. తల్లి మధ్యమధ్యలో 'నమ్రత' టాపిక్ తెస్తుంటే, ఇక లాభంలేదని, ఆమెతో తన ప్రేమ గురించి చెప్పి, వ్యవహారాన్ని పెళ్ళి దాకా తీసుకురానీయొద్దని రిక్వెస్ట్ చేశాడు. తల్లికి పెద్దమొత్తంలో డబ్బు పంపుతూ ఆమెని బుట్టలో వేసుకునే ప్రయత్నం చేశాడు. ఈలోగా జూలీతో శారీరక సంబంధం ఏర్పడటంతో పెళ్లి చేసుకొన్నాడు.

కొత్తలో ఆమె ఇంటిని గురించి పట్టించుకోకున్నా, ఇంకా చిన్నతనంలే, ముందు ముందు నేర్చుకుంటుందిలే అనుకొంటూ తలమీదకెక్కించుకొన్నాడు. ఫ్రెండ్స్‌తో తిరగడం, తనవారి మాటలకే ప్రాధాన్యత నివ్వడంతో, జూలీతో క్రమంగా గొడవలు పెరగసాగాయి. తన మంచితనాన్ని, మెతకదనాన్ని అలుసుగా తీసుకొంది.

ఇంటివిషయాలు వీధికెక్కకూడదన్న భావం, తన రక్తంలో ఉన్నందున మౌనం వహించాడు. దాంతో తను చెప్పేదే కరెక్ట్ అని, తన మాటకు ఎదురు చెప్పొద్దని మొండిగా వ్యవహరించడం మొదలెట్టింది. అంతేనా, తొలిసారిగా వచ్చిన ప్రెగ్నెన్సీ తన స్వేచ్ఛకు అడ్డనుకొని అబార్షన్ చేయించుకొంది. అది తెలిసి నిర్ఘాంతపోయాడు. తన కోపాన్ని 'మౌనం' ద్వారా తెలీజేశాడొకసారి. అందువల్లో, నాల్గోనెల వచ్చే దాకా తనకే తెలియకోగానీ స్వీటీకి జన్మనిచ్చింది జూలీ.

స్వీటీ పుట్టినా ఆమెలో ఏ మార్పూ రాలేదు. తన తల్లికో, ఆయాలకో అప్పజెప్పి షికార్లకు, షాపింగ్‌లకూ వెళ్ళేది. క్లినిక్‌లో గూడా ఎక్కువగా గడిపేది కాదు. ఫ్రెండ్స్‌తో, అందులోనూ తనకి బాయ్ ఫ్రెండ్సే ఎక్కువ.. వారితో పార్టీలకు, పబ్బులకు తిరుగుతూంటే, ఎలా కంట్రోల్ చేయాలో అర్థంగాక తలపట్టుకొనేవాడు. రోజూ నరకమే చూపించినా, స్వీటీ కోసం ఎంతో ఓర్పు వహించాడు.

మనవరాలిని చూసుకోవాలని గంపెడంత ఆశతో తల్లి వస్తే ఆమెను కనీసం మర్యాదకైనా పలకరించలేదు, పైగా వేషభాషలు, అలవాట్లని ఎద్దేవా చేసేది. ఆమె తనవాళ్ళతో కలిసి హేళన చేసినప్పుడల్లా తనతల్లి కళ్ళనీళ్ళ పర్యంతమయ్యేది. ఆమె స్వీటీ విషయంలో ఏదైనా చెప్పబోయినా, చేసినా గట్టిగా విసుక్కునేది. దానివల్ల తమ మధ్య మరిన్ని గొడవలు. అవి చూడలేక తల్లి తిరుగుప్రయాణం కట్టేసింది. వారించాలనుకొనీ, ఆగిపోయాడు.

తల్లికి అనారోగ్యమని తెలిసినా, బిజీ

షెడ్యూల్ వల్ల వెళ్ళలేకపోయాడు. మరుసటి సంవత్సరం ఇండియాకి వెడదామని చెబితే "వెడితే నువ్వెళ్ళు, నేనుగానీ, నా కూతురుగానీ అక్కడికొచ్చి, ఆ డర్టీ ప్లేసెస్‌లో ఉండలేం" అంటూ మొండికెత్తింది. తనని, తనవాళ్ళనే గాక, తన దేశాన్ని కూడా ఛీత్కరించి మాట్లాడేసరికి ఒళ్ళు మండిపోయింది. ఆమెకు 'తందానా' అనే ఆమె బంధువులూ ఆమెనే సపోర్ట్ చేయడంతో మరి భరించలేకపోయాడు.

"నీతీజాతీ లేని దానివి, నువ్వా అనేదానివేనా? నీకసలు ఇండియా పేరెత్తే అర్హతలేదు" అని తను అనేసరికి డైవోర్స్ వరకూ వెళ్ళింది. తర్వాత తెలిసింది అదో వంక మాత్రమే, అసలు సంగతి తనకెవరితోనో ఎఫయిర్ ముదిరిందని.

రోజూ కీచులాటల మధ్య బెదురుగా, బెరుగ్గా స్వీటీ పెరగవలసి రావడం మనసుకెంతో కష్టాన్ని కల్గించసాగింది. అందుకే జూలీ కోరుకున్నట్లు విడాకులిచ్చేశాడు. ఈ ఆరేళ్ళుగా తనే స్వీటీకి సర్వస్వంగా మారాడు.

ఆడపిల్ల పెరుగుతున్నకొద్దీ తల్లి అవసరముంటుందంటారు. ఆ అదృష్టం స్వీటీకి లేదు కాబట్టి ఇండియా పంపిస్తేనో అనుకొన్నాడు. కానీ దానివల్ల తాము విడిపోయిన సంగతి తల్లికి తెలిసి బాధపడ్తుందని, ఇండియాలోని తన బంధువులకి తెలిస్తే లోకువ చేస్తారని ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నాడు. తన ఏకైక కూతురి విషయంలోనే గాక, తండ్రి లేని లోటు తెలీకుండా, తననింతవాడిని చేసిన తల్లి రుణం తీర్చుకోలేకపోతున్నందుకు, తనకెంతో బాధ కల్గుతూనే ఉంటుంది.

మిసిమి ఇంట్లో కంప్యూటర్, నెట్ వుండటం వల్ల, స్వీటీ, మిసిమిల మధ్య మాటల వారధి కల్పించి కొంత తృప్తిపడగలిగాడు. తన చిన్నమ్మ కూతురైన మిసిమి తమింట్లో ఎక్కువగా గడపడం వల్ల, సొంత చెల్లెల్లానే అన్పిస్తుంది. వాళ్ళందరితో బాగా చనువు.

'చిన్నమ్మా, మీరంతా స్వీటీని చూడదల్చుకోలేదా? ఓసారి మిసిమిని తీసుకొని రండి, మీకూ లండన్ చూసినట్లుంటుంది' అని ఎన్నోసార్లు అన్నందుగ్గానూ 'మిసిమి ఫ్రెండొకామె తన ఫ్యామిలీతో ఫారెన్‌ట్రిప్ వేసుకొంటోంది. వాళ్ళతోబాటు మిసిమిని పంపిస్తాం, నువ్వు పికప్ చేసుకొంటే చాలు' అంటూ పంపించారు.

ఫోన్‌లలో తరచూ మాట్లాడుకొనే స్వీటీ, మిసిమిలు ఈ కొద్దిరోజుల్లో బాగా చేరికయ్యారు. కన్నతల్లి లాలనను మిసిమి పంచినందుకేమో మిసిమి వెళ్ళడం స్వీటీకంత బాధని కలిగిస్తోంది. తన వయసుని మించి ఆలోచించేలా చేస్తోంది.

"సారీ నాన్నా! నీకు బాధ కల్గించానా? అందుకే మాట్లాడకుండా పడుకున్నావా?" అని స్వీటీ అడుగుతుంటే ఆలోచనల్లోంచి తేరుకొన్నాడు రాఘవ.

"నా బంగారుతల్లి నాకు బాధ కల్గించడమా, నెవర్. అదేంకాదు. నాకే ఏవేవో గుర్తుకొచ్చాయి. మీ మమ్మీని పెళ్ళాడి పొరపాటు చేసినా నీలాంటి బంగారుబిడ్డను పొంది, ఆ తప్పుని కరెక్ట్ చేసుకొన్నాగా. మీ అమ్మ ఎలాంటిదైనా ఆమె చేసిన మంచిపని ఏదన్నా వుందంటే అది కచ్చితంగా నిన్ను నాకివ్వడమే. అందుకేగా ఆమెని క్షమించగలిగాను" అన్నాడు రాఘవ మనస్ఫూర్తిగా.

'అమ్మని మీరు క్షమించినా నేనెప్పటికీ క్షమించలేను డాడీ. అమ్మకు వేరే ఎఫైర్ వుందని, అయినా డైవర్స్ ఇవ్వడానికి, నన్ను మీకివ్వడానికి, మీనుండి పెద్దమొత్తాన్నే తీసుకొందని వాళ్ళూవీళ్ళూ అనగా నాకెప్పుడో తెల్సింది. ఆమెనెప్పటికీ క్షమించలేనుగాక క్షమించలేను' అనుకొంది మనసులో స్వీటీ.

తర్వాత స్వీటీ కోపం చిత్రంగా నమ్రత

మీదికి మళ్ళింది. 'ఆ ఆంటీ నాన్నను పెళ్ళాడి వుంటే, అందరం ఇండియాలోనే వుండేవాళ్ళంగా' అనుకొంది.

"ఏంటమ్మా, ఇంకేం ఆలోచిస్తున్నావ్? నిద్రపో బంగారూ" లాలనగా అన్నాడు రాఘవ.

"సరే నాన్నా, గుడ్‌నైట్!" అంది స్వీటీ! 'ఓసారి నమ్రతా ఆంటీని చూడాలి' అనుకొంది. ఆ కోరిక తీరేరోజు త్వరలోనే వస్తుందని ఆ క్షణం తెలీదామెకి.

★ ★ ★

రోజులు వేగంగా పరుగులు తీస్తున్నాయి. సెల్‌ఫోన్ పుణ్యమాని రాహుల్, మిసిమీల మధ్య స్నేహం దినదిన ప్రవర్ధమానమవుతోంది.

కళ్ళారా ఒకరినొకరు చూసుకోవటం లేదన్న మాటేగానీ, వారి మనసులెప్పుడూ ఆత్మీయంగా పరామర్శించుకొంటూనే ఉన్నాయి. ఒకరి భావాలనొకరు మన్నించుకోవటం వారి ప్రేమకు పునాదైంది.

రాహుల్ ఇస్తోన్న ధైర్యం, పోత్సాహం వల్ల మిసిమి, రేడియో, టీవీల్లో పాడటం మొదలుపెట్టింది. ఎప్పటికప్పుడు అతని అభిప్రాయాలు, విమర్శలను తెలుసుకోవటం, తననితాను మరింత ఇంప్రూవ్ చేసుకోవటం మామూలైంది.

'నువ్వంటే నాకిష్టం, నువ్వులేనిదే నేను లేను' అంటూ ఒకరికొకరు చెప్పుకోకపోయినా, వారి మనసులెప్పుడో చెప్పేసుకున్నాయి- 'నువ్వే నేనంటూ'.

★ ★ ★

ఆరోజు స్వీటీ బర్త్‌డే.

విషెస్ చెప్పడానికి వెళ్ళాడు రాహుల్.

అతను తెచ్చిన ఫ్లవర్‌బొకే, రోజీ పంపించిన పరికిణీ, జాకెట్, ఓణీలను చూసి ఎంతో ఎగ్జయిట్ అయింది స్వీటీ.

"మిసిమి హాఫ్‌శారీలో ఉన్నప్పుడు స్వీటీ కళ్ళలో ఆ డ్రెస్ మీదున్న మక్కువ కన్పించిందట మమ్మీకి. అందుకే తనే డిజైన్ చేసి కుట్టింది" నవ్వుతూ చెప్పాడు రాహుల్.

'ఏ విషయాన్నయినా ఆడవాళ్ళిట్టే పసిగడతారు' అనుకోకుండా ఉండలేకపోయాడు రాఘవ.

"ఈ డ్రెస్‌లో నిన్నో ఫొటో తీయమంది అమ్మ. మరి వేసుకొని వస్తావా? " అడిగాడు రాహుల్.

"ఓ యస్, అలాగే" అంటూ పదినిముషాల్లో తయారైవచ్చింది స్వీటీ.

ఎప్పుడూ బిగించి వేసే పోనీటెయిల్ వేసుకోకుండా, జుట్టుని లూజ్‌గా వదిలేసింది. నుదుట దోసగింజంత బొట్టు పెట్టుకొని, కళ్ళకు సన్నగా కాటుక దిద్దింది. అంతే ఆ లంగా ఓణీల్లో, ఆ అలంకరణలో ముచ్చటగా వుంది స్వీటీ.

'ఫ్రాకులు, మిడీస్‌లో తెలీడంలేదు గానీ స్వీటీ ఎదుగుతోంది' అనుకొన్నాడు రాఘవ, మొదటిసారిగా.

అప్పుడే రాహుల్ సెల్ రింగైంది. అతడి ముఖంలోకి దూసుకొచ్చిన వెలుగు, సంతోషాలు చూస్తూనే, అది మిసిమి నుండని చప్పున గ్రహించేసింది స్వీటీ.

"ఓ కంగ్రాట్స్! ప్చ్ నాది బ్యాడ్‌లక్, చూడలేకపోతున్నందుకు" అని రాహుల్ అంటోంటే ఏంటన్నట్లు కళ్ళతోనే ప్రశ్నించింది స్వీటీ.

"మిసిమి, ఇంతవరకూ తమ గ్రూప్‌తో

## కొత్తగాలి...

**నీటి సంక్షోభం**
**అవినీతి తిమింగలం**
**ఎన్ని చర్యలు తీసుకున్నా**
**వస్తూనే ఉంటాయి!**

– నల్లపాటి సురేంద్ర,
పెదగంట్యాడ, విశాఖ జిల్లా

కచేరీలు చేస్తోంది కదా! మొదటిసారిగా సోలోగా పాడబోతోందట" అన్నాడు.

'ఓ, అలాగా, ఎప్పుడు? " ఆత్రంగా అడిగింది స్వీటీ.

"నెక్స్ట్ మంత్‌లోనట" చెప్పాడు రాహుల్ కాస్త దిగులుగా. అతనికా మాట వింటూనే రెక్కలు గట్టుకు వెళ్ళాలన్పించింది మరి.

"డాడీ! మనం వెళ్ళి అక్కని సర్‌ప్రైజ్ చేద్దామా? ఇండియానీ, మనవాళ్ళందరినీ చూసినట్లు గూడా అవుతుంది" ఆశగా అడిగింది స్వీటీ.

ఆ పిల్ల కళ్ళలో కదలాడుతున్న ఆశ, ఆకాంక్షలను చూసేసరికి రాఘవ హృదయం ద్రవించింది.

తల్లిదండ్రుల, బంధుమిత్రుల మమతానురాగాలు చవిచూసిన తనకే ఇంకా తనివి తీరలేదు. అలాంటిది అందరూ ఉండి ఏకాకిగా మారిన తన కూతురు, మిసిమిద్వారా అవి కాస్త రుచి చూసినందుకేమో, మరింతగా ఆశిస్తోంది.

పాపం, తనక్కూడా వాటిని అందనీయాలంటే వెళ్ళక తప్పదు అనుకుని "సరే లేమ్మా, నెక్స్ట్ మంత్ అంటున్నారుగా, అప్పటికి నేను ఫ్రీగా ఉండేలా ఏర్పాట్లు చేసుకుంటాలే" అన్నాడు.

ఆ మాట వింటూనే స్వీటీ కళ్ళు మెరిశాయి. పరుగున వచ్చి రాఘవ బుగ్గల మీద గట్టిగా ముద్దులు పెట్టేసింది.

హాయిగా నవ్వాడు రాఘవ.

"మరి మనం నమ్రతాంటీ వాళ్లింటికి గూడా వెళదామా? పల్లెటూరిని చూడాలన్న కోరికా తీరుతుంది" అంది స్వీటీ.

"తప్పకుండా వెడదాం. నీకు నాన్నమ్మ దగ్గరికన్నా అక్కడే బాగా టైమ్ పాసవుతుంది వాళ్ళ పిల్లలతో. ఆ ఆంటీ, అంకుల్ నాన్నమ్మకి ఒంట్లో బాగోలేనప్పుడు దగ్గరుంచుకొని మరీ చూశారు. వాళ్ల రుణం ఎలా తీర్చుకోగలనో" అన్నాడు రాఘవ.

తనని రిజెక్ట్ చేసిన నమ్రతపట్ల ఏమాత్రం కోపం లేకపోగా, వాళ్ళ పేరెత్తగానే రాఘవ కళ్ళలో తొణికిసలాడుతున్న ప్రేమాభిమానాలను, గౌరవాన్ని చూస్తూ ఆశ్చర్యపోయింది స్వీటీ.

వారిద్దరి మాటలు వింటూనే డల్‌గా మారిపోయాడు రాహుల్. 'కచేరీ చూసే వంకన మిసిమినీ, ఇండియానీ చూడొచ్చు. మెల్లగా తల్లిని కన్విన్స్ చేస్తే సరి' అని అప్పటికే ఎన్నో రకాలుగా ఆలోచించిన రాహుల్ ఒక్కసారిగా కుదేలయ్యాడు. 'రాఘవగారు, స్వీటీ వెడితే హాస్పిటల్ బాధ్యతని తనకే అప్పజెబుతారు. అతని మీదున్న గౌరవంతో తను కాదనలేడు' అనుకుంటుండగానే "రాహుల్! స్వీటీ మాటలు విన్నావుగా. నువ్వు హాస్పిటల్ చూసుకొంటానంటే నేను ప్లాన్ చేసుకుంటాను మరి" అన్నాడు రాఘవ.

"రాహుల్, ప్లీజ్ ప్లీజ్" అంటూ స్వీటీ అంటుంటే "ఇంతగా చెప్పాలా? సరే హాస్పిటల్ బాధ్యత నాది. మీరిద్దరూ వెళ్ళి ఎంజాయ్ చేయండి" అన్నాడు రాహుల్.

"థాంక్యూ" అంటూ పరుగున వచ్చి అతడ్ని చుట్టేసింది స్వీటీ.

★ ★ ★

ఎదురుచూసిన ఆరోజు రానే వచ్చింది.

ఫ్లైట్ దిగి మొదటి అడుగు నేలమీద పెడుతూనే వంగి భూమాతకు తన రెండు చేతులూ ఆనించి నమస్కరిస్తున్న రాఘవను చూస్తూ, తను అలాగే అభివందనం చేసింది స్వీటీ.

కొడుకునీ, మనవరాలినీ చూసుకుని సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయింది ఇంద్రాణి. తల్లి కౌగిట్లో పసిపిల్లాడిలా తలదాచుకొని, ఆనందాశ్రువులు రాల్చాడు రాఘవ. వారిద్దరి వంకా నోటిమాట లేకుండా చూస్తూ ఉండిపోయింది స్వీటీ.

"ఏంటమ్మా, అలా చూస్తూ నిలబడిపో

యావ్? ఇంతకీ మీ అమ్మ రాలేదేంటి? అవునూ, నేను మాట్లాడుతోంటే ఈ అందాల రబ్బరుబొమ్మకు అర్థమవుతుందా? " మనవరాలి వంక ఆపేక్షగా చూస్తూ రాఘవని అడిగింది.

"నాకు తెలుగు వచ్చు నాన్నమ్మా, అర్థమవుతుంది" నవ్వుతూ చెప్పింది స్వీటీ.

"మీరేం తింటారో, ఏంటో.. ఎప్పుడనగా తిన్నారో? " హడావుడిపడుతూ అంది.

ఆనందంతో కరచరణాలాడ్డంలేదు ఇంద్రాణికి.

"అమ్మా! నువ్వేం కంగారుపడకు. స్వీటీకీ చపాతీలు అలవాటు. ఏ పప్పు చేసినా ఇష్టంగా తింటుంది. కాస్త కారం తక్కువగా ఉండాలి. స్వీట్లంటే చాలా ఇష్టం" అన్నాడు రాఘవ.

"సరే, కుక్కర్ పెట్టి వస్తాను" అంటూ కదిలిందామె.

"నాన్నమ్మా! నేనూ హెల్ప్ చేస్తాను" అంటూ ఆమె వెనుకే వెళ్ళింది స్వీటీ.

ఆ మాటకెంతో ముచ్చటపడింది ఇంద్రాణి.

"నాతో కబుర్లు చెబుతూండు, చాలు" అంటూ ఆమె ఒక గిన్నెలో బియ్యం, మరో గిన్నెలో పప్పు కడిగి నీళ్లు పోసింది. మరో గిన్నెలో బంగాళాదుంపలుంచి అవన్నీ కుక్కర్‌లో పెట్టి స్టౌ వెలిగించింది. విజిల్స్ వచ్చేలోపున పోపుసామాను తీసి ఉల్లిపాయలు ముక్కలు చేసి పెట్టింది.

ఆమె ఎలా చేస్తోందో శ్రద్ధగా గమనించసాగింది స్వీటీ.

"అన్నట్లు అమ్మకి సెలవు దొరకలేదా, రాలేదేం? " అడిగింది ఇంద్రాణి.

"అవును నాన్నమ్మా" అంది స్వీటీ, తండ్రి చెప్పింది మననం చేసుకొంటూ.

'మేమిద్దరం విడిపోయామంటే మా అమ్మ బాధపడ్తుంది. నానమ్మకి అనుమానం కలగకుండా మాట్లాడు. వీలైనంత వరకు ఆ ప్రస్తావన కట్ చేస్తూండూ' అని ముందే రాఘవ చెప్పాడు.

"ఇప్పుడు దెబ్బలాడుకోకుండా ఉంటున్నారుగా" మళ్లీ అడిగింది ఇంద్రాణి.

"ఉంటున్నారుగానీ అదుగో విజిలొచ్చేసింది ఇప్పుడేం చేస్తావు? " టాపిక్ మారుస్తూ అడిగింది స్వీటీ.

"ఏముంది? ముందు కాస్త పోపు పెట్టి పప్పులో వేస్తాను. తర్వాత మరో బాణలిలో కాస్త నూనె వేసి ఉల్లిపాయ ముక్కలూ, అల్లం వెల్లుల్లి, పచ్చిమిర్చి, కరివేపాకు వేగాక, పొట్టు వలిచిన బంగాళదుంప ముక్కల్ని వేసి కాస్త మగ్గనిచ్చి పసుపు, కారం, ఉప్పు వేస్తాను. కూర రెడీ అవుతుందంతే" అందామె. ఆ తర్వాత కొన్ని అప్పడాలు, చల్లమిరపకాయలు వేయించింది.

"అన్నట్లు నీకు స్వీటంటే ఇష్టమన్నాడుగా" అంటూ క్షణాలమీద సేమ్యాపాయసం చేసింది ఇంద్రాణి.

అంత వయసులోనూ అన్ని పనులనూ చకచకా చేస్తోంటే ఆశ్చర్యపోయింది స్వీటీ.

నవ్వులు, కబుర్లతో అందరూ భోజనాలు ముగించారు.

"మా ఫ్రెండ్‌ని కలిసివస్తానమ్మా" అన్నాడు రాఘవ.

"నోట్లో మెతుకులు నోట్లో ఉండగా ఆ పరుగులేంట్రా? కాసేపు పడుకొని వెడుదుగానిలే" అందావిడ.

"వద్దువద్దంటున్నా కొసరికొసరి వడ్డించావ్. భుక్తాయాసంగా ఉంది. కాసేపలా తిరిగొస్తేనే అరిగేట్లుంది" అన్నాడు రాఘవ.

"మీరొచ్చారని స్పెషల్స్ ఏవీ చేయనే లేదు గదరా" అందామె మామిడిపళ్ల ముక్కలను అతని ముందుంచుతూ.

"అమ్మో! మళ్లీ ఇవా? సాయంత్రం తింటాలే" అంటూ సున్నితంగా తిరస్కరించి బయటకు కదిలాడు రాఘవ.

ఉయ్యాలబల్ల చూసి ముచ్చటపడుతూ

"నాన్నమ్మా! దీనిమీద ఎక్కొచ్చా?" అడిగింది స్వీటీ.

"పరాయిపిల్లలా అలా అడుగుతావేం? ఈ ఇల్లంతా నీది. మీ నాన్న దీన్నసలు వదిలేవాడే కాదు. ఎప్పుడూ ఎక్కి కూర్చునేవాడు. లేదూ అదుగో ఎదురుగా ఉన్న మామిడిచెట్లమీదా, జామచెట్లమీదా ఉండేవాడు. అందుకే ఆ చెట్లను చూస్తూ అవన్నీ గుర్తుచేసుకొంటూ ఉంటాను. ఎవరు కొట్టించమన్నా ఆ చెట్లని కొట్టించనిదందుకే" అంది ఇంద్రాణి కళ్లొత్తుకొంటూ.

ఆమె ప్రేమకు కదిలిపోయింది స్వీటీ.

అక్కడ వారం రోజులుండి, టాక్సీ ఏర్పాటుచేసుకొని నమ్రతావాళ్ల ఊరికి బయల్దేరారు ముగ్గురూ.

ఒకవైపు కాలువ, మరోపక్కన పొలాలు. చల్లగాలి ఒళ్లంతా నిమురుతూంటే కేరింతలు కొట్టింది స్వీటీ.

పేరు తెలియని ఎన్నో రకాల పక్షుల కుహూరావాలు, పిల్లగాలుల ఈలలు వారిలో ఉత్సాహాన్ని నింపాయి.

"గాలి ఈలలు వేసేనని / పూలు సైగలు చేసేనని / అది ఈరోజే తెలిసింది.. హూ..." అంటూ రాఘవ చిన్నగా పాడుకొంటూంటే, స్వీటీ వింతగా చూసింది.

"దొంగా! నీకు పాటలొచ్చా, మనింట్లో ఎప్పుడూ పాడలేదేం?" అంటూ తండ్రిని నిలదీసింది స్వీటీ.

"అలా పాడుకోవాలంటే, ఇలాంటి వాతావరణమెక్కడిది?" నవ్వాడు రాఘవ.

తమకు ఎదురొస్తున్న ఎడ్లబండిని చూస్తూ "డ్రైవర్, కారాపు" అన్నాడు రాఘవ.

"హాయ్, విశాల్! నన్ను గుర్తుపట్టావా?" కారు దిగుతూ అడిగాడు రాఘవ.

"ఎందుకు గుర్తుపట్టను? బాగున్నారా? మీ ఫోనందుకొన్న దగ్గర్నుండీ నమ్రత హడావుడికి అంతులేదు. మీకు ఎడ్లబండిమీద ప్రయాణమంటే సరదా అట కదా. మీ పాప గూడా ఆ ప్రయాణాన్ని ఎంజాయ్ చేయాలని నన్ను పంపిందిలా" నవ్వుతూ అన్నాడు విశాల్.

"అలాగా, నమ్రతకింకా నా ఇష్టాయిష్టాలు బాగానే గుర్తున్నాయే?" అన్నాడు రాఘవ.

"వారం రోజులుగా, మీ గురించే చెబుతోంది ఆవిడగారు.." అంటూ స్వీటీ వంక తిరిగి "ఏం పాపా? ఎడ్లబండి ఎక్కుతావా?" ఎంతకాలంగానో పరిచయమున్న వ్యక్తిలా నవ్వుతూ పలకరిస్తున్న విశాల్, తొలిచూపులోనే ఆత్మీయంగా కనిపించాడు ఆ క్షణంలో స్వీటీకి.

"స్వీటీ! నాన్నమ్మ ట్యాక్సీలో వెడుతుంది గానీ, మనిద్దరం ఎడ్లబండి ఎక్కుదాం. బండి ఎక్కి ఎన్నో ఏళ్లయిపోయింది" అన్నాడు రాఘవ.

"సరే" సంబరంగా అంది స్వీటీ.

బండి కుదుపులు ఇబ్బందిగా అన్పించినా, బాటకోవైపు పారుతున్న ఏటిని, మరో పక్కనున్న పొలాన్ని, ఆ పొలాలకి పహారా కాస్తున్నట్లుగా గట్టువెంట ఉన్న కొబ్బరిచెట్లను చూస్తూ పరవశించిపోయింది స్వీటీ.

"చిరుగాలికి తలలూపుతున్న పచ్చటి పైరును చూడు.. అవన్నీ వరిపొలాలు. ఆ

## కొత్తగాలి...

**చిన్నారి బడిపిల్లలు**
**మైదానంలో ఎగురుతూ**
**పావురాళ్లలా**
**గంటకొట్టగానే తరగతిగదిలో**
**గుదిగుచ్చిన పూల చెండులా!**

*– రాంభక్త పద్మావతి, విశాఖపట్నం*

ధాన్యపు కంకుల్లోంచే బియ్యం వస్తాయన్న మాట. ఆ నీళ్లలో కన్పిస్తున్నవేంటో తెలుసా? వాటిని నీటికోళ్లంటారు. ఈ పక్కనున్నవేమో బాతులు" అంటూ ఎంతో ఉత్సాహంగా స్వీటీకి, అన్నీ వివరిస్తున్న రాఘవని చూసి నవ్వుకొన్నాడు విశాల్.

గమ్యం చేరడంతో, చిన్న డాబా ఇంటి ముందు బండిని ఆపాడు. ఇంటిముందున్న పెద్దపెద్ద చెట్లనుండి రాలిన పుప్పొడి దట్టంగా పరుచుకొని, పసుపు తివాచీ పరిచినట్లు కన్పించింది.

"ధరణి పాదాలకు పారాణి, ఈ పూలపుప్పొడి" అని ఎక్కడో చదివింది గుర్తుకొచ్చింది రాఘవకి.

స్వీటీ బండిదిగి, ఒళ్లు విరుచుకొని, తలెత్తి చూసింది. ఇంటిముందు నాలుగు కర్రలు పాతి వేసిన తాటాకుల పందిరి కన్పించింది. ఎండావానల ఇబ్బంది కలక్కుండా వేసిన ఆ పందిరినిండా దట్టంగా పాకిన ఆనప, బీర, కాకరపాదులు, పుట్టింటికొచ్చి కబుర్లు చెప్పుకొంటున్న అక్కా చెల్లెళ్లలా కలిసిపోయాయి. ఆ పాదులకున్న పిందెలు, కాయలూ కనువిందు చేస్తున్నాయి, ఆడిపాడే పసిపిల్లల్లా.

గేటు తీసుకొని లోపలికి అడుగుపెట్టగానే బాటకిరువైపులా ఉన్న బంతి, చేమంతి, కనకాంబర మొక్కలు ఆకులు కన్పించకుండా పూలతో నిండి, నవ్వుతూ ఆహ్వానించే కన్నెపిల్లల్లా ఉన్నాయ్.

"అబ్బ! ఎంత బావుందో" అంది స్వీటీ.

"ఇవేనా? వెనుక పెరట్లో మరిన్ని అందాలున్నాయి. అవి గూడా చూద్దువుగాని" అన్నాడు విశాల్.

తన తల్లికి పక్షవాతం సోకినపుడు నమ్రతా విశాల్‌లు తమింట్లోనే ఉంచుకొన్నారు. అందుకే ఈ ఇల్లు, పెరడూ అన్నీ మధురజ్ఞాపకాలుగా మిగిలిపోయాయి రాఘవకి.

వారొచ్చిన అలికిడికి లోపల్నుండి గబగబా ఎదురొచ్చింది నమ్రత. వాళ్లకి ఎర్రనీళ్లతో, దిష్టి తీయించి, స్వీటీని దగ్గరకు తీసుకొంది.

"ఫొటోలో చూసిందానికన్నా పెద్దయ్యావే" అంటూ బుగ్గల్ని ఆప్యాయంగా నిమిరింది. తనివితీరక గుండెలకు హత్తుకొంది ప్రేమగా.

ఆమె వెచ్చని కౌగిలి పంచిన ఆత్మీయతకు స్వీటీ కళ్లు చెమర్చాయి. చిత్రంగా ఆ పిల్ల మనసులో, ఏ మూలనో ఉన్న కోపం ఎటో వెళ్లిపోయిందా చిరుచర్యతో.

"రా అత్తయ్యా, ప్రయాణం బాగా జరిగిందా? ఇప్పుడారోగ్యం బాగానే ఉంటోంది కదా" అంటూ ఇంద్రాణిని పలకరించింది.

తర్వాత రాఘవవైపు తిరిగి "ఏంటి బావా, ఇదివరకటికన్నా లావైపోయావు? డాక్టరైవుండీ.. స్వీటీ బాగా పొడవైపోయింది సుమా" నవ్వుతూ అంది నమ్రత.

లేత గులాబీరంగు చీరలో, నుదుట ఎర్రగా మెరుస్తున్న కుంకుమబొట్టుతో నమ్రత, స్వీటీ కళ్లకు అద్భుతంగా, పవిత్రంగా కనిపించింది. ఆమె తన నుదుట అల్లరిగా కదిలే ముంగురులను సవరించుకొంటూ మాట్లాడ్తోంటే కళ్లు విప్పార్చి చూడసాగింది స్వీటీ.

స్వీటీ కళ్లలో కదలాడుతున్న మెచ్చుకోలుని ఇట్టే పసిగట్టాడు రాఘవ. 'జూలీ ఎప్పుడూ మిడ్డీస్, టీషర్ట్స్ జీన్సుల్లో దాదాపు అర్ధనగ్నంగా ఉన్నట్లే కన్పించేది. అందుకే చీరకట్టులో నిండుగా ఉన్న నమ్రత అంతగా నచ్చుతోంది స్వీటీకి. మరి భారతీయ మూలాలు తనలోనూ ఉన్నాయిగా' అనుకొన్నాడు రాఘవ.

వాసూ ధాత్రీలు, స్తంభం చాటునుండి స్వీటీవంక వింతగా చూస్తోంటే, వారిని ముందుకు లాగి "ఈ అక్కకి, మీ ఫ్రెండ్స్‌ని పరిచయం చేయండి" అంది నమ్రత సరదాగా..

ఆ మాట వింటూనే వాళ్లిద్దరూ స్వీటీ

చేతులు పట్టుకొని పెరట్లోకి లాక్కెళ్లిపో యారు. పచ్చటి పెరడుని, షెడ్‌లో ఉన్న ఆవులు, మేకలని, మరోపక్క కేజ్‌లలో ఉన్న పావురాళ్ళు, కుందేళ్ళనీ చూస్తూ ముచ్చట పడింది స్వీటీ. ఏదో వండర్ ల్యాండ్ కొచ్చిన అనుభూతి కల్గిందామెకి. ఆ పిల్లలతో ఇట్టే కలిసిపోయింది. బుజ్జి బుజ్జి తెల్లటి కుందేళ్ల పిల్లల్ని చేతుల్లోకి తీసుకొని ముద్దాడింది స్వీటీ.

"ఇక ఆటపాటలు చాలు. కాళ్ళూచే తులూ కడుక్కొని రండి భోంచేద్దురు గాని" అంటూ నమ్రత నాలుగైదుసార్లు పిలిస్తే గానీ రాలేదు వాళ్ళు.

టమాటా పప్పు, కొత్తిమీర పచ్చడి, గుత్తొంకాయ కూరలతోబాటు పూరీలు, సగ్గుబియ్యం పాయసం చేసింది నమ్రత.

"ఇంత రుచికరమైన భోజనం నాల్రోజు లపాటు చేస్తే మరింత బొజ్జ రావటం ఖాయం" అన్నాడు రాఘవ తృప్తిగా తిని త్రేనుస్తూ.

"మావారికి రాలేదుగా? " అంది నమ్రత నవ్వుతూ.

"తల్లీ! మీ ఆయన కష్టజీవి కాబట్టి హరా యించుకోగలడు. నాకు ఈ తిన్నది అరగా లంటే కనీసం మూడునాల్గు మైళ్ళు నడవా ల్సిందే" అన్నాడు రాఘవ.

వాళ్ళొచ్చిందగ్గర్నుండీ ఖాళీగా కూర్చోవ లసి వచ్చిన విశాల్, వెంటనే "అలా నాతో బాటూ మా పొలానికి, రచ్చబండ దగ్గరకీ రండి, మా టీమ్‌ని పరిచయం చేస్తాను" అన్నాడు. దాంతో ఇద్దరూ కలిసి బయ టకు నడిచారు.

"మీ ఊరు చాలా బావుంది. ప్రతీ ఇంటి ముందు చెట్లు, పచ్చటి పెరడూ ఉంది. బాటకిరువైపులా చెట్లతో చల్లగా హాయిగా ఉంది" ప్రశంసగా అన్నాడు రాఘవ అన్నీ గమనిస్తూ.

"దీనిక్కారణం మా ముత్తాతలు,

# చతుర ప్రవేశిక

## సెప్టెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. రాహుల్ తల్లి అసలు పేరు?<br>జ. | 6. విశాల్ మరదలు?<br>జ. |
| 2. నమ్రత భర్త?<br>జ. | 7. సూర్యనారాయణ భార్య?<br>జ. |
| 3. రాఘవ కూతురు?<br>జ. | 8. రాధ పెంపుడు కూతురు?<br>జ. |
| 4. మిసిమి ప్రేమించింది?<br>జ. | 9. జేన్ మూల రచయిత?<br>జ. |
| 5. అపురూప భర్త?<br>జ. | 10. 'రేవు' రచయిత?<br>జ. |

పంపినవారి పేరు: ---------------------------------------వయసు (   )

చిరునామా: ---------------------------------------------------

-----------------------------పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

తాతలూ లేండి. అప్పట్లో వారికి సంతానం లేక బాధపడ్తుంటే ఎవరో స్వామీజీ చెప్పారట- ప్రతి ఇంట్లోనూ మొక్కలు పెంచాలని. దాంతో గొర్రెలిగా ముద్రపడినవారంతా మొక్కలు పెంచారట. అలాగే యాభై గజాల దూరానికో మొక్క నాటితే, అష్టైశ్వర్యాలూ సిద్ధిస్తాయని మరొకరంటే, మగవాళ్ళు ఆ పని చేశారట. మొత్తానికి మా ఊరు 'హరితవనం'లా మారింది. మా పూర్వీకుల జీన్సే ఉండటం వల్లనేమో నాకూ వ్యవసాయంపట్ల బాగా మక్కువ ఏర్పడింది.

ఇంత చదువుకొని ఇదేం పనంటూ నన్ను చాలా మంది వెక్కిరించారు. నవీన పద్ధతుల్లో చేస్తున్న వ్యవసాయం లాభసాటిగా మారటం చూసి వాళ్లు కూడా నాతో చేతులు కలిపారు.

సంవత్సరం పొడవునా వ్యవసాయపు పనులుండవుగా. అందుకే కోళ్ళు, కుందేళ్ళ పెంపకం మొదలెట్టించాను. ఔషధ మొక్కలకు ప్రాధాన్యం చాలా వుందని ఈమధ్య అవిగూడా పెంచుతున్నాం.

సమిష్టిగా వ్యవసాయం చేయడంలో ఉన్న లాభాలను గురించి చెప్పడంతో అంతా కలిశారు. వచ్చిన లాభాల్లో కొంత శాతం ఊరి సంక్షేమ కార్యకలాపాలకి ఖర్చు చేయాలని షరతు పెట్టాను. ఆ డబ్బుకి తోడుగా, పంచాయతీ శాంక్షన్ చేసిన డబ్బుని జతచేసి ఊరికి కావల్సిన వన్నీ ఒక్కొకటిగా అమర్చుకుంటున్నాంగానీ ఇంకా చేయాల్సినవి చాలా ఉన్నాయి" అన్నాడు విశాల్.

అతడి మాటల్లోని క్లారిటీ, చేతల్లోని సిన్సియారిటీని గమనించిన రాఘవలో ఎన్నో ఆలోచనలు కలిగాయి.

పొలాన్ని సమీపించాక చెట్ల నీడనున్న నులకమంచం మీద వాలిపోయాడు రాఘవ, నడక అలవాటు తప్పినందున.

## ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

**(పాఠకులకు నూటపదార్లు బహుమానం)**

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, పెద్దకథ, నవలావలోకనం ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ. 116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి!
మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ ఈ నెల 17.

– సంపాదకులు

*నిబంధనలు :* ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపిక కాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ex: 6658, 6532
e-mail: vipula.chatura@gmail.com

విశాల్ పొలంలో ఆ చివరిదాకా వెళ్ళి పనివాళ్లకేవో సూచనలిచ్చి వచ్చేసరికి రాఘవ నిద్రలోకి జారుకున్నాడు.

అతడు నిద్ర లేచేసరికి విశాల్ ఎవరితోనో మాట్లాడుతూ కన్పించాడు. ఆ వ్యక్తి భోరున ఏడుస్తున్నాడు. అతడిని ఓదార్చి పంపించాక ఏంటన్నట్లు అతని వంక చూశాడు రాఘవ.

"అతని కూతురికి బిడ్డ కడుపులో అడ్డం తిరిగి పట్నానికి తీసుకెళ్ళేలోపే చనిపోయింది. ప్చ్. డాక్టర్లెవరూ ఈ మారుమూల గ్రామాలకి రారు. ఈ చిన్న గవర్నమెంట్ హాస్పిటల్‌కి ఉద్యోగరీత్యా వచ్చిన వాళ్ళు దొరికిన లీవులన్నీ పెడుతూ పట్నాల్లోనే గడుపుతుంటారు. ఇలాంటి చావులెన్నో" అంటూ బాధపడ్డాడు విశాల్.

తేనెపట్టు మీద రాయి వేస్తే చెల్లాచెదురైన తేనెటీగల్లా ఎన్నెన్నో ఆలోచనలు రాఘవ మస్తిష్కంలో విజృంభించాయి.

ఆ మర్నాడందర్నీ కూర్చోబెట్టి తన మనసులోని మాట చెప్పాడు రాఘవ.

'విశాల్, తన టీమ్‌తో కల్సి చేస్తున్న పనులు గమనించాను. మీరంతా మీ అస్తిత్వాలకో అర్థం కల్పించుకొన్నారు. 'బతుకు, బతికించు' అనే మహత్తర సూత్రాన్ని అలవోకగా నిర్వహిస్తున్నారు. మీ చదువులను సార్థకం చేసుకుంటున్నారు. అందుకే నేనూ మీలో ఒకడిని కావాలనుకుంటున్నాను. ఒకసారి లండన్ వెళ్లి అక్కడి వ్యవహారాలన్నీ సెటిల్ చేసేసుకుని ఇక్కడో హాస్పిటల్ కట్టి, నా సేవలందించాలనుకుంటున్నాను" అన్నాడు సూటిగా.

ఆ మాటలకు అంతా సంతోషించారు.

ఆ మర్నాడే హైద్రాబాద్‌లో మిసిమి ప్రోగ్రాం ఉండటంతో అంతా బయల్దేరారు. మిసిమి కచేరి విజయవంతమైంది. ఆ విషయమే రాహుల్‌కి, ఫోన్ చేసి చెప్పింది వివరంగా.

అంతలో నమ్రత అక్కడికెళ్ళేసరికి టక్కున ఫోన్ పెట్టేసింది.

"ఏంటీ? ఏదో విశేషం ఉన్నట్లుంది?" అల్లరిగా అడిగిందామె మిసిమిని.

దాంతో లండన్ వెళ్ళినప్పుడు జరిగినవీ, రాహుల్ పట్ల పెంచుకున్న ప్రేమనీ చెప్పింది మిసిమి.

"మరికనేం? అమ్మానాన్నలతో చెబితే ఓ పనైపోయేదిగా" అంది నమ్రత.

వాళ్ళు సంబంధాలకోసం వాకబు చేస్తున్నది తెలుసామెకి.

"రాహుల్, నేనూ ఒకరికొకరం ఇంతవరకూ 'ఐలవ్ యూ' అని చెప్పుకొనేలేదు. అతడికి నేనంటే ఇష్టం ఉంది గానీ, తల్లిని వదిలి, ఇక్కడికి రాలేడు. అమ్మానాన్నలు నన్నంత దూరం పంపడానికి ఒప్పుకోరు. నేనూ వాళ్ళనొదిలి వెళ్ళలేను. ఇక ఈ సమస్య ఎలా సాల్వ్ అవుతుంది?" దిగులుగా అంది మిసిమి.

"అతడి తల్లిది ఇండియానే అంటున్నావ్‌గా, ఆమె కొడుకుతోబాటు ఇక్కడికొచ్చేస్తే సరిపోతుందిగా.. ఆమె వివరాలు తెలుసా?" సాలోచనగా అడిగింది నమ్రత.

"తెలీదక్కా, ఈసారి రాహుల్‌ని అడగాలి" అంది మిసిమి.

"ఇలాంటి విషయాలని నాన్చకూడదు. రాహుల్‌కి నీ మనసులో మాట చెప్పి తను నీకోసం ఇండియా రాగలడో లేదో తెల్సుకో" అంది నమ్రత.

★ ★ ★

ఆరోజు రాహుల్‌కి ఫోన్ చేసి "రాహుల్, అమ్మానాన్నలు నాకు సంబంధాలు చూస్తున్నారు. నీ మనసులో ఏముందో నువ్వు చెప్పవు. ఎన్ని సంబంధాలకని వంకలు పెట్టను?" అని ఆవేదనగా అడిగింది మిసిమి.

"ఏం చెప్పమంటావు? అక్కడికీ అమ్మతో చెప్పాను. 'నేనైతే ఇండియాకి రాలేను, నువ్వు మిసిమిని పెళ్ళి చేసుకొని అక్కడ స్థిరపడతానంటే అది నీ ఇష్టం'

అంది. కానీ ఈ వయసులో అమ్మని ఒంటరిగా వదిలి ఎలా వచ్చేయను? నాకోసం అమ్మ ఎన్నెన్ని బాధలు పడిందో నాకే తెలుసు" వేదనగా అన్నాడతను.

"రాహుల్! మీ మూలాలు భారతదేశంలోనే ఉన్నాయిగా. భారతీయుడవైన నువ్వు నీ సేవలను పరాయి దేశానికి ధార పోస్తున్నావ్. మీరిద్దరూ ఇక్కడికొచ్చేస్తే బాగుంటుంది కదా! మీ నాన్నగారు ఇండియాలోనే ఉన్నారని చెప్పావుగా.. మీ పేరెంట్స్‌ని కలిపే ప్రయత్నమూ చేయొచ్చు. ఏమంటావ్? " ఆశగా అడిగింది.

"నిజమే. ఇవాళే అమ్మతో మాట్లాడతాను" ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా అన్నాడు రాహుల్. అన్నట్లే ఆ రాత్రి విషయం కదిపాడు.

"అమ్మా, మిసిమిలాంటి అమ్మాయి నన్ను ఇష్టపడుతోందంటే నేనెంతో అదృష్టవంతుడిని గదూ. కానీ ఆ అదృష్టం నాకు దక్కాలంటే మనం ఇండియాకు వెళ్ళాలి. అక్కడే ఉండిపోవాలి.. మరి ఏమంటావమ్మా? " అడిగాడు ఎంతో ఆశగా.

రోజీ ఏమీ మాట్లాడలేక లోపలికి వెళ్ళిపోయింది.

రాహుల్ మనసేంటో ఆమెకి బాగా అర్థమైంది. తనని వదిలి వెళ్ళలేక, మిసిమి దూరమవుతుందన్న భయంచేత పిచ్చివాడిలా మారిపోతున్నాడనుకోగానే ఆమెలో దుఃఖం సుళ్ళు తిరిగింది.

ఇక్కడి పిల్లలు సెంటిమెంట్స్‌కి విలువీయరు. టీనేజ్ వచ్చిన దగ్గర్నుండీ ఎవరి బతుకులు వాళ్ళు బతుకుతుంటారు. కానీ రాహుల్ అలా కాదు, ఇంకా తనకోసమే ఆలోచిస్తున్నాడు.

ఒకప్పుడు తను తన స్వార్థం చూసుకొని ఇల్లొదిలి వచ్చేసి భర్తకూ కన్న తల్లిదండ్రులకు ద్రోహం చేసింది.

ఇప్పుడు కూడా తన స్వార్థంకోసం కొడుకునిక్కడే కట్టిపారేస్తే ఎలా? కొడుకు మనసేంటో తెలిసీ మౌనం వహిస్తే ఎలా? ఈ ఆలోచనలతో ఆ రాత్రి నిద్రకు దూరమైంది రోజీ. గతమంతా కళ్ళ ముందు తిరిగింది.




గోవిందరావు, వర్ధనమ్మల పెళ్ళయిన ఏడేళ్ళకు పుట్టింది అపురూప. దాంతో ఆమె ఆడింది ఆటగా, పాడింది పాటగా పెరిగింది.

ఆమె అందం చూసి, ఎదురు కట్నమిచ్చి మరీ పెళ్ళాడాడు ఆ ఊరి జమిందారైన రాజారామ్మోహనరావు. ఆదిత్యాపురంలో తిరుగులేని మహారాజతను.

తనకన్నా వయసులో పదేళ్ళు పెద్దయిన అతడిని పెళ్ళాడటానికి అపురూప ఒప్పుకోలేదు. కానీ తల్లితండ్రుల బలవంతం వల్ల పెళ్ళాడకతప్పలేదు. ముఖ్యంగా తల్లి ఎంతో నచ్చజెప్పడంవల్ల తలొంచింది.

"మా అమ్ములు ఎంతో అదృష్టవంతురాలు" అంటూ మురిసిపోయింది వర్ధనమ్మ. కూతుర్ని వదిలి వుండలేక, తరచూ చూడటానికి వెళ్ళి, నాలుగైదు రోజులుండి వచ్చేదామె.

ఆ దివాణంలో రాజారామ్మోహనరావు తల్లిదండ్రుల పెత్తనం సాగడం వర్ధనమ్మకి కంటగింపుగా వుండేది. దాంతో వారిమీద ఏదో ఒకటి కూతురికి చెబుతూ మనసుని విరిచే ప్రయత్నం చేసేది.

అలాంటివి గమనించినప్పుడల్లా "కూ

తురి కాపురంలో నిప్పులు పోయొద్దు" అనే వాడు గోవిందరావు.

తల్లి చెప్పుడు మాటలతో అత్తమామల పట్ల తేలికభావం ఏర్పడ్డ అపురూప, వారి నెదురించేది. అది కొడుక్కి తెలిస్తే, వారి కాపురంలో కలతలొస్తాయని మౌనం వహించేవారు వృద్ధ దంపతులైన పరంధామయ్య, సీతమ్మలు.

ఇంతలోనే అపురూప స్నేహితురాలైన రంజని, ఆమెభర్త మదన్ ఆ ఊరికి రావటం, అపురూప గురించి తెలుసుకోవటం జరిగాయి.

"నా ఫ్రెండ్‌కి తను అందగత్తెనన్న అహం ఎక్కువ సినిమాలంటే పిచ్చి, హీరోయిన్నైపోవాలని తెగ కలలు కనేది" అని రంజని, మదన్‌కి చెప్పగానే, అతడు అపురూపనెలాగయినా లొంగదీసుకుంటే తాము అందలాలెక్కవచ్చని పథకాలు వేయసాగారు. అపురూప ఇంటికి రాకపోకలని అధికం చేశారు.

మొదటి చూపులోనే వాళ్లమీద సదభిప్రాయం కలగని పరంధామయ్య కొడుకుని పిలిచి హెచ్చరించాడు. కానీ అపురూపని ఎంతో అపురూపంగా చూసుకునే రాజారామ్మోహన్, భార్య మనసుకి కష్టం కల్గించలేక మౌనం వహించాడు. అదే తన కొంప ముంచుతుందని అతడికా క్షణం తెలీలేదు.

"మీలాంటి అందాలరాశి, ఇలా పల్లెటూరిలో మగ్గిపోవడం ఏం బాలేదు. నూతిలోని కప్పకూ, మీకూ తేడాలేదు. మీరే గనుక ఇక్కడినుండి బయటపడితే, మీకోసం క్యూలో నిలబడి నిర్మాతలు, హీరోయిన్‌గా బుక్ చేసుకోవటం ఖాయం" అంటూ రంజనీ, మదన్‌లు వీలున్నప్పుడల్లా చెప్పడంతో, అపురూపలో తనెంతో కోల్పోతున్నానన్న భావం ఏర్పడింది.

కానీ అప్పుడే తను గర్భవతినని తెలిసి హతాశురాలైంది అపురూప. రంజనీ, మదన్‌లు చెప్పినట్లు అక్కడికీ అబార్షన్ చేయించుకొంటానని పేచీ పెట్టిందిగానీ మొదటిసారిగా రాజారామ్మోహన్ ఆమె మాటను వ్యతిరేకించడంతో రాహుల్‌కి జన్మనివ్వక తప్పలేదు.

రాహుల్ పుట్టుకతో దివాణంలో గొప్ప సంతోషకర వాతావరణం నెలకొంది. రాహుల్‌కి పాలివ్వడం మాత్రమే అపురూప చేసేది. మిగిలినవన్నీ పరంధామయ్య, సీతమ్మగార్లే ఎంతో అపురూపంగా చేసేవాళ్ళు. రాహుల్‌ని రాజకుమారుడిలా చూసుకునేవారంతా.

కొడుకు బాధ్యతంతా వారికప్పజెప్పి, రంజనీ మదన్‌లతో కలిసి డాన్స్ ప్రోగ్రామ్‌లు, సినిమాలు, సినిమా ఫంక్షన్స్ అంటూ అపురూప తిరగడం రాజారామ్మోహన్‌కి నచ్చకపోయినా, ఆమె ఇష్టానికే పెద్దపీటవేసేవాడు.

తల్లితండ్రులేమైనా చెప్పబోయినా "అపురూపలో ఇంకా చిన్నతనం పోలేదు. పదిహేనేళ్ళకే పెళ్ళి, పదిహేడేళ్ళకే తల్లి అయింది కాబట్టిగానీ తన తోటివారంతా కాలేజీల్లో చదువుతూ ఎంజాయ్ చేస్తున్నారు. అపురూపక్కూడా అలా సరదాగా గడపాలని వుంటుందిగదా.. ఇక డబ్బు ఖర్చంటారా? మూడుతరాలు కూర్చుని తిన్నా తరగని సంపదవుంది. తన సంతోషానికి ఉపయోగపడని డబ్బు ఎందుకట? బంగారంలాంటి మనవడినిచ్చిందిగా, వాడితో గడపండి హాయిగా" అంటూ ఆమెని వెనకేసుకొచ్చేవాడు. అపురూప బాధపడితే తట్టుకోలేని బలహీనత అతనిది. ఆరోజు పనివాళ్ళెవరూ రాకపోవడంతో ఎనిమిదైనా లేవని అపురూపను లేపక తప్పలేదు సీతమ్మకి.

"అమ్మలూ, నాకు ఒంట్లో బాగోలేదు. పైగా రాహుల్‌కి జ్వరం మూలంగా రాత్రంతా నిద్రలేదు. కాస్తలేచి, కళ్ళాపి జల్లి ముగ్గు వేయమ్మా. ముగ్గులేని ముంగిట్లోంచి మగవాళ్ళు బయటకు వెళ్ళకూడదం

## కొత్తగాలి...

**చిన్ననేరం చేసినవాడు**
**సిగ్గుతో తలవంచుకుంటున్నాడు**
**పెద్దనేరం చేసినవాడు**
**దండలేసుకు ఊరేగుతున్నాడు!**

– వాడా మునిశేఖర్‌రెడ్డి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా

టారు" అంది మెల్లగానే.

"ఏంటీ! లేచి ఆ పేడని కళ్ళాపిగా చల్లాలా? పేడని ముట్టుకోవడమంటేనే నాకసహ్యమని ఎన్నిసార్లు చెప్పాలి? ఇంత కుముందోసారి గోమాత పూజకంటూ ఆ గోశాలని, గోవుల్ని కడిగించారు. నాల్రో జులు జ్వారానపడ్డాను. మీకు ఓపికుంటే ముగ్గులేసుకోండి, లేకుంటే ఓ మూలనుం డండి. అంతేగానీ నాకీ వెధవ పనులు అంటగట్టొద్దు" అంది అపురూప.

అది విన్న పరంధామయ్యగారికి ఒళ్ళు మండి "వెధవ పనులేంటమ్మా? ఆ వ్యవ సాయం, పాడిపనులవల్లే మనకింత డబ్బు వస్తోంది. డబ్బుని నీళ్ళలా ఖర్చుచేయగల్గు తున్నావంటే దానిక్కారణం అవే. వాటిని తేలికచేసి మాట్లాడకు" అన్నారు గట్టిగా.

దాంతో అలకపాన్పెక్కింది అపురూప.

అటు తల్లిదండ్రులకు, ఇటు భార్యకీ నచ్చజెప్పలేక ఎప్పట్లాగే మౌనం వహిం చాడు రాజారామ్మోహన్.

★ ★ ★

తమ బంధువులింట్లో పెళ్ళికి తప్పనిస రిగా అంటెండ్ కావల్సొచ్చింది పరంధామ య్య, సీతమ్మగార్లకి. అపురూప రానని చె ప్పడంతో, బలవంతం చేయలేకపోయారు.

రెండ్రోజులుగా జలుబూ జ్వరంతో ఉన్న రాహుల్‌ని తమ వెంట తీసుకెళ్ళలేక, అపురూప దగ్గరే వదిలి, ఎన్నో జాగ్రత్తలు చెప్పి కదిలారా వృద్ధ దంపతులు. డ్రైవర్ లీవులో ఉండటంతో రాజారామ్మోహన్‌కి, వారివెంట వెళ్ళకతప్పలేదు.

వాళ్ళటు కదలగానే వచ్చేశారు రంజనీ, మదన్‌లు. దొరకక దొరకక, దొరికిన అవ కాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని ప్లాన్ చేశారు.

"అపురూపగారూ! ఈ క్షణం గనుక మీరు మాతో వచ్చేస్తే, మీరు హీరోయిన్ అవడం ఖాయం. మీవాళ్ళెవరూ ఇంట్లో లేరు. ఇలాంటి అవకాశం మళ్ళీ రాదు" అన్నారు.

అప్పటికే సంసార ఊబిలో చిక్కుకుపో యాననుకున్న అపురూప, మరేదీ ఆలోచిం చలేదు. 'తన ఇష్టాలను రాజారామ్మోహన్ అభ్యంతరపెట్టడు. తను హీరోయిన్ అయితే, అతడూ సంతోషిస్తాడు' అను కొంది నమ్మకంగా.

వాళ్ళు అపురూప బట్టలతోబాటు నగలు, వెండిసామాను, డబ్బా మూటగడుతోంటే, "అవన్నీ ఎందుకు? ఇవి తీసుకుంటే వాళ్ళ సాయం తీసుకున్నట్లేగా? " అంది ఆమె అమాయకంగా.

"మనమెళ్ళి ఏ చెట్టుకిందో ఉండలేంగా. హైద్రాబాద్‌లో నిలదొక్కుకోవాలంటే డబ్బు అవసరం అవుతుందికదా! అంతగా అయితే మీరు హీరోయిన్నై సంపాదించిన డబ్బులోంచి ఇంతకు రెట్టింపు వారికి తిరిగి ఇచ్చేయొచ్చు" అంటూ నచ్చజెప్పాడు మదన్. దాంతో మరి మాట్లాడలేకపో యింది అపురూప.

వాళ్ళు కావల్సినవన్నీ సర్దుతూంటే, లోప లికెళ్ళి రాహుల్‌ని భుజాన వేసుకుని వచ్చింది అపురూప. అది చూసి గతుక్కు మన్న రంజనీ, మదన్‌లు అప్పుడభ్యం తరం చెబితే, మొదటికే మోసం వస్తుంద నుకున్నారు.

వాళ్ళు తెచ్చిన టాక్సీలో రాహుల్‌తో భయంగానే కాలుమోపింది అపురూప.

దూరమవుతోన్న తమ భవంతిని చూస్తోంటే, ఆమె మనసులో ఏ మూలనో కలుక్కుమందిగానీ 'పేరుప్రఖ్యాతులతో మళ్ళీ తిరిగొస్తానుగా' అని తనకితానే ధైర్యం చెప్పుకొంది.

హైద్రాబాద్‌లో ఒక మామూలు లాడ్జ్‌లో దిగారు. చలిగాలికి జలుబు ఎక్కువై, బ్రీతింగ్ ప్రాబ్లం మొదలైంది రాహుల్‌కి. వాడినోదార్చలేక సతమత మైంది అపురూప. అలవాటులేని పని కావడంవల్ల కాసేపటికే అలుపూ, ఆ వెంట విసుగూ వచ్చేశాయి.

"డాక్టర్ దగ్గరికి తీసుకువెడదాం, మందు పడితేగానీ తగ్గేట్టులేదు" అంది అపురూప.

"ఈ టైమ్‌లో వెహికల్ దొరకడంకష్టం" అని విసుక్కొంటూనే ఆటో కోసం వెళ్ళాడు మదన్.

హతాశురాలై చూసింది అపురూప.

అది గమనించిన రంజని "ప్రయాణపు బడలికవల్ల అలా అన్నాడు" అంటూ నచ్చ జెప్పింది. డాక్టరిచ్చిన మందులు వేసినా జ్వరం తగ్గకపోగా ఎక్కువైంది. మర్నాటికి గూడా రాహుల్‌కి జ్వరం తగ్గలేదు. ఎప్పుడూ తననెత్తుకొని, లాలించేవారి ముఖాలు కన్పించక బెంగ ఎక్కువై ఏడ్పు అందుకొన్నాడు రాహుల్.

"అబ్బ! నిద్ర లేకుండా అవుతోంది ఏడ్పుతో" అని విసుక్కున్నాడు మదన్, బాహాటంగానే.

"ఏం చేస్తాం? భరించక తప్పదు. ఒక్కతీ వస్తుందనుకొంటే వెంట వీడిని తీసుకొచ్చింది" అంటోంది రంజని, చిరాగ్గా.

ఆ మాటలు వినేసరికి అపురూపకి ఏడ్పు ముంచుకొచ్చింది.

మర్నాడు ముభావంగా ఉన్న అపురూ పని చూస్తూ "ఇలా వీడితోనే ఉంటే ఏ ప్రయత్నమైనా ఎలా చేస్తాం? ఇవన్నీ ఊహించే వద్దన్నాం తప్ప, ఈ పసివా డంటే ఇష్టంలేక కాదు. వీడిని ఏ క్రచ్‌లో నైనా వేస్తేనే, మనమెక్కడికైనా వెళ్ళే

## కొత్తగాలి...

**మీరు శాంతికాముకులైతే చెవుల్నీ కళ్లనీ ఉపయోగించండి! నోటిని మాత్రం అదుపులో ఉంచండి!**

– జఫరుల్లాఖాన్,
మహబూబ్‌నగర్

వీలుంటుంది. అంటూ నచ్చజెప్పేసరికి, ఆ పని చేయక తప్పలేదు.

నలుగురైదుగుర్ని కలిసి మాట్లాడారు. వాళ్ళంతా తనవంక ఆబగా చూడటం కంపరం కల్గించింది అపురూపకి.

"వాళ్ళేంటి అదోలా మాట్లాడుతున్నారు? మాటల్లో సభ్యత లేదు. చూపుల్లో గౌరవం లేదు" అంది చిరాగ్గా, మదన్‌తో.

"ఒకప్పుడు అందంగా ఉన్నారుగానీ మేమెంత వద్దని చెప్పినా బిడ్డను కన్నారు కదా! బిడ్డతల్లి అంటే ఎవరిష్టపడ్తారు? అయినా ఒకటి పొందాలనుకొంటే, మరొ కటి కోల్పోక తప్పదు, మడి గట్టుక్కూ చుంటే సాగదు" అన్నాడు మదన్.

"అంటే? " భయంగా, అయోమయంగా చూస్తూ అడిగింది అపురూప.

'శీలాన్ని పట్టించుకోవద్దని' సుతిమెత్తగా, సూటిగా చెప్పింది రంజని .

"ముందే ఈ విషయాలన్నీ చెప్పలేదేం? " కోపంగా అడిగింది అపురూప.

"మరీ అమాయకంగా మాట్లాడకు. ఎన్ని సినిమాల్లో, మరెన్ని టీవీ సీరియ ల్స్‌లో చూపించలేదని? నీకవన్నీ తెలిసే అభ్యంతరం చెప్పలేదు అనుకొన్నాం" అందామె, తమ తప్పు ఏదీ లేదన్నట్లు.

నిర్ఘాంతపోయింది అపురూప. కాళ్ళ కింద నేల కదిలినట్లు అన్పించింది. మొద



టిసారిగా తను ఇంట్లోంచి ఇలా వచ్చే యటం తప్పనిపించింది. 'తిరిగి ఇంటికెళ్ళి, భర్తను క్షమించమంటే, క్షమిస్తాడని' అను కొన్నాక గానీ నిద్రపట్టలేదు.

అర్ధరాత్రి బాగా దాహంగా అన్పించి లేచింది అపురూప. మంచంమీద రంజనీ, మదన్‌లు కన్పించకపోయేసరికి, తలుపువ రకూ వెళ్ళి తొంగి చూసింది.

బాల్కనీలో మాట్లాడుకొంటున్న వారి మాటలను బట్టి 'తనకి అవకాశాలు రాని పక్షంలో తననీ, పిల్లవాడినీ ఎంతో కొంతకి అమ్మేయాలని, నిశ్చయించుకున్నట్లు తెలిసి, గుండె ఆగినంతపనైంది. అత్తమామలు వీళ్ళగురించి ఎంత హెచ్చరించినా, తను పెడచెవిన పెట్టడం గుర్తొచ్చి, ఎంతో బాధ కల్గిందామెకు.

మర్నాడు వాళ్ళు 'బయటకు వెడదాం, రమ్మని' పిలిచినప్పుడు, 'రాత్రంతా నిద్ర లేదు, మీరెళ్ళిరండి' అంటూ వాళ్ళని పంపించేసింది. వాళ్ళు కదలగానే, రాహుల్‌ని తీసుకొని ఆ హోటల్ కమ్ లాడ్జ నుండి బయటకొచ్చేసింది. దారిలో మెడలో వున్న నెక్లెస్ తీసి అమ్మేసి ఆ డబ్బుతో స్టేషన్‌కి దారితీసింది. అక్కడ ఏ రైలె



క్కాలో అర్థంగాక, మళ్ళీ బస్‌డిపోకొచ్చింది.

అక్కడెవరో మాట్లాడుకుంటున్నారు- 'ప్రేమించినవ్యక్తి కోసం ఇల్లొదిలి వెళ్ళిందో అమ్మాయి. వాడు మోజు తీర్చుకొని వది లేసిపోతే ఆత్మహత్య చేసుకోబోయింది. ఎవరో చూసి హాస్పిటల్లో చేర్చారు. ఇంత అవమానం జరిగింది, పరువు పోయిందని ఆ పిల్ల తల్లితండ్రులు ఆత్మహత్య చేసుకున్నారు..' అదీ సారాంశం. ఆ మాటలు వినగానే అపురూప మళ్ళీ భయపడింది.

'ఈపాటికే తనవాళ్ళు ఏ అఘాయిత్యమైనా చేసుకొని వుంటారా?' అని వగచింది. అలా జరిగితే, ఊళ్ళోవాళ్ళు తనని రాళ్ళతో కొట్టి చంపినా ఆశ్చర్యం లేదు' అనుకొంది.

దూరంగా వెదుకుతూ వస్తోన్న రంజనీ, మదన్‌లు కన్పించగానే మరో ఆలోచన లేకుండా, కదుల్తోన్న బస్ ఎక్కేసింది.

చేతిలో పసివాడు, ఓ చిన్నబ్యాగ్ తప్ప మరో లగేజ్ లేని అపురూప వంక సాలోచనగా చూసిన డెబ్భై ఏళ్ళ వ్యక్తి "ఎక్కడికెళ్ళాలమ్మా?" అంటూ వచ్చీరాని తెలుగులో అడిగాడు.

బదులు చెప్పలేదు అపురూప.

## కొత్తగాలి...

**అంబులెన్సుకి దారివ్వని అహంకారి మగడు ఆలి అభ్యున్నతిని హర్షించగలడా?**

– కుంటముక్కుల సత్యవాణి,
కాకినాడ

"ఇలా కూర్చోమ్మా" అంటూ ఆమె చేతిలోని బిడ్డను అందుకొని, మంచినీళ్ళ బాటిల్ అందించాడు. అతని పక్క సీట్లో కూర్చొని, నీళ్ళు తాగేసరికి, ప్రాణం కాస్త కుదుటపడినట్లైంది అపురూపకి.

"ఎవరూ లేరా? " అంటూ అతడు ఆప్యాయంగా అడిగేసరికి, ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. లాలనగా, ఆమె కథనంతా తెలుసుకొన్నాడాయన.

"సరే నాతోబాటు ముంబయ్‌కి వచ్చేయమ్మా. నా భార్య మంచం పట్టింది. మా ఇద్దరినీ కనిపెట్టుకొని వుండే మనిషి కోసం వెదుకుతున్నాం. పనిమనిషి, వంట మనిషి ఉన్నా, అనుక్షణం మాకు తోడుండి మమ్మల్ని చూసుకొనే మనిషి కావాలనుకొంటున్నాం. నువ్వలా వుండగలనంటే, నిన్నూ నీ బిడ్డనూ ఏ లోటూ రాకుండా చూసుకొంటాం" అన్నాడు.

అతని మాటల్లోని నిజాయితీ గమనించిన అపురూప, భగవంతుడిమీద భారం వేసి, తన అంగీకారాన్ని తెల్పింది.

అతని పేరు జాన్‌అబ్రహాం అని, భార్య పేరు గ్రేసీ అని తెలిసింది. ఆ దంపతులు, అపురూపని బాగా ఆదరించారు. రాహుల్‌ని మనవడిలాగే అభిమానించడంతో, అపురూప వారికి భక్తిశ్రద్ధలతో సేవలు చేయసాగింది.

వారిద్దరూ అపురూపకి హిందీ, మరాఠీ భాషలతో బాటు ఇంగ్లీష్ నేర్పించారు. బజారు పనులవీ చక్కబెట్టే విధానం రెండేళ్ళలో బాగానే నేర్చుకొంది అపురూప.

ఆ దంపతుల ఒక్కగానొక్క కొడుకు లండన్‌లో వుంటున్నాడని అతడు వీరిద్దర్నీ తమ దగ్గరకు రమ్మంటున్నాడని తెలిసింది. 'మీరిద్దరూ లండన్ వెళ్ళిపోతే, నా పరిస్థితి ఏంటి? ' అని దిగులుగా అడిగిందో రోజు.

"మాకక్కడ నీలాంటివాళ్ళు దొరకకనే, వెళ్ళినపుడల్లా ఏదో కొన్ని రోజులుండి, వచ్చేసేవాళ్ళం. నువ్వూ మాతోబాటు వస్తానంటే మా అబ్బాయికి చెబుతాం, నీ పుణ్యమాని, మా చివరిరోజుల్లో, కొడుకూకోడలూ మనవలతో గడిపే అదృష్టం దక్కుతుంది.. మరి పాస్‌పోర్టదీ తీసుకోమంటావా? " అని జాన్ అడగ్గానే, ఆలోచించింది అపురూప.

అంతకు ముందొకసారి, మార్కెట్‌కి వెళ్ళినపుడు జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది- తను కూరగాయలు కొంటుంటే "నువ్వు పరంధామయ్యగారి కోడలివి గదూ" అంటూ భుజం తట్టి అడిగిందో వృద్ధురాలు. ఆమెని చూసిన గుర్తయితే వుంది గానీ పేరు గుర్తుకురాలేదు.

"ఏంటీ? మీ ఆయనేదో అంటే మాత్రం ఇలా పసివాడిని తీసుకొని పారిపోయి, ఇంతదూరం వచ్చావా? మగాడు ఆయనకేం? మరోదాన్ని కట్టుకొన్నాడు, రేపో మాపో తండ్రి కాబోతున్నాడు" అంటూ ఇంకా ఏదేదో చెబుతూంటే, వినలేక వచ్చేసింది అపురూప.

'తనభర్త మరో స్త్రీ వల్లనైనా సుఖంగా ఉన్నాడు, అదిచాలు' అనుకొంది, తను అతనికి చేసిన ద్రోహం పుండులా సలుపుతూంటే.. జాన్‌ద్వారా రాహుల్‌ని తన భర్తకి అప్పజెప్పాలకొన్న అపురూప, ఇక ఆ ప్రయత్నాన్ని విరమించుకొంది, తన కొడుకు, సవతితల్లి బారినపడి కష్టపడటం

ఎందుకని?

ఆ క్షణమే గట్టిగా నిర్ణయించుకొంది ఇక నుండి రాహుల్‌కి తల్లీతండ్రి తానేనని. జాన్‌తో లండన్ వస్తానని చెప్పింది.

జాన్ దంపతులతో లండన్‌లో కాలుపె ట్టినప్పుడు, దేశంగాని దేశం వచ్చానని భయంగా ఉన్నప్పటికీ, తనకి తనే ధైర్యం చెప్పుకొంది.

జాన్ కొడుకు విక్టర్ తమని అభిమానిం చినా, అతని భార్య ఎలీజా అంత కలివి డైన మనిషి కాదు. పైగా తనవంక అను మానంగా చూడటం కష్టం కలిగించసా గింది అపురూపకి.

జాన్ అన్న కొడుకైన రాబర్ట్, జాన్, గ్రేసీలను చూడటానికి తరచూ రాసా గాడు. అపురూపకి డాన్స్ వచ్చని, ఆమెకు డాన్స్ ప్రోగ్రామ్‌లేమైనా ఏర్పాటుచేస్తే బాగుంటుందని జాన్ చెప్పటంవల్ల, అతడా ప్రయత్నాలు చేయసాగాడు. అందులో భాగంగా వారిద్దరిమధ్యా పరిచయం పెర గసాగింది. అపురూప మొదటిసారిగా ఇచ్చిన డాన్స్ ప్రోగ్రాం విజయవంతం కావటం అందరికీ సంతోషాన్ని కల్గించినా, అపురూప అందంపట్ల ఈర్ష్య వున్న ఎలీ జాకి రుచించలేదు. ఏదో వంకన అపురూ పని మాటలతో బాధించేది అవన్నీ జాన్‌కి చెబితే వాళ్ళమధ్య గొడవలొస్తాయని మన సులోనే బాధపడేది అపురూప. మరీ భరించలేనప్పుడు మాత్రం రాబర్ట్‌తో చెప్పు కొని బాధపడేది.

ఒకరోజు షికారుకని బయల్దేరిన జాన్, గ్రేసీలు రోడ్ ఆక్సిడెంట్‌లో ఒకేసారి మర ణించేసరికి నిర్ఘాంతపోయింది అపురూప.

'ఇక మాకు నీ అవసరం లేదం'టూ ఎలీజా బయటకు పొమ్మనేసరికి, కరచర ణాలాడలేదు ఆమెకి. లండన్ వీధుల్లో బిక్కుబిక్కుమంటూ నిలబడవలిసి వచ్చిం ది అపురూపకి. అప్పుడు రాబర్ట్ ఆమెకు అండగా నిలిచాడు.

రోజ్‌మేరీగా ఆమె పేరు మార్చి సేల్స్ గర్ల్‌గా ఉపాధి కల్పించాడు. అంతేగాక డాన్స్ ప్రోగ్రామ్‌లు ఏర్పాటుచేసి తద్వారా మరింత ఆదాయం వచ్చేలా చేశాడు.

ఈ ప్రక్రియలో తోడేళ్ళలా కబళించ బోయే ఎందర్నుండో రక్షణ కల్పించిన అతనంటే గౌరవం, అభిమానం మొదల య్యాయి అపురూపలో. ఎక్కడున్నా ఆడ దానికో మగతోడు లేకపోతే జీవితం దుర్భ రమే అనుకొంటూ, అతనితో జీవితం పంచుకొంది.

మెల్లగా గార్మెంట్స్ బిజినెస్ మొదలె ట్టింది రోజీ. ఆ వ్యాపారం అభివృద్ధి చెందటం, డాన్స్ ప్రోగ్రామ్స్ వల్ల ఆదాయం పెరగడంతో, ఆర్థిక సమస్యలనేవి లేవు. కానీ రాబర్ట్‌కి దుర్వ్యసనాలు పెరగడం రోజీని బాధించసాగింది. అతను డబ్బును విచ్చలవిడిగా ఖర్చు చేయటం, ఆ డబ్బు కోసం రోజీని వేధించటంతో క్రమంగా కల తలు మొదలయ్యాయి.

ఒకసారి రాహుల్‌తో పిక్నిక్‌కి వెళ్ళింది. అక్కడ కలిసిన ఓ వ్యక్తి అపురూపని చూ స్తూ "మీరు మిసెస్ రాజారామ్మోహన్ క దూ?" అని పలకరించేసరికి ఉలిక్కిప డింది.

"మిమ్మల్నిక్కడ చూడటం ఆశ్చర్యంగా ఉంది. మీరు చనిపోయారని అనుకొంటు న్నారు కొందరు. మరికొందరేమో మీ ఆయన వెళ్ళగొట్టాడని, అందుకే పిల్లవా డితో సహా ఆత్మహత్య చేసుకొన్నారన్నారు. కొందరేమో లక్ష్మీదేవిలాంటి భార్యను వెళ్ళ గొట్టి రెండో పెళ్ళి చేసుకొన్నాడని మీ ఆయన్నే దుయ్యబడుతున్నారు" అంటూ ఇంకా ఏదేదో చెప్పబోతుంటే వినలేక రాహుల్‌ని తీసుకొని వచ్చేసింది.

రాహుల్‌ని మంచి వ్యక్తిగా తీర్చిదిద్దాల న్నదే లక్ష్యంగా పెట్టుకొందప్పటినుండి. కొడుకులా గాక స్నేహితుడిలా చూసు కొంటూ వచ్చింది. 'తను కోరుకున్నట్లే,

కొత్తగాలి...

**కలంపోట్లు**
**కత్తిగాట్ల కన్నా**
**కులాల మధ్య చిచ్చే**
**ప్రమాదకరం!**

– వి.యం. కృష్ణ,
ఇ.సి.ఐ.ఎల్., హైదరాబాద్

రాహుల్ మంచి బాలుడిలా పెరిగాడు. తనకోసం మిసిమి ప్రేమనూ వదులుకోడానికి సిద్ధపడ్తున్నాడు. మిసిమి ఇక్కడకు రాకపోతేనేం? తనకోసం రాహుల్‌నే అక్కడికి పంపితే సరి. తనకి శక్తి ఉన్నంతవరకూ బిజినెస్ చూసుకొంటుంది. ఆ తర్వాత ఏ ఓల్డేజ్‌హోంలోనో చేరితే సరి! వాళ్ళకి వీలైనప్పుడు తనని చూడటానికి రాకపోరులే' అనుకొంది.

ఇక ఆలస్యం ఎందుకనుకొంటూ ఆ మరుసటిరోజు, తన మనసులోని మాటను రాహుల్‌కి చెప్పేసింది రోజీ.

అయితే రాహుల్ మాత్రం ఆమె మాటలకు సంతోషించలేదు. "నాకోసం ఎన్నో కష్టాలు పడిన నిన్ను వదిలి ఎలా ఎళ్ళనమ్మా? " అంటూ బాధపడ్డాడు.

"అవన్నీ నేను కోరి తెచ్చుకొన్నవేరా! నీకు అన్ని సంగతులూ తెలీక నీ తండ్రిని ద్వేషిస్తున్నావంతే! అసలివన్నీ నీకు ముందే చెప్పాల్సింది గానీ నువ్వు నాకెక్కడ దూరమైపోతావోనని చెప్పలేదు" అంటూ సంక్షిప్తంగా గతం గురించి చెప్పింది రోజీగా మారిన అపురూప.

అదంతా విని ఆశ్చర్యపోయినా "అమ్మా, తెలిసీతెలీని వయసులో నువ్వలా వచ్చేశావే అనుకో.. నీకోసం వెదికించకుండా తన సుఖం తనే చూసుకొన్నారుగా.. ఆయన్ని నేను క్షమించలేను" అన్నాడు ముఖం గంటుపెట్టుకొని.

"రాహుల్, పొరపాటు నాదేనని చెప్పాక్కూడా నన్ను మన్నించగల్గిన నువ్వు, నీ తండ్రిని, తాతయ్య, నాన్నమ్మల్ని మన్నించలేవా? " అంది.

"నేను మన్నించడం మాట అటుంచు. నువ్వు చెప్పిందంతా వింటోంటే, వాళ్ళు మనల్ని క్షమించగలరో లేదోనన్పిస్తోంది. ఇంతకీ తాతానాన్నమ్మలు వుండి వుంటారా లేక.." అన్నాడు రాహుల్.

"ఛ.. అలా అనకురా, వాళ్ళెంతో పుణ్యాత్ములు. ఇంట్లో ధాన్యం, పాడిపంటలతో పెరిగిన శరీరాలు వాళ్లవి. కాబట్టి ఆరోగ్యంగానే వుండి వుంటారు. డాక్టర్‌గా ముక్కూమొహం తెలీనివాళ్ళని అభిమానించే నువ్వు, మనవాళ్ళని అభిమానించలేవా నా కోసం? మీ రాఘవ సర్ ఎలాగూ ఇండియాలో సెటిల్ అవుతున్నారు కదా! నీకాయన అండాదండా ఎలాగూ ఉంటాయి"

"నిజమే అనుకో. నా తండ్రి నన్ను, తన కొడుకుగా మిసిమి తల్లిదండ్రులకు పరిచయం చేయగల్గితే ఫర్వాలేదు. కానీ అందుకాయన భార్యాబిడ్డలు ఒప్పుకోకపోతేనో? అసలే మిసిమి పేరెంట్స్ సంప్రదాయ కుటుంబానికే ప్రాధాన్యతనిస్తారాయె" అన్నాడు.

ఆ మాటలకి రోజీ ఆలోచనలో పడింది. రెండు క్షణాలాగి "నువ్వు కోరుకుంటున్నది కేవలం గుర్తింపేగానీ ఆస్తిపాస్తులు కాదు కాబట్టి, వాళ్ళు అభ్యంతరం చెప్పకపోవచ్చులే" అంది భరోసాగా.

"ముందు వాళ్ళగురించి మిసిమికి చెప్పి, ఆ ఊరికి వెళ్ళమని చెప్పనా? లేక పెళ్ళయ్యాక వెదకాలా? "

"వెదికేంత అవసరం ఏముందిరా? వాళ్ళు స్థిరంగా ఆదిత్యాపురంలోనే వుంటారని గట్టిగా చెప్పగలను. అక్కడి భూములూ, ఆస్తులూ వదులుకుని ఎక్కడికీ

వెళ్ళరు. ముందుగా వారి దగ్గరకు నువ్వు వెడితే బాగుంటుంది. వాళ్ళు గనుక నిన్ను తమలో చేర్చుకొంటే, ఆ కుటుంబసభ్యుల ఆశీస్సులతో మీ పెళ్ళి జరుగుతుంది"

"నాకు వాళ్ళ ఆశీస్సులకన్నా నీ ఆశీస్సులు ముఖ్యం గదమ్మా. నా పెళ్ళికి నువ్వు రాకపోవటం నేను భరించలేనమ్మా" అన్నాడు రాహుల్.

"కానీ నేను అక్కడివారికెవరికీ నా ముఖం చూపించదల్చుకోలేదురా. నా మీద బెంగతో మా అమ్మానాన్నలు చనిపోయారని తెలిసిననాడే, ఇక వాళ్ళు లేని నేల నాకు అనవసరం అనుకొన్నాను" అంది ఆమె వేదనగా.

"అమ్మా, లేనివాళ్ళని తల్చుకొని బాధపడేకన్నా, నీకళ్ళ ముందున్న మా అందరి సంతోషం గురించి ఆలోచించి రావొచ్చు గదమ్మా" బతిమాలుతూ అన్నాడు.

'సినిమాలు చూడటమే నేరం' అన్న వాతావరణం వున్న పుట్టింట్లో, అత్తింట్లో, నేను సినిమా నటిని కావాలనుకోవడమే దుస్సాహసం. దానికోసం అందర్నీ కాదనుకోవడం పెద్దతప్పు. ఇంట్లోని డబ్బూ, నగలూ రంజనీ మదన్‌లు మూటగడ్తుంటే వారించకపోవడం మరో పెద్దతప్పు. ఇన్ని తప్పుల్ని చేయడమేగాక వారి వంశాంకురమైన నిన్ను వారికి దూరం చేశాను. తక్కినవన్నీ క్షమించినా, నిన్ను దూరం చేసినందుకు మాత్రం వాళ్ళు నన్ను ఎప్పటికీ క్షమించరు. ఇదంతా తెలిసీ, ఎలా వాళ్ళ ముందుకు వెళ్ళగలను?

నా తప్పులకు నువ్వు ఆనందాన్ని కోల్పోకూడదు. మిసిమితో నీ పెళ్ళి జరిగితేనే, నా మనసుకి ఊరట. నామీద ఏమాత్రం గౌరవం ఉన్నా ఇక వాదించకుండా మిసిమితో ఇండియాలో స్థిరపడ్తానని చెప్పు" అంది రోజీ కచ్చితంగా.

'రోజులన్నీ ఒకేలా వుండవు. అక్కడికెళ్ళి పరిస్థితులు గమనించాక అమ్మని తీసుకువెడితే సరి' అనుకుని వెంటనే మిసిమికి ఫోన్ చేశాడు.

"మిసిమీ, నీకోసం ఇండియా వచ్చేస్తున్నాను. కొన్ని విషయాలు సెటిల్ చేసుకోవాలి. ఐదారునెలలు పడ్తుందేమో" అన్నాడు ఉత్సాహంగా.

"ఎంత మంచి వార్త చెప్పావ్?! ఆంటీ నిన్ను కన్విన్స్ చేయడానికి ఎంత నచ్చచెప్పి వుంటారో ఊహించగలను. ఎదురుగా వుంటే కాళ్ళమీద పడి కృతజ్ఞతలు చెప్పుకొనేదాన్ని" అంది మిసిమి.

ఆ మాటలు విని తృప్తిపడింది రోజీ.




రాఘవ యుద్ధ ప్రాతిపదికన లండన్‌లోని తన వ్యవహారాలన్నింటినీ సెటిల్ చేసేసుకొన్నాడు.

స్వీటీని తల్లిదగ్గరే ఉంచేయాలని నిశ్చయించుకుని విజయవాడలోని స్కూల్లో చేర్పించాడు. తను రఘునాథపురంలో వుంటూ వీలైనప్పుడల్లా వచ్చిపోయేందుకు కారు కొన్నాడు. ముదిమి వయసులో తన వాళ్ళిద్దరూ తనదగ్గరే వుంటున్నందుకు ఇంద్రాణి సంబరపడింది.

రఘునాథపురం నడిబొడ్డులో ఉన్న పెద్ద బిల్డింగ్ కొని, తగిన మార్పులవీ చేసి, తనుండటానికీ, హాస్పిటల్‌కీ తగ్గట్లుగా మలిచాడు. మిసిమి తల్లిదండ్రులకున్న పరపతితో మినిష్టర్లని, ప్రముఖులని పిలిచి గ్రాండ్‌గా హాస్పిటల్ ప్రారంభో

## కొత్తగాలి...

**అప్పుడు ఛాయాచిత్రాలు**
**నిండుగా.. కనువిందుగా!**
**ఇప్పుడు సెల్ఫీల రాజ్యం!**
**ఎవరికి వారే యమునాతీరే!**

– రిత్విక్,
హైదరాబాద్

త్సవం జరిపించాడు. పేదవారికి ఉచితంగా, మిగిలినవారికి నామినల్ ఫీజుతో వైద్యమందించాలని ప్రణాళిక వేశాడు. పల్లెటూర్లపట్ల అభిమానం ఉన్న డాక్టర్లను అపాయింట్ చేసుకొన్నాడు.

అతను చేసే ప్రతిపనిలోనూ నమ్రత, విశాల్, విశాల్ టీమూ, ఊరివారంతా తమ సంపూర్ణ సహకారం అందించారు.

మిసిమి, విశాల్‌లు తామిచ్చే ప్రోగ్రామ్స్‌లో ప్రత్యేకించి డాక్టర్ రాఘవ హాస్పిటల్ గురించి, అతని ఆశయాల గురించి ప్రచారం చేయసాగారు. అందువల్ల చుట్టుపక్కల గ్రామాల్నుండేగాక హైద్రాబాద్, ఖమ్మం, గుంటూరు, విజయవాడల్లో ఉంటున్నవారు గూడా రావడం మొదలెట్టారు. మ్యూజికల్ ప్రోగ్రామ్స్‌లో సంపాదిస్తున్నదాంట్లో సగానికి పైగా విశాల్ గ్రామ సంక్షేమానికివ్వడం గమనించిన రాఘవ, తను కూడా భారీ ఎత్తున విరాళమందించాడు. అది చూసిన ధనవంతులెందరో స్పందించారు. అంతేకాకుండా విశాల్ ప్లాన్ చేసిన కొత్త ప్రాజెక్ట్‌కి అవసరమైన సహాయం చేసేందుక్కూడా ముందుకొచ్చారు.

విశాల్, అతనిటీమ్ చేస్తున్న అభివృద్ధి కార్యక్రమాల్లో రాఘవ పాలుపంచుకోవటానికి రాధ గూడా ఓ కారణమే. ఆడపిల్లయివుండీ ఆమె చేస్తున్న సేవని స్ఫూర్తిగా తీసుకొన్నాడు. అదేమాట, ఆమెతోనూ అంటే "డాక్టర్‌గా నువ్వు అందించే సేవలతో పోలిస్తే మాదేపాటిలే బావా? " అందామె నిగర్వంగా.

"మీ అందరిలో నాకు ముఖ్యంగా నచ్చేది నిరాడంబరత, వినయం. మన విశాల్ నిర్వహించబోయే కొత్త ప్రాజెక్ట్‌లోనూ మీతోబాటు నేనూ భాగస్వామినవుతున్నానంటే నాకెంత గర్వంగా వుందో తెలుసా" అన్నాడు.

"విశాల్ ఏపని చేసినా మంచే జరుగుతుందని మా నమ్మకం. ఆ ప్రాజెక్ట్ గురించి పూర్తి వివరాలు చెప్పు బావా, నేనూ అందరికీ వివరించాలిగా! ఈమధ్య విశాల్, కీబోర్డ్ ప్లేయర్‌గా బిజీ అవడం వల్ల అంతగా వివరాలు చెప్పలేదు. నిన్నే అడిగి తెలుసుకోమన్నాడు" అంది రాధ.

"అయితే చెబుతాను విను, ఊరూరా తిరిగి వృద్ధాప్యంలో 'కబేళాల' పాలవ్వబోయే ఆవులు, గేదెల్ని కొనడం, వాటికి విశ్రాంత జీవితాన్ని అందించడంవల్ల పుణ్యమే గాదు లాభమూ వుంది. వాటి పేడతో బయోగ్యాస్ ప్లాంట్స్ ఏర్పాటౌతాయి. వాటి మూత్రం సేంద్రియ ఎరువుగా, క్రిమికీటకనాశినిగా ఉపయోగిస్తాం. కుళ్ళిన పేడనుండి వచ్చే పురుగుల్ని కోళ్ళకి ఆహారంగా వేస్తూ కోళ్ళ ఫారమ్స్ ఏర్పాటు చేస్తాం. అలాగే కబేళాలో వ్యర్థాల్ని, కుళ్ళిన చేపల్ని బాతులకు ఆహారంగా వేసి వాటితో, వాటి గుడ్లతో ఆదాయం పెంచుతాం. అలాగే కొందరిని నియమించి చెత్తను సేకరిస్తాం. పనికొచ్చే చెత్త, భూమిలో కలిసిపోయే చెత్తని ఎరువుగా వాడి పంటలరాబడిని అధికం చేస్తాం. ఇవేగాక ఇంకా చాలా ఉన్నాయిలే. వీటి గురించి మనూరివాళ్ళకి వివరంగా చెప్పేందుకు కొందరికి కోచింగ్ ఇచ్చే ఏర్పాట్లూ జరుగుతున్నాయి" అన్నాడు రాఘవ.

"అలాగా" అంటూ ఆసక్తిగా వింది రాధ.

ఈ కార్యక్రమాల వల్లనైతేనేం, ధాత్రికి కాలునయంచేసే విషయంలో అతనితో సంప్రదింపులు జరపడం వల్లనైతేనేం, రాఘవ, రాధల మధ్య అనుబంధం రోజు రోజుకీ చిక్కనవుతోంది.

★ ★ ★

రాహుల్ ఫోనందుకోగానే మిసిమి- విశాల్, నమ్రత, రాఘవలకు ఫోన్ చేసింది. వాళ్ళు తన తల్లిదండ్రులకు రాహుల్ గురించి చెబితే, తమ పెళ్ళికి అంగీకరిస్తారన్న నమ్మకం ఆమెది.

మిసిమి ఆశించినట్లే వాళ్ళంతా వచ్చి రాహుల్ గురించి చెప్పి కన్విన్స్ చేసేసరికి ఆమె తల్లితండ్రులు శర్వాణి, రాజమౌళి పెళ్ళికి ఒప్పుకున్నారు.

"అబ్బాయి తల్లి రాననడం మాత్రం మింగుడుపడటం లేదు మరి" అంది శర్వాణి.

"అమ్మాయి, అల్లుడూ సుఖంగా వుండటం గదా మనకి ముఖ్యం. వేరే విష యాల గురించి ఆలోచించడం దేనికి? " అన్నాడు రాజమౌళి.

"పెళ్ళంటే అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు చూడాలంటారు మరి!" అంది శర్వాణి. ఆమెకు కూతురి మీద నమ్మకం ఉన్నా తను ప్రేమించిన సంగతి ఇన్నాళ్ళు దాచినందుకు కొంత కినుక వుంది. ఆ అబ్బాయ్ ఎలాంటివాడోనన్న భయమూ వుంది.

"అబ్బాయి విషయంలో నేను గ్యారెంటీ ఇస్తాను" భరోసాగా అన్నాడు రాఘవ.

"అబ్బాయి కుటుంబసభ్యులెవరూ లేకుం డా పెళ్ళి జరగడం నాకిష్టంలేదు. తల్లి దూరానున్నా మిగిలినవాళ్ళిక్కడే ఉన్నారం టున్నారుగదా. మనమెళ్ళి మాట్లాడివస్తే బాగుంటుంది మరి" అంది శర్వాణి.

"రాహుల్ వచ్చాక ఆలోచిద్దాం" అంది మిసిమి.

అతనొచ్చేసరికి టైమ్ పడ్తుందంటున్నా వ్‌గా. ఆలోగా నమ్రతా విశాల్‌లతో బాటు మేమెళ్ళి, వారితో మాట్లాడతాం. వాళ్ళ ఉద్దేశమేంటో తెలిస్తే, రాహుల్ గూడా వెళ్ళడమో, మానడమో తేల్చుకొంటాడు గదా" అంది శర్వాణి.

"రాహుల్ ఏమంటాడో మరి? "

"ఫోన్ చేసి చెప్పు" అన్నాడు రాజమౌళి.

ఫోన్ చేసి, రాహుల్‌ని ఒప్పించింది మిసిమి. అతను చెప్పిన వివరాల ప్రకారం ఆదిత్యపురం వెళ్ళారు.

అపురూప, రాహుల్ ఈ ప్రపంచంలోనే లేరనుకొన్న రాజారామ్మోహనరావు, పరం ధామయ్య, సీతమ్మగార్లు, ఈ సంగతులన్నీ విని ఆశ్చర్యానందాల్లో మునిగిపోయారు.

వాళ్ళ ఆస్తిపాస్తులు, ఆ ఊర్లో వారికున్న పేరు ప్రఖ్యాతులూ చూసి సంతుష్టుల య్యారు శర్వాణి, రాజమౌళిలు.

తాంబూలాలు పుచ్చుకొని, పెళ్ళికి ముహూర్తం నిర్ణయించారు. పెళ్ళికి వారం ముందుగానే రావాలనుకొన్నా, రెండ్రోజుల ముందుగా మాత్రమే రావడా నికి కుదిరింది రాహుల్‌కి.

దాంతో పెళ్ళికాగానే వధూవరులిద్దరినీ తీసుకొని, తమ ఊరికి వెడదామని నిశ్చ యించుకొన్నారు. పెళ్ళికి అటెండ్ అయ్యేం దుకు నాల్రోజులముందే హైద్రాబాద్ వచ్చేసి హోటల్లో దిగారు రాజారామ్మోహ న్‌రావ్, అతని బంధువులంతా.

రాఘవ వెంటరాగా తనతండ్రిని, కుటుం బసభ్యుల్ని కలవడానికి, హోటల్‌కి వె ళ్ళాడు రాహుల్.

పొందూరు జరీ పంచెలో, పెద్దపెద్ద మీసాలతో, అంతవయసులోనూ మంచిరం గుతో కళగా ఉన్న వ్యక్తిని చూస్తూనే తన తండ్రిగా గుర్తించాడు. అప్రయత్నంగా వంగి కాళ్ళకి నమస్కరించాడు రాహుల్. ఆ సంస్కారానికి మురిసిపోయి గాఢంగా రాహుల్‌ని కౌగిలించుకొన్నాడు రాజారా మ్మోహనరావు.

## కొత్తగాలి...

**కళ్లు!**
**చూసేది చెప్పలేవు!**
**చెప్పేది**
**వినలేవు!**

– యు. చిట్టిబాబు,
న్యూపాల్వంచ ఖమ్మం జిల్లా

వెచ్చగా, ఆత్మీయంగా ఉన్న ఆ పరిష్వంగపు హాయిని, ఏకకాలంలో అనుభవించారు ఇద్దరూ. అప్రయత్నంగా కళ్ళుచెమర్చాయి ఇద్దరికీ.

రాఘవ "కంట్రోల్ యువర్ సెల్ఫ్" అంటూ భుజం తట్టగానే తేరుకొని అతడిని పరిచయం చేశాడు రాహుల్.

సోఫాలో కూర్చున్న వృద్ధజంటని, వారి ఆనందాన్ని గమనిస్తూనే తన తాతా నాన్నమ్మలుగా గుర్తించి, కాళ్ళకు నమస్కరించాడు తల్లి చెప్పినట్లే.

అప్పటి పొత్తిళ్ళ బాలుడు, ఇప్పుడు ఆరడుగులవాడై తమముందు నిలిచేసరికి, వారికి నోటమాట రాలేదు. వారి స్పర్శను అనుభూతిచెందుతూ అలాగే కూర్చుండిపోయాడు రాహుల్.

"అచ్చం రాజాలాగే ఉన్నాడు గదూ.." అంటూ మురిసిపోయారు వాళ్లు. పద్ధతి ప్రకారం రాహుల్‌ని పెళ్ళికొడుకుని చేసి ముచ్చట తీర్చుకొన్నారు.

ఆ రాత్రి తండ్రితో మాట్లాడుతూంటే మరిన్ని వివరాలు తెలిశాయి రాహుల్‌కి. ఇంట్లోనుండి తనభార్య కొడుకుని, డబ్బుని తీసుకొని పారిపోయిందని తెల్సినా, తనే భార్యను కోపంలో తిట్టి పంపించేసినట్లు చెప్పి నిందంతా తనమీదనే తండ్రి వేసుకొన్నాడని తెలిసి ఆయనమీదున్న అపోహ తొలగిపోయింది.

తల్లి అనారోగ్యంవల్ల పెళ్ళాడక తప్పలేదని, అయితే నెలగడవకముందే ఆమె పాముకాటుతో పోవడంవల్ల, మరొకామెని పెళ్ళాడవలసి వచ్చిందని, ఆమె ప్రసవవేదనతో పోయిందని, పుట్టినబిడ్డగూడా నెల తిరక్కముందే పోయాడని తండ్రి చెబుతుంటే విని చలించిపోయాడు. అంచెలంచెలుగా చేరిన వార్తలు, కొత్తరూపాన్ని ఎలా సంతరించుకొంటాయో అర్థమై విస్తుబోయాడు రాహుల్.

"అమ్ములు, అదే మీ అమ్మ ఏది? రాఘవగారింట్లో వుందా? ఇక ఆగలేక అడిగాడు రాజారామ్మోహనరావు. 'అమ్ములు' పదం అతని నోట ఎంత తీయగా ధ్వనించడం వినగానే రాహుల్ కళ్ళలోకి చివ్వున కన్నీళ్ళొచ్చేశాయి. అమ్మ పెళ్లికి రావటంలేదన్న నిజాన్ని చెప్పలేకపోయాడు. అలాగని అబద్ధం చెప్పలేక "బిజీ షెడ్యూల్ వల్ల తనకి రావడం కుదుర్తుందో లేదో మరి" నానుస్తూ అన్నాడు.

'ముఖం చెల్లకనే ఆ పిచ్చిది రావటంలేదులా వుంది. ఆమె రాక కోసం తనెంతగా ఎదురుచూస్తున్నాడో, ఆమెకెప్పటికైనా తెలిసేనా?' అనుకొంటూ గాఢంగా నిట్టూర్చాడు రాజారామ్మోహన్.

ఒక్కసారిగా పదేళ్ళు మీదబడ్డట్లుగా డల్‌గా మారిపోయిన తండ్రివంక చూసేసరికి, తన తల్లిమీద ఎంత ప్రేమ ఉందో తెలిసింది రాహుల్‌కి.

మరుసటిరోజు డైరెక్ట్‌గా పెళ్ళిమండపానికి చేరుకొన్నారంతా.

'అలనాటి రామచంద్రుని కన్నింటాసాటి' అన్నట్లు పెళ్ళి కొడుకు అలంకరణలో మెరుస్తున్న రాహుల్‌ని ఎగబడి చూశారు.

పెళ్ళి శాస్త్రయుక్తంగా, మహావైభవంగా జరిగింది.

రాహుల్ 'ఇదంతా నిజమేనా?' అని మధ్యమధ్యలో తనని తాను గిల్లి చూసుకొన్నాడు.

పసిడిబొమ్మ మిసిమి మెడలో తనుగట్టిన తాళి మెరుస్తూంటే 'ఇకనుండి ఈ అందాలరాశి నా సొంతం' అనుకొంటూ మురిసిపోయాడు.

"మూడు నిద్రలయ్యాక అల్లుడినీ, అమ్మాయిని మీ ఇంటికి పంపిస్తాం" అని శర్వాణీ రాజమౌళిలు అన్నారు.

దాంతో, ముందుగానే వెళ్ళి రిసెప్షన్, సత్యనారాయణ స్వామి వ్రతాలకు ఏర్పాట్లు చేసుకోవాలని బయల్దేరారు రాజా రామ్మోహనరావు, తదితరులు.

ఏకాంతంలో "మిసిమీ, ఇదంతా ఇంకా కలలానే అన్పిస్తోంది. నన్నూ నా వాళ్ళనీ, మీరంతా కలిసి ఒకటి చేశారు.

అందరూ వుండి ఇన్నేళ్ళూ అమ్మా, నేనూ అనాధల్లా బిక్కుబిక్కుమంటూ బతికాం. నీవల్లే అంతా దొరికారు. నీ రాక నా జీవితంలో ఇంతటి సంతోషాన్ని మోసుకొచ్చింది. నువ్వు నా అదృష్టదేవతవి" అంటూ ఆమెను ప్రేమగా తన కౌగిట్లోకి తీసుకొన్నాడు రాహుల్.

★ ★ ★

విజయవాడకి దగ్గర్లో కొండలమధ్య కోనేటిలో విరిసిన తామరపువ్వులాంటి తమ ఊరుకి ప్రయాణమయ్యారు కొత్తజంట.

చక్కటి పూల డెకరేషన్‌తో పూలతేరులా వస్తోన్న వారి కారుని, ఇళ్ళలోంచి బయట కొచ్చి మరీ చూడసాగారు అక్కడి వాళ్ళు. ఇక పిల్లలైతే కారు వెనుకే కేరింతలు కొడుతూ రాసాగారు.

వారందర్లో చిందులేస్తోన్న ఆనందాన్ని, నిష్కల్మషమైన ప్రేమని గమనిస్తూ భారతదేశాన్ని వసుధైక కుటుంబమని ఇందుకే అంటారు కాబోలు. తనెవరో తెలీకపోయినా ఇంతగా అభిమానిస్తున్నారు. ఎదుటివ్యక్తి ఆనందాన్ని తమదిగా భావించే గొప్ప గుణం అనుకొన్నాడు.

కారుదిగగానే, వీడియోగ్రాఫర్ పని మొదలైంది. ఇక్కడ జరిగే ప్రతీదృశ్యాన్నీ తల్లి చూడాలని, స్పెషల్ ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి మరీ, ఆ ఏర్పాటుచేశాడు రాహుల్. పెళ్ళి వీడియోని తల్లి చూసేలా అంతకుముందే ఏర్పాటు చేశాడు.

కారు భవంతి ముందు ఆగింది. తలెత్తి చూస్తే సరికొత్తగా రంగులద్దుకుని రాజభవనంలా కళకళలాడుతోంది.

మదపుటేనుగులూ, సింహాల బొమ్మలున్న సింహద్వారం నుండి భవనపు మెట్లవరకు నడవాలంటే, చక్కగా పెంచిన హరితవనం గుండా ఐదు నిమిషాలపాటు నడవాల్సిందే. సింహద్వారం దగ్గరే ఎర్రనీళ్ళు దిష్టి తీసి గుమ్మడిపండుతో దిగతుడిచి, నవదంపతులను స్వాగతించారు ముత్తయిదువులు.

కన్నెపిల్లలు జల్లుతోన్న అత్తరు, పూలవర్షపు పరిమళాల్ని ఆస్వాదిస్తూ ముందుకు అడుగేశారు.

మెట్లెక్కి విశాలమైన హాల్లో అడుగుపెట్టి ఎత్తైన గోడల మీదున్న రవివర్మ చిత్రాలు, అందమైన పెయింటింగులు, పూర్వీకుల నిలువెత్తు ఛాయాచిత్రాలు చూస్తూ నిలబడిపోయారు.

హాలు మధ్యలో నల్లటేకుతో చేసిన విశాలమైన సోఫాలు, కుర్చీలు చక్కటి నగిషీతో ఉన్నాయి. తలెత్తి చూస్తే సుందరమైన షాండిలియర్ దర్శనమిచ్చింది. హాల్లో పైకి వెళ్ళడానికి రెండువైపులా మెట్లున్నాయి. మెట్లకిరువైపులా కవాతు చేస్తున్నట్లున్న సైనికుల కంచుబొమ్మలు, మధ్య మధ్యలో సుందరాంగుల విగ్రహాలు నాట్య భంగిమల్లో కొలువుతీరాయి.

మెట్లెక్కి వెడితే అటూఇటూ గదులున్నాయి, విశాలమైన కిటికీలతో. తలుపులకు బిగించిన గాజుపలకలపై సప్తవర్ణాలను వెదజల్లుతున్నట్లు పెయింట్ చేసిన నెమళ్ళు, లతలు, పక్షుల చిత్రాలు. మొదటిసారి చూసినవాళ్ళకి మ్యూజియంలో అడుగుపెట్టిన భావన కల్గుతుంది.

## కొత్తగాలి...

**నేటితరం**
**యథార్థం వదిలేసి**
**పదార్థం వెంట**
**పరుగులు తీస్తోంది!**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

"ప్రయాణం కులాసాగానే జరిగింది కదా" అంటూ రాజారామ్మోహనరావు, పరంధామయ్యలు వచ్చి అడిగారు. వారికి దంపతులిద్దరూ పాదాభివందనం చేశారు.

"వ్రతానికి అన్నీ రెడీ చేశాం మామ్మ గారూ! ఇంకా ఏం చేయాలి? " అంటూ వచ్చిన నమ్రత, మిసిమిని చూసి కొంటెగా కళ్లెగరేసింది.

"నిన్న వచ్చిన దగ్గరనుండీ అన్ని పనులూ చక్కబెడుతోంది మీ వదిన.. మంచి పనిమంతురాలు. నీకు తోడుగా ఉంటుందని, ఆ దంపతులను మాతో తీసుకువచ్చేశాం" అన్నారు సీతమ్మగారు, మిసిమిని దగ్గరకి తీసుకొని.

"రారా మనవడా, చక్కగా పట్టుపంచె కడతాను నీకు" అంటూ పరంధామయ్య, రాహుల్ ని తన గదిలోకి తీసుకువెళ్ళాడు.

నమ్రత, మిసిమికి చక్కగా కుచ్చిళ్ళు పోసి అందంగా పట్టుచీర కట్టింది. పొడవైన ఆమె జడను పూలమాలలతో చుట్టి అప్పటికప్పుడు పూలజడగా మార్చింది.

పురోహితుడు వచ్చేసరికే హాలంతా బంధువులతో నిండిపోయింది. అతడు రాగానే సత్యనారాయణవ్రతం మొదలుపెట్టారు. బ్రాహ్మణుడు చెప్పినవన్నీ శ్రద్ధగా వింటూ వ్రతం చేస్తున్న రాహుల్ ని చూస్తూ ముచ్చటపడ్డారంతా.

రెండు గంటలకు పైగా పీటలమీద అలా కూర్చోవలసి రావడం ఇబ్బంది కల్గించినా, భక్తిశ్రద్ధలతో వ్రతాన్ని ముగించారు రాహుల్, మిసిమిలు.

భవనంముందు వేసిన పందిళ్ళలో నిండిపోయిన జనాన్ని చూస్తూ 'ఊరు ఊరంతా తరలి వచ్చిందే' అనుకొన్నాడు రాఘవ. తండ్రి పిలవగా వచ్చిన రాహుల్, అతను పరిచయం చేసిన పెద్దలందరికీ వినయంగా నమస్కరించాడు.

"నువ్వు వయసులో ఉన్నప్పుడెలా ఉన్నావో అచ్చం అలాగే ఉన్నాడు మీ అబ్బాయి. పరిచయం చేయాల్సి అవసరమే లేదు నీ కార్బన్ కాపీనే" అని వాళ్ళంతా అంటూంటే గర్వంగా మీసాలు మెలేశాడు రాజారామ్మోహనరావు. పంచెకట్టులో అచ్చమైన తెలుగుతనంతో అలరారుతోన్న రాహుల్ మీదినుండి చూపులు మరల్చుకోలేకపోతున్నారు చూసినవాళ్ళు.

కన్నెపిల్లలతడిని చాటునుండి ఎగబడి చూస్తూంటే మిసిమికి గర్వమూ, భయమూ గూడా కల్గింది.

పెద్ద సంతర్పణలా భోజనాలపర్వం సాగుతుంటే చూసి ఆశ్చర్యపోయారు శర్వాణీ, రాజమౌళి తదితరులంతా.

ఆ తర్వాత ఇరవై ఒక్క ముత్తయిదువుల మధ్య నవదంపతులని కూర్చోబెట్టి భోజనం వడ్డించారు. అందరికీ అరిటాకుల్లో వడ్డించినా కొత్తజంట కాబట్టి వారికి ప్రత్యేకంగా బంగారు పువ్వులు మధ్యలో తాపించిన వెండి పళ్ళాల్లో వడ్డించారు.

కొసరి కొసరి ప్రేమగా వడ్డిస్తుంటే, ఎప్పటికన్నా ఎక్కువ తినేసి "బాబోయ్, భుక్తాయాసంగా ఉంది" అన్నారిద్దరూ.

తమలపాకులు, సున్నం, వక్క తదితరాలతో బాటు కాస్త వాము వేసి తినమని ఇచ్చారు. అది తిన్న కాసేపటికే గుణం కన్పించేసరికి రాహుల్ ఆశ్చర్యపోయాడు. ఇక్కడివారికి చిట్కా వైద్యాలు చాలా తెలుసని తల్లి చెప్పింది గుర్తుకొచ్చింది.

"మీరిద్దరూ మైగదిలో కాసేపు విశ్రాంతి తీసుకోండి. నేనలా వెళ్ళి మన తోటలో రిసెప్షన్ ఏర్పాట్లు ఎంతవరకూ వచ్చాయో చూసి వస్తాను" అంటూ రాజారామ్మోహన రావు కదిలేసరికి 'తిన్నది అరుగుతుం దంటూ' విశాల్, రాఘవలు కూడా అతడి వెంట వెళ్లారు.

"కాసేపు నడుం వాల్చండి, రిసెప్షన్‌లో నిలబడాల్సి వస్తుంది. మా తమ్ముడిని కాసేపు నిద్రపోనీ తల్లీ" అంది నమ్రత కొంటెగా మిసిమితో.

నమ్రత కలుపుగోలుతనం రాహుల్‌కి ఆత్మీయంగా తోచింది. విశాలమైన ఆ గది లోకి అడుగుపెడుతూనే మైమరచిపో యారు మిసిమి, రాహుల్‌లు. చిక్కని చక్కని నగిషీతో ఉన్న ఎత్తైన పందిరి మంచం, ఠీవిగా ఉంది. అటూఇటూ గిలక లున్నాయి. మంచాన్ని ఎక్కడానికి వేసిన బల్లగూడా ఓ కళాఖండంగానే తోచింది. తెల్లటి దోమతెరతో ఉన్న ఆ మంచం మేలి ముసుగులో ఉన్న వధువులా తోచింది.

"నేను నిన్నెక్కిస్తా"నంటూ ఆమె నడు ముచుట్టూ చేతులేసి చులాగ్గా పైకెత్తి మంచంమీద కూర్చోబెట్టాడు రాహుల్.

దక్షిణంగా ఉన్న పెద్ద కిటికీల్లోంచి పూల పరిమళాలని వెంటబెట్టుకొచ్చిన చల్లటిగా లికి గాఢంగా క్షణాల్లో నిద్రపట్టేసింది వారికి. వాళ్ళు నిద్రలేచేసరికి వేడివేడి కాఫీ లతో ఎదురొచ్చింది రాధ.

అప్పటికప్పుడు వేయించి పొడిచేసిన కాఫీగింజలతో ఫిల్టరేసిన కాఫీ కావడాన ఘుమఘుమల్ని వెదజల్లుతోంది. ఆ మధుర పరిమళాన్ని గుండెల్నిండుగా పీల్చి ఇష్టంగా కాఫీ కప్‌ని అందుకుని "థాంక్స్" అన్నాడు రాహుల్.

"మనలో మనకి ఆ మాటలెందుకు లెండి? " నవ్వుతూ అంది రాధ.

★ ★ ★

తోటలోని పచ్చని చెట్లకు విద్యుద్దీపాలు అమర్చడంవల్ల ఆ పచ్చదనంమీద రంగు రంగు బల్బుల వెలుగు, వింతశోభను వెద జల్లుతోంది.

సింహాసనాల్ని మరిపించే ఎర్రటి వెల్వెట్ కుర్చీల్లో ఆశీనులైన మిసిమి, రాహుల్‌లను చూడటానికి రెండు కళ్ళూ చాలవన్పిస్తోంది.

ఇద్దరిలో ఎవరిది ఎక్కువ అందమో తేల్చుకోలేక గుసగుసలాడుకొంటున్నారు కన్నెపిల్లలు. వారిద్దరి అందమూ, ఆ తోట డెకరేషనూ కళ్ళకు విందు కాగా, విశాల్

## ఆగస్టు - 2016
## చతురప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **యం. తులసీ కుమార్** - యేర్పేడు, చిత్తూరు జిల్లా
2. **పి. లావణ్య** - గాజువాక, విశాఖ జిల్లా
3. **వి. వెంకటరామనర్సయ్య** - కుమార్‌పల్లి, వరంగల్ జిల్లా
4. **బి.వి. నరసింహారావు** - పేరాల, ప్రకాశం జిల్లా
5. **అక్షింతల సంజీవశర్మ** - అనంతపురం

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. వందేమాతరం | 6. లారెన్స్ పాస్టర్ |
| 2. చంద్రశేఖర్ | 7. దలీనీ బేగం |
| 3. రామ్‌చరణ్ | 8. ప్రతిభారాయ్ |
| 4. కులుసూమ్ | 9. సగం వాటా |
| 5. ప్రతాప్ | 10. వసంతరావు దేశపాండే |

మ్యూజిక్ ప్రోగ్రాం వీనులకు విందు చేసింది.

'వన్స్ మోర్' అని కోరుతుంటే నిరాటం కంగా సాగిపోయిందా ప్రోగ్రాం. మంత్ర ముగ్ధుల్లా వింటూ ఉండిపోయారు.

నమ్రత, రాధల కోసం వెదికాయి మిసిమి కళ్ళు. వారిద్దరి జాడ లేకపోయేస రికి 'పాపం వారం రోజులుగా వాళ్ళు పనుల్లో మునిగి తేలుతున్నారు కదా, పడు కున్నారో ఏమో' అనుకుంది.

"ఇక వీళ్ళని తీసుకుని వెడతాం. దంప తుల తాంబూలాలు ఇప్పించాలిగా" అంటూ సీతమ్మగారు అనేసరికి 'అమ్మయ్య' అనుకొంది మిసిమి. ఆ కార్య క్రమం అయ్యాక దంపతులిద్దరికీ దిష్టి తీయించి, వారిని పైకి తీసుకువెళ్ళిందామె.

"మనవడి పెళ్ళనేసరికి బామ్మగారికి ఎక్కడలేని శక్తి వచ్చేసింది. కీళ్ళనొప్పులెటు పోయాయోగానీ చకచకా పనులన్నీ చక్క బెట్టున్నారు" అంటూ ఆశ్చర్యపోయారు బంధువులు.

గుమ్మందగ్గర నిలబెట్టి ఆడబడుచు వర సయ్యేవారు, రాహుల్ దగ్గర కట్నం గుంజిన తర్వాత గదిలోకి పంపించారు.

ప్రతీ కార్యక్రమంలోనూ అనుబంధం, ఆత్మీయతా ఉట్టిపడటం రాహుల్ని ఆక ట్టుకుంది.

గదిలోకి అడుగుపెడుతూనే వారిద్దరి కళ్ళూ వికసితదళ పద్మాలయ్యాయి.

పూలరథంలా అలంకరించిన తల్పం పరిమళాల్ని వెదజల్లుతూ 'మీ అలసట నంతా తీర్చేస్తాను, రారమ్మంటూ' ఆహ్వాని స్తోంది. 'అగరుపొదలో, అత్తరులో' అన్నట్లు అగరుధూపాల సౌరభం పూలప రిమళంతో జతగట్టి, వారి మతులను పోగొట్టింది. ఆ అలంకరణ చూస్తూ 'నమ్ర తక్కా, రాధక్కా కలిసే ఈ డెకరేషనంతా చేసివుంటారు. అందుకే రిసెప్షన్ నుండి తొందరగా వెళ్ళినట్లున్నారు' అనుకొంది మిసిమి.

తలుపులు మూసి రాహుల్ తనని సమీపిస్తూంటే, ఆమె ఒళ్ళు ఝల్లుమంది.

ఆమెను ప్రియమారా, హృదయానికి హత్తుకుని "జీవితానికి పరిపూర్ణత చేకూరి నట్లుంది" పరవశంగా అన్నాడు రాహుల్.

"నాక్కూడా" మత్తుగా పలవరించినట్లే అంది మిసిమి.

ఇద్దరూ ఆనందలోకాల్లో విహరించారు అలుపన్నది లేకుండా.

★ ★ ★

మరుసటిరోజున స్నానాలూ, అల్పాహా రాలూ ముగిశాక, భవనమంతా తిరిగి చూశారా దంపతులు.

ఏ గది ప్రత్యేకత దానిదే. ఇక వంట గదయితే విశాలంగా, నేటి మోడరన్ కిచె న్ను మించి ఉంది.

వంటింట్లో నుండి పెరట్లోకి దారితీసే తలుపు, దానికెదురుగా పెద్ద తులసికోట. ఆ తులసమ్మ కొప్పునిండా తన పూలను రాలుస్తూ అలంకరిస్తున్నట్లు పారిజాతపు చెట్టు, ఆ పక్కనే ఉంది.

పెరట్లో ఓ మూలగా బావి. బావిగట్టు చుట్టూ అరటిచెట్లు పళ్ళగెలలతో భారంగా గర్భిణీస్త్రీల్లా కన్పించాయి మిసిమికి. కమ్మ ని సువాసన వెదజల్లుతున్న కరివేపాకు చెట్లు పచ్చగా కనువిందు చేస్తున్నాయి.

చాలా పెద్దగా, విశాలంగా ఉన్న ఆ పె రట్లో ఓ పక్కగా ఆకుకూరల మడులు, మరోపక్క వంగ, బెండ, టమాటా తదితర మొక్కలను చూస్తూ ఆ కూరగాయలను చే తితో తాకుతూ "మార్కెట్కి వెళ్ళి ఏవీ కొనుక్కోనక్కర్లేదు.. అన్నీ ఇక్కడే దొరి కేలా వున్నాయే!" అంది మిసిమి చాలా సంబరంగా.

ఆ సంబరం సీతమ్మగారికానందం కల్గిం చింది. కానీ మరుక్షణంలోనే 'రెండ్రోజు లుండి వెళ్ళిపోయే వీరిమీద ఏ ఆశలూ, మమకారాలూ పెంచుకోకూడదు' అను

కుంది దిగులుగా.

నాలుగురోజులు నాల్గుక్షణాల్లా గడి

చాయి. ఆ సాయంత్రం "ఇక వెడతాం" అన్నారు నమ్రతా వాళ్ళు.



నమ్రత దంపతులకు, రాధకూ బట్టలు పెట్టించి, పళ్ళగంపలు కార్లో పెట్టించి పంపించారు సీతమ్మగారు.

వాళ్ళు వెళ్ళిపోగానే వెలితిగా ఫీలైంది మిసిమి.

"నేనలా తోటలోకి వెడుతున్నాను. మీరూ మన తోటను, పొలాల్ని చూస్తే టైమ్‌పాసవుతుంది" అని రాజారామ్మోహన్ రావు అనడంతో మిసిమీ, రాహుల్ కూడా బయల్దేరారు.

"మీరు తోటంతా చూసిరండి. నేనీలోగా పొలాలదగ్గర పనులు పురమాయించి వస్తాను" అని వారిని తోటదగ్గర వదిలి వెళ్ళిపోయాడు రాజారామ్మోహన్‌రావ్.

తోటలో వివిధరకాల ఫలవృక్షాలు, వాటి నాశ్రయించుకొని రకరకాల పూల లతలు చూస్తూ కబుర్లు చెప్పుకుంటూ తోటంతా చుట్టేశారు.

రాత్రవుతున్నా, పున్నమి కావడంతో వెన్నెల వెలుగు ఆహ్లాదకరంగా వుంది. ఆ వెన్నెలసోనల్లో తడుస్తూ చెట్లచుట్టూ కట్టిన ఓ తిన్నెమీద కూర్చొని చూడసాగారు, తని వితీరనట్లు. "రాహుల్ ఈ తోటలో లేని చెట్టేలేదేమో! మావిడి, సపోటా, జామ, కొబ్బరి.. ఓహ్ ఎన్నున్నాయో! ఇంత స్థలం హైద్రాబాద్‌లో వుంటే, ఆకాశానికం టేలా మేడలు కడతారు తప్ప, ఇలా పచ్చ దనానికి ప్రాధాన్యమివ్వరు. నాకు చిన్నప్ప ట్నుండీ ఓ కోరిక.. నాచేత్తో నేను జామ పండు కోసుకుతినాలని" అంటూ అటుగా దారితీసింది. మిగలమగ్గిన పళ్ళని తింటూ కొన్ని తమ గూళ్ళు చేరుకొనే ప్రయత్నంలో అల్లరల్లరి చేస్తోన్న రామచిలుకలు కన్పి స్తూంటే, పరవశంగా పాట దూసుకొచ్చింది మిసిమినోట.

'అనగనగా ఆకాశంవుంది,
ఆకాశంలో మేఘం వుంది
మేఘం వెనుకా రాగం వుంది,
రాగం నింగిని కరిగించింది
కరిగిన నింగి చినుకయ్యింది,
చినుకే చిటపట పాటైంది
చిటపట చినుకే తాకిన నేలా
చిలుకలు వాలిన చెట్టయింది
ఆ చిలుకా నువ్వేకావాలి,
నా రాచిలుక నువ్వేకావాలి'

ఆ పాట వింటూ "అబ్బ, ఎంత బాగా పాడుతున్నావో" అంటూ మిసిమి బుగ్గల మీద చుంబించాడు రాహుల్. కిలకిలా నవ్వింది మిసిమి, అతని మీసాలు బుగ్గ లకి గిలిగింతలు కలిగిస్తూంటే.

అప్పుడే అటుగా వచ్చిన రాజారామ్మోహ న్‌రావ్ చెవిలో ఆ పాటలు నవ్వులూ తేనె లని రంగరించిపోశాయి. ఆ దంపతుల సంతోషం వారి కేరింతల్లో తెలుస్తుంటే, వారిని డిస్టర్బ్ చేయడం దేనికని, గుబురైన పొద వెనుక ఉన్న తిన్నెమీద కూర్చుండి పోయాడు.

"రాహుల్, ఇక్కడెంత ప్రశాంతంగా వుందో కదా. ఈ పిల్లగాలుల పరామర్శలు, పక్షుల కుహూరావాలు, ఓహ్ ప్రకృతి మీద చల్లటివడిలో, లాలిపాట వింటున్న ట్లుగా వుంది కదూ" పరవశంగా అంది మిసిమి.

"నిజమే, మీ వాళ్ళందరి లాలన మరింత అద్భుతంగా వుంది. జీవితమంతా గడి పినా తనివితీరదేమో అన్పిస్తోంది" అన్నాడతను.

"నాకూ అలాగే వుంది గానీ, నాన్నగా రేమో హైద్రాబాద్‌లోనే నీకోసం హాస్పి టల్ కట్టించాలనుకొంటున్నారు. మనిద్ద రం వాళ్ళ కళ్ళ ముందుండాలని అమ్మానా న్నలు ఆశపడ్తున్నారు. మనకోసం ఓ బి ల్డింగ్ కట్టించే ఆలోచనలోనూ ఉన్నారు"

"అక్కడ కొత్తగా బిల్డింగ్ కట్టించే బదులు, ఆ ఖర్చుతో ఇక్కడి బిల్డింగ్ మర మ్మత్తులు చేయిస్తే బాగుంటుందేమో! చక్కటి నగిషీలతో, అందమైన డిజైన్లతో రాజభవనంలా వుందిక్కడి బిల్డింగ్.

మనమే కాదు మనతర్వాత ఈజీగా మరో నాలుగు తరాలవాళ్ళు హాయిగా ఉండొచ్చు. భావితరాలకు ఓ అపురూప మైన బహుమతినిచ్చిన వాళ్ళమవుతాం. నేనైతే ఫ్యూచర్‌లో సంపాదించేదంతా దీనికే వెచ్చించాలనుకొంటున్నాను" అన్నాడు రాహుల్.

"ఇంత అందమైన పరిసరాలను, మరెం తగానో ప్రేమించే ఈ ఆత్మీయులనీ వదిలి ఆంటీ ఎలా వెళ్లిందో?" అంది మిసిమి.

దీర్ఘంగా నిట్టూర్చాడు రాహుల్.

"చిన్నవయసులోనే పెళ్ళి కావడం, సరైన గైడెన్స్ లేకపోవడం, ఆస్తుల విలువ తప్ప, ఆత్మీయుల విలువ తెలియని మా అమ్మమ్మ మాటల ప్రభావంవల్ల ఏది మంచో, ఏది చెడో గ్రహించలేకపోయింది. పొగడ్తలకు పడిపోయే స్వభావం, విషయ అవగాహన లేకపోవడం లాంటి కారణాల వల్ల ఇల్లు దాటి వెళ్లింది. అక్కడికీ క్షమా పణ కోరి తిరిగి వచ్చేద్దామనుకొన్నా, వారీ వీరీ మాటలు విని, భయపడి వెనుకంజ వేయడంతో, ఆమె జీవితం తనకి తెలీకుం డానే చేతుల్లోంచి జారిపోయింది" అన్నాడు బాధగా రాహుల్.

"విధి చేయు వింతలన్నీ, మతిలేని చేత లేనని' అన్నది ఆంటీ విషయంలో పూర్తిగా నిజమైంది. కమ్యూనికేషన్ గ్యాప్ వల్ల దగ్గరకాలేకపోయింది కానీ ఆంటీ ఇప్పుడొ చ్చినా అమ్మమ్మా తాతగార్లు క్షమించి, ఆద రించే మనసున్నవాళ్ళే అనిపిస్తోంది" నమ్మ కంగా అంది మిసిమి.

"నాన్నగారి విశాల హృదయం చూసి నేనూ అదే అనుకొంటున్నాను. ఆయన మనసులో మనం ఇక్కడే ఉండాలన్న ఆకాంక్ష గమనించాను. కానీ నీ మనసులో ఏముందో తెలుసుకోకుండా ఆయనకేం చెప్పగలనని మౌనాన్ని ఆశ్రయించాను" అన్నాడు రాహుల్.

తన ఇష్టానికెంతో ప్రాధాన్యతనివ్వడం మిసిమికి నచ్చింది. గర్వంగానూ అనిపిం

## కొత్తగాలి...

**పిండ ప్రదానానికి**
**కాకి రావడం ఆచారం**
**అదే కాకి ఇంటి ముందు**
**వాలి అరిస్తే అపచారం!**

– పెయ్యాల శ్రీనివాసరావు,
అలికాం, శ్రీకాకుళం జిల్లా

చింది. అంతలోనే 'అతడు తన ఇష్టాయి ష్టాలని మన్నిస్తున్నప్పుడు, తానూ ఆ పని చేయాలిగా. మొన్న రిసెప్షన్‌లో, ఎక్కడెక్క డివాళ్లో వచ్చి తమని తాము పరిచయం చేసుకుంటూ తమ ఆత్మీయతను, అనురా గాన్నీ పంచుతుంటే 'మిసిమీ, ఇప్పుడీ ప్రాంతమంతా చిలుకలువాలిన చెట్టులా నిండుగా, కళకళలాడ్తోంది కదూ' అని అతడనడం గుర్తొచ్చింది.

అప్పుడతని కళ్ళలో ఎంత ఆనందం, మరెంత సంతృప్తి చిందులేశాయో తను గమనించింది. ఇక పరంధామయ్య, సీత మ్మగార్లు సందడంతా తమదేనన్నట్లు తిరు గుతోంటే 'అబ్బో మనవడిని చూసుకోగానే పునఃయవ్వనం వచ్చేసిందే' అని బంధువు లంతా అనడమూ గుర్తొచ్చింది. తాము గనుక ఇక్కడే వుంటే వాళ్ళు పూర్ణాయు ష్షుతో మరింతకాలం తృప్తిగా వుండగలరన డంలో సందేహం లేదు.

మామగారైన రాజారామ్మోహనరావు, తన అతిప్రేమవల్లనే జీవితాన్ని వేదనాభ రితం చేసుకొని మోడులా మిగిలారు. ఆంటీని రప్పించగల్గి, తామూ వారితో ఉంటే, ఆ మంచితనానికి, ప్రేమకీ సార్థకత లభిస్తుంది. తాను ఒప్పుకుంటే, ఇవన్నీ సాధ్యమవుతాయి. కానీ తనెంతకాలంగానో సంగీతం నేర్చుకొని పేరు తెచ్చుకుంటున్న

సమయంలో కెరీర్‌ని వదులుకోవాల్సి వస్తుందే.. ఎలా?' అనుకుంటూ తలెత్తి రాహుల్ వంక చూసింది.

అతని చూపులింకా 'చిలుకలు వాలిన చెట్టు' మీదే వుండటం చూసింది. అంతే, ఓ నిశ్చయానికి వచ్చేసింది.

"రాహుల్, మనిద్దరం ఇక్కడే ఉండి పోదాం" అంది సూటిగా.

చటుక్కున తలతిప్పి ఆమెవంక ఆశ్చ ర్యంగా చూశాడు రాహుల్. వారి మాటలు చెవినబడిన రాజారామ్మోహన్ రావూ అలాగే ఆశ్యర్చచకితుడయ్యాడు.

"నేను మనస్ఫూర్తిగానే చెబుతున్నాను. హైదరాబాద్‌లో చాలా హాస్పిటల్సే వున్నాయి. అదే నువ్విక్కడ డాక్టర్‌గా స్థిర పడితే, మన ఊరికి సేవ చేసినట్లూ అవు తుంది. మనవారితో ఉన్నట్లూ ఉంటుంది. ఈ దేశానికి నీ వంతు సేవ చేసిన తృప్తి నీకూ దక్కుతుంది. ఆ తర్వాత మనం కన్విన్స్ చేసి ఆంటీని పిలిపించుకొస్తే కథ సుఖాంతం" అంది నవ్వుతూ మిసిమి.

రాహుల్ ముఖం సహస్ర సూర్య ప్రభ లనూ నింపుకొంది.

"మిసిమీ, ఇదంతా నిజంగా జరుగుతుం దంటావా? అమ్మ వస్తుందా?" ఆశగా అడిగాడు రాహుల్.

"అసలు కంటే వడ్డీ ముద్దంటారుగా. మనకో పాపో, బాబో పుడితే అప్పుడైనా రాకుండా వుంటారా?" కాస్త సిగ్గుగా అందామె.

"మిసిమీ, నువ్వు.. నువ్వు మనస్ఫూర్తి గానే ఇక్కడుందామంటున్నావా?" నమ్మకం చాలక, సంభ్రమంగా మరోసారి అడిగాడు.

"నిజంగానే, మనస్ఫూర్తిగానే అంటు న్నాను. నాకిక్కడ ఎంతో బావుంది. మనది పుణ్యభూమిగదా, రాముడెక్క డుంటే ఈ సీత అక్కడే" నవ్వుతూ అందామె.

రాహుల్ కళ్ళు ఆనందబాష్పాలతో నిండిపోయాయి.

"అయితే, ఓ చిన్న సంశయం. నేనెంతో మక్కువతో, కష్టపడి నేర్చుకొన్న సంగీతం నిరుపయోగమవుతుందేనన్న ఆలోచన మింగుడు పడటంలేదు" అంది మెల్లగా.

"అలా ఎందుకవుతుంది? నీ ప్రోగ్రా మ్స్‌కి, రికార్డింగ్స్‌కి ఎలాంటి ఆటంకం కల గకుండా నేను జాగ్రత్త వహిస్తాను. నీకోసం ఓ కారు కొనాలనుకున్నాను. ఓ డ్రైవర్‌ని పెట్టుకుంటే సరి.

నీలోని కళని చూసి నీకు దగ్గరైన నేను, ఆ టాలెంట్‌ని ఎలా మరుగుపడని స్తాను?" అన్నాడామెని ఆప్యాయంగా దగ్గ రకి తీసుకుంటూ.

"నీ విషయం సరే. మన పెద్దలకు ఇవన్నీ నచ్చుతాయంటారా? అసలే ఒక ప్పుడు మీ అమ్మగారు, తన కళపట్ల ఉన్న ఆసక్తితోనేగా ఇల్లుదాటి వెళ్లారు? అందు కని అభ్యంతరం చెబుతారేమో?"

"అదీ ఇదీ ఒకటెలా అవుతుంది మిసిమీ? అమ్మకి తగిన మెచ్యూరిటీ లేక అలా చేసింది. నువ్వు పరిణితి చెందినదా నివీ, తెలివైనదానివీ.. నీకెందుకు, వారిని నేను ఒప్పిస్తాగా" ధీమాగా అన్నాడు రాహుల్.

"వాళ్లంతా మనస్ఫూర్తిగా ఒప్పుకుంటేనే. లేకుంటే ఆ విషయం పక్కకి పెట్టేద్దాం" అంది మిసిమి.

"ప్రయత్నించడంలో తప్పులేదుగా, నన్ను ప్రయత్నించనీ" అన్నాడు రాహుల్.

"రాహుల్, నాకెంత సంతోషంగా వుందో తెలుసా?! నా మాటని మన్నిస్తా ననడం ఆ సంగీత కళామతల్లికి పెద్దపీ టను వేయడం లాంటిదే. నువ్వు నాకిచ్చే ఈ అవకాశాన్ని ఎప్పుడూ మిస్‌యూజ్ చేయను. దేవుడిదయవల్ల మనకి భక్తికి లోటులేదు కదా. మంచి పర్పస్‌ల కోసం బెనిఫిట్ షోల లాంటివి మాత్రం అటెండ్

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# ప్రేమ లోతులు చూపిన నవల!




కృష్ణాష్టమి పురస్కరించుకొని చతుర ఆగస్టు సంచికను శ్రీకృష్ణుని ముఖచిత్రంతో వెలువరించడం సందర్భోచితంగా ఉంది. దానికి తోడు ప్రేమ ముడివస్తువుగా గల బంకించంద్ర 'చంద్రశేఖర్' నవల అందించడం బావుంది.

'చంద్రశేఖర్' నవల ప్రేమకు చక్కని నిర్వచనాన్ని చెప్పింది. శైవలిని, ప్రతాప్‌ల ప్రేమ మానసికమైంది. శారీరకంగా కోర్కెలు తీర్చుకోవడమే ప్రేమగా భ్రమిస్తున్న నేటి సమాజానికి ప్రేమ దైవికమనీ, మనసుకు చెందిందనీ, ప్రేమ త్యాగం కోరుతుందనీ నిరూపించే స్థాయిలో ఈ నవల సాగింది. మూల రచయిత బంకించంద్ర, దానిని అనువదించిన ధవ్వూరి శ్రీధరాచార్యులు ఇద్దరూ అఖండులే! చక్కని శైలితో చివరి కంటా చదివించింది.

గంగాతీరంలోని మామిడితోటలో ఓ బాలిక, బాలుడు శైవలిని, ప్రతాప్‌లు.. ఎంత చక్కటి వాతావరణం! ఎంత చక్కని వర్ణన! ఇద్దరికీ ఒకరిపై ఒకరికి ప్రేమ ఆకాశమంత విశాలం.. సముద్రమంత లోతు.. వెన్నెలంత చిక్కన! పదహారేళ్ల నాయకుడు ప్రతాప్, ఎనిమిదేళ్ల నాయకి శైవలిని యథేచ్ఛగా ఈదులాడుతారు. ఆ తరువాత శైవలినికి చంద్రశేఖర్‌తో వివాహమైంది. కానీ ఆమెకు చంద్రశేఖర్‌పై అంత ప్రేమ జనించదు. శైవలినిపై పాస్టర్ కన్నేసి తీసుకెళతాడు. పాస్టర్ ఆమె మనసు మారేంతవరకు వేచి ఉండాలనుకుంటాడు. సుందరి ఆమెను తిరిగి ఇంటికి రమ్మని కోరుతుంది. ఒకసారి గడప దాటాక మళ్లీ భర్త వద్దకు రావడం శైవలినికి రుచించదు. 'ఒట్టుపెట్టి చెబుతాను ఇంతవరకు ఆ తెల్లదొర నా ముఖం చూడలేదు. కానీ ఇప్పుడు నేను వెళ్లాక నన్నేలుకుంటే నా స్వామి జాతిభ్రష్టుడు కాడా?' అనేది ఆమె తపన.

అవ్యాజమైన ప్రేమకు నిర్వచనం ఈ నవల. 'గంగామాతా నన్ను నీ ఒడిలోకి తీసుకో!' అంటూ శైవలిని నదిలోకి దూకేయడం, ప్రతాప్‌రాయ్ కూడా దూకేయడం ఇద్దరూ గంగానదిలో ఈదడం.. చిన్నప్పటిలాగానే వారి మధ్య ప్రేమ నిష్కలంకమైందని చక్కగా చిత్రీకరించారు. తానుంటే ఆమె సుఖపడదని గ్రహించి ప్రతాప్‌రాయ్ యుద్ధరంగంలో వీరమరణం పొందుతాడు. ప్రేమ లోతులను చెప్పడంలో ఈ నవలకు మరోటి సాటిరాదని కచ్చితంగా చెప్పొచ్చు. ఇంత చక్కని నవల అందించిన 'చతుర' సంపాదకవర్గానికి కృతజ్ఞతలు!



స్త్రీని ఏవైపు నుంచి చూసినా అందమే కనబడుతుందని సూత్రీకరించిన తెనాలి రామకృష్ణుని పద్యం చమత్ 'కారం'లో మరీమరీ చదివించింది. ఈ శీర్షిక చక్కని రీఛార్జింగ్‌లా పనిచేస్తోంది.

**– యం. జఫరుల్లాఖాన్,**
మహబూబ్‌నగర్

చేస్తాను. కుటుంబ జీవితానికే నా మొదటి ప్రాధాన్యత" అంది మిసిమి.

"మంచి ప్లానింగ్, ఆలోచనలతో ఉండే నిన్ను చూస్తే గర్వంగా ఉంది"

"కానీ, నా కోసం ఆంటీని నువ్వు వదిలి వచ్చేశావన్నది గుర్తుకొస్తుంటే నాకు ఎంతో గిల్టీగా వుంది"

"ఏది జరిగినా మన మంచికే అంటారుగా. నేనిలా రావడం మంచే చేస్తుందేమో. మన పెళ్ళి దృశ్యాల్ని, మన వారం దర్నీ చూసిన అమ్మ తన మనసు మార్చుకోకుండా వుంటుందా?" అన్నాడు ఆశగా రాహుల్.

"అవును అలా జరిగితే, నా గిల్టీఫీలింగ్ మాయమవుతుంది. అంతా మంచే జరుగుతుందని ఆశిద్దాం. ఆల్ ఈజ్ వెల్" అని నవ్వుకుంటూ, ఒకరి చేతిలో ఒకరు చేయి కలుపుకొని కదిలారు.

వారి మాటలు ఆలకించిన రాజారామ్మోహన్‌రావ్ ఆ రాత్రంతా ఆలోచించాడు. పొద్దుటే తల్లిదండ్రులతో తన ఆలోచనలని పంచుకుంటూ, వారి సలహా అడిగాడు.

తమ పెద్దరికాన్ని మన్నిస్తూ, అతడలా అడగడం వారికెంతో తృప్తినిచ్చింది.

"రాజా, నువ్వేం చేసినా ఆలోచించే చేస్తావు. మా జీవిత చరమాంకం మీ అందరి సమక్షంలో ముగియడమే మాక్కావలసింది" అన్నారు వాళ్ళు.

తర్వాత మిసిమి, రాహుల్‌లను పిలిపించాడు రాజారామ్మోహన్‌రావ్. వాళ్ళొచ్చి కూర్చున్న తర్వాత "రాహుల్, మీ ఫ్యూచర్ ప్లాన్స్ ఏంటి?" అనడిగాడు ఉపోద్ఘాతంగా.

"పుట్టినగడ్డ ఋణం తీర్చుకొంటూ, మీ అందరితో కలిసి ఉండాలనుకొంటున్నాం" సూటిగా చెప్పేశాడు రాహుల్.

"మన ఊరి నడిబొడ్డున ఆరు పాత ఇళ్లున్నాయి. వాటిని తీసేసి అన్ని హంగులు, సౌకర్యాలతో హాస్పిటల్ కట్టిద్దాం. నీ కోరికా తీరుతుంది. మన ఊరికో మల్టీ స్పెషాలిటీ హాస్పిటలూ దొరుకుతుంది. మీ మావగారిది రియల్ ఎస్టేట్ బిజినెస్ కదా! ఎన్నో అపార్ట్‌మెంట్స్ కట్టించారు కాబట్టి ఆయన సలహాలు తీసుకో. అలాగే రాఘవగారితో మాట్లాడి హాస్పిటల్‌కి కావలసిన ఎక్విప్‌మెంట్ తెప్పించుకో. ఇదుగో చెక్ బుక్. నీకెంత కావాలంటే అంత డ్రా చేసుకో" అంటూ చెక్‌బుక్ ఇవ్వబోయాడు రాజారామ్మోహన్.

"నాన్నా నా దగ్గర డబ్బుంది. అవసరమైతే మిమ్మల్నడుగుతాను" అంటూ సున్నితంగా తిరస్కరించాడు రాహుల్.

"ఆ.. మరోమాట. మన తోటలోనూ ఓ బిల్డింగ్ కట్టాలనుకొంటున్నా, నా కోడలి కోసం. ఆమె అందులో మ్యూజిక్ స్కూల్ ప్రారంభిస్తే, ఇక్కడి పిల్లలు సంగీతాన్ని నేర్చుకొంటారు.

ఫ్రీగా చెబుతావో, నామినల్ ఫీజులు వసూలు చేస్తావో, అంతా నీ ఇష్టం" అన్నాడాయన మిసిమిని చూస్తూ.

మిసిమికి ఆనందంతో నోటమాట రాలేదు. మ్యూజిక్ కాలేజ్‌ని పెట్టాలన్నది ఆమె అంతరంగంలో దాచుకొన్న బంగారు కల. ముందు కెరీర్‌లో నిలదొక్కుకొని తర్వాత ఆ స్కూల్ గురించి ఆలోచించాలనుకొంది. ఆ మహదవకాశం ఇప్పుడే ఆమెకు లభించేసరికి సంభ్రమంగా రాహుల్ వంక చూసింది.

ఆమె ముఖంలో చిందులేస్తోన్న ఆనందం, ఎగ్జయిట్‌మెంట్ రాహుల్‌కే గాక అక్కడున్న అందరికీ కన్పించింది.

"మావయ్యగారూ, అన్ని దానాల్లోకి విద్యాదానం ఉత్కృష్టమైంది. పదిమందికి విద్య నేర్పే సువర్ణావకాశం మీరిస్తానంటుంటే అంతకన్నా ఏం కావాలి? అయితే 'ఫ్రీ'గా అంటే కొందరికి తేలిగ్గా అన్పిస్తుంది. కాబట్టి విద్యార్థులను బట్టి ఫీజు నిర్ణయిద్దాం.

పల్లెటూరివాళ్లకేదీ తెలియదన్న అపోహ చాలామందికి ఉంటుంది. వాళ్లు కేవలం తమ స్వప్రయోజనాలని, స్వార్థాన్ని మాత్రమే చూసుకొంటారనుకొంటారు. ఆ భావం తప్పని, నమ్రతక్క, విశాల్‌లు తమ ఊరిని అభివృద్ధి చేయడంద్వారా, రాఘవన్నయ్యకి తమ సహకారాన్ని అందించడం ద్వారా చెప్పకనే చెప్పారు. ఇప్పుడు, మీ మాటల్ని వింటోంటే, పల్లెటూరివాళ్లే చక్కగా ఆలోచించగలరని, విశాల హృదయంతో ఉంటారనీ తెలుస్తోంది. అందులోనూ ఫలాపేక్ష లేకుండా ఇంతపెద్ద పనికి ముందుకొస్తున్నారంటే, మీలాంటి వాళ్లని చూసి డబ్బు, కీర్తి కోసం పాకులాడేవాళ్లు తలదించుకోవాలి" అంది మిసిమి ఉద్వేగంగా.

"పదిమందికి సహాయం చేసేందుకు నువ్వు బెనిఫిట్ షోలిస్తావని తెల్సింది. ఇంత చిన్నదానివి నీకే అంత పరోపకార చింతన ఉంటే, మాకీ మాత్రం ఉండొద్దా? ఎటొచ్చీ మొదట నీ ఇంటికి ప్రాధాన్యత నిచ్చి, తర్వాత అలాంటివి చేస్తే మా అందరికీ ఎంతో సంతోషంగా ఉంటుంది" అన్నాడు రాజారామ్మోహనరావు.

తన మనసులోది స్పష్టంగా చెప్పిన మామగారిని ఆరాధనగా చూస్తూ "ఇంతటి విశాల భావాలు, సహృదయతా ఉన్న వారింటి కోడలిని కావటం నా పూర్వజన్మ సుకృతం" సిన్సియర్‌గా అంది మిసిమి.

ఆ మాటలకు అందరి వదనాలు, సంతోషాన్ని నింపుకొన్నాయి.

★ ★ ★

రాహుల్, మిసిమిలు తాము తీసుకొన్న నిర్ణయం గురించి తమ వారికి తెలిపారు.

"మేం రఘునాథపురాన్ని దత్తత తీసుకొని అభివృద్ధి చేసినట్లు మీరు ఆదిత్యపురాన్ని అన్నివిధాలా బాగు చేస్తామంటే, ఎంతో ఆనందంగా ఉంది. మీకెలాంటి సహాయం కావాలన్నా చేయడానికి రెడీ" అంటూ నమ్రత, విశాల్, రాధ తమ శుభాశీస్సులను, శుభాకాంక్షలు తెలిపారు.

**కొత్తగాలి...**

**బైకులపై కుర్రకారు**
**రోడ్లపై భలేహుషారు**
**తల్లిదండ్రుల బేజారు**
**ప్రమాదంతో ఇకలేరు!**

– బండ్ల సుబ్రహ్మణ్యం,
మంగళగిరి, గుంటూరు జిల్లా

రాఘవ కూడా "నా బాటలో నువ్వు నడుస్తాననడం ఎంతో ఆనందాన్నిస్తోంది. నా సహకారం తప్పక అందిస్తాను. అంతే కాదు, స్వీటీకి మెడిసిన్ చేయాలని ఉందె లాగు. అది డాక్టర్ కాగానే నీ దగ్గరకే పంపిస్తాను" అన్నాడు.

"స్వీటీ మీ వారసురాలిగా ఆ ఊరికి వస్తుంది గానీ ఇక్కడికి వస్తుందేంటి?" అన్నాడు రాహుల్ నవ్వుతూ.

"పూర్తి నిర్ణయం స్వీటీదే. తనకి మీరంటే ఇష్టం కాబట్టి అలా అన్నాను. రెండూళ్లలోనూ తన సేవలను అందిస్తానన్నా నాకు సమ్మతమే!" అన్నాడు రాఘవ.

తర్వాత మిసిమి తల్లితో మాట్లాడింది.

"అదేంటి? మీరిద్దరూ మా కళ్లముందే ఉండాలని మనింటి ఎదురుగానే మీరుండేలా బిల్డింగ్ కట్టించమని మీ నాన్నకి చెబుతూంటే ఇదేం నిర్ణయమే? ఆ పల్లెటూర్లో ఏ అవకాశాలు వస్తాయని? మీ ఇద్దరి బంగారు భవిష్యత్తు గురించి ఆలోచించు" అంది శర్వాణి, కాస్త కినుకగా.

"అమ్మా, పెళ్లయ్యాక భర్త ఎక్కడుంటే, భార్య అక్కడుండాలి కదా. అయినా అక్కడికన్నా, ఇక్కడే నాకు తృప్తిగా ఉంటుంది. ఇక పేరు ప్రఖ్యాతులంటావా? అవి

టాలెంట్ ఎక్కడుంటే, అక్కడికి కాస్త వెనకో ముందో రాకపోవు.

నేను అక్కడున్నా మ్యూజిక్ స్కూల్ ఏర్పాటు చేసుకోగలిగేదాన్నో, కాదో? కానీ అదిక్కడ సాధ్యపడ్తోంది. నాన్న, నువ్వూ మమ్మల్ని మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తే చాలమ్మా. అయినా మనమధ్య దూరమెంతని? కార్లో వస్తే రెండు గంటలేగా" అంటూ తల్లికి నచ్చజెప్పింది మిసిమి.

★ ★ ★

"ఇవాళ నా చేతివంట మీకు రుచి చూపిస్తాను" అంటూ వంటింట్లోకెళ్లింది మిసిమి.

"చిన్న పిల్లవి, నీకెందుకమ్మా శ్రమ? అయినా ఏవి ఎక్కడున్నాయో నీకెలా తెలుస్తుంది? " అంటూ వారించబోయారు సీతమ్మగారు.

"ఇందులో శ్రమ ఏముంది? ఈ వయసులో మీరు కష్టపడ్తానంటారేం? కావాలంటే వంటింట్లో ఓ కుర్చీ వేస్తాను. అందులో కూర్చొని ఏది ఎక్కడుందో చెప్పు అమ్మమ్మా. నాకు చిన్నప్పట్నుండీ వంటన్నా, పదిమందికి వాటి రుచి చూపించడమన్నా చాలా ఇష్టం. ఇంతకీ మీరు కాస్త ఉప్పూకారాలు తగ్గించేగా తినేది? " అంటూ కుర్చీ తెచ్చి వేసింది.

రెండు గంటల్లో మొత్తం వంటంతా చకచకా చేసేసి, డైనింగ్ టేబుల్ మీద అమర్చింది మిసిమి.

"మునక్కాడ సాంబారు, తోటకూర పప్పు, బెండకాయ వేపుడు, టమాటా పచ్చడి, వంకాయ అల్లంకూర.. అబ్బో, చాలా చేశావే? " మెచ్చుకొంటూ అన్నాడు రాజారామ్మోహనరావు.

"మనవడికి ఇష్టమంటూ పూరీలు, బంగాళదుంప కుర్మాగూడా చేసిందిరా" నవ్వుతూ అన్నారు సీతమ్మగారు.

"మరి స్వీటేం చేయలేదా? " నవ్వుతూ అడిగారు పరంధామయ్యగారు.

"సేమ్యా పాయసం చేశా తాతయ్యా" అంటూ అందించింది మిసిమి.

"వంటలన్నీ అద్భుతంగా ఉన్నాయి" అన్నారంతా.

"మందులూ, ఎరువులూ వేయకుండా, మన పెరట్లో పెంచిన కూరగాయలు కావడంవల్లే అంత బాగా చేయగలిగానేమో" అంది మిసిమి.

అంత చదువుకొన్నా, సంగీత సరస్వతి అయినా, ఏమాత్రం భేషజం లేకుండా, తమతో కలసిపోయిన మిసిమిని చూస్తే వారంతా గొప్ప పెన్నిధి దొరికినట్లు భావించారు. భోజనాలయ్యాక, సరదాగా కబుర్లు చెప్పుకొంటూ కూర్చున్నారు.

ఇంతలో రాధ దగ్గర్నుండి ఫోన్ వచ్చింది.

"గత ఐదేళ్ళుగా గ్రామాల్లో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను పరిశీలించి, అన్నింటా అభివృద్ధి చెందిన గ్రామాన్ని 'ఉత్తమ గ్రామం'గా ప్రకటించి అవార్డునందించే కార్యక్రమాన్ని రాష్ట్రప్రభుత్వం ఇటీవల చేపట్టింది కదా.. ఆ అవార్డ్ ఈసారి మా రఘునాథపురానికి వచ్చింది. ఇందుకు కారకులైనవారిని సత్కరిస్తోంది. మన విశాల్, మరికొందరు ఆ సత్కారానికి ఎన్నికయ్యారు" అంటూ రాధ చెప్పడంతో అందరికీ ఎంతో ఆనందం కల్గింది.

"వాళ్ళలా మనమూ కృషి చేసి అలాంటి అవార్డ్‌ని గెలుచుకునేలా, మంచి టీమ్‌ని ఏర్పాటు చేయాలి" అన్నాడు రాహుల్.

"నువ్వు హాస్పిటల్ విషయం చూసుకో, ఆ బాధ్యత నామీద వదిలేయ్" అన్నాడు రాజారామ్మోహనరావు.

తండ్రి ఉత్సాహం చూస్తే, రాహుల్‌కి ముచ్చటగా అన్పించింది. ఇలాంటి మనిషికి అండదండగా అర్థం చేసుకొనే భార్య తోడుంటే మరెన్ని విజయాలు సాధించేవాడో కదా అనుకున్నాడు.

'అమ్మతో మాట్లాడాలి.. ఆమె విసు

క్కున్నా లెక్కచేయకుండా పదేపదే చెప్పి ఇక్కడికొచ్చేలా ఒప్పించాలి. తండ్రి గరళ కంఠుడిలా తల్లి తప్పును తనలోనే దాచు కున్నాడు, ఆ నేరాన్ని తనమీదేసుకొని.. తల్లిగురించి ఎవరూ ఏమీ అనకుండా చూసుకున్న సంగతి అమ్మకి వివరంగా చెప్పాలి' అనుకొన్నాడు.




"రాధమ్మా, రాధమ్మా" అంటూ వచ్చింది దుర్గ. ఆమె రాఘవ ఇంట్లో పని చేస్తుంటుంది.

"ఏంటంత కంగారుగా ఉన్నావ్, ఏమైంది? " అడిగింది రాధ.

"నిన్నటినుండీ డాక్టరుబాబుకి జ్వరం. పొద్దున వెళ్ళేసరికి పాపం జ్వరంతో మూల్గుతున్నారు. టీ అడిగితే ఇచ్చాను కానీ తాగగానే వాంతి చేసుకున్నారు. వంట చేయొద్దంటే వచ్చేశాను గానీ మన సులో ఎలాగో వుంది. నీతో ఓ మాట చెప్పి పోదామని వచ్చాను" అని చెప్పి కది లిందామె.

రాధకు బాధ కల్గింది. 'ఈమధ్య ప్రజల్లో అవగాహన కల్గించేందుకు చుట్టుపక్క లున్న గ్రామాలకు అతడు వెళ్ళడం తెలు సామెకి. ఆ ఊళ్ళలో ఏం తిన్నాడో, తాగాడో? పరిశుభ్రతలేని నీళ్ళవల్ల ముందుగా పాడయ్యేది ఆరోగ్యం. అసలే యంత్రంలా రాత్రీపగలూ పని చేస్తాడాయె' అనుకొంటూ ఎక్కడిపని అక్కడ వదిలేసి వెళ్ళింది.

వెళ్ళేటప్పటికి రాఘవ స్నానంచేసి బయ టకు వస్తూ కన్పించాడు. టవల్ చుట్టు కొని వచ్చిన అతను, అకస్మాత్తుగా వచ్చిన రాధను చూసి కంగారుపడి ఒక్కంగలో బెడ్రూమ్‌లోకి వెళ్ళి డ్రెస్సయి వచ్చాడు. నీరసంతో ముఖం పీక్కుపోయి ఉన్న అత డిని చూస్తే రాధ కళ్ళలో నీళ్ళుతిరగ్గా "ఎలా ఉంది? నీకు ఒంట్లో బాగాలేదని దుర్గ చెప్పింది" అంది.

"ఏదో చిన్నపాటి జ్వరం, అంతే"

"అదేంటి బావా, నీకు జ్వరం రావడ మేంటి? "

"ఏం? నేను మనిషిని కానా? " అంటూ నవ్వాడతను.

"కాదన్నానా? ఇంకా జ్వరం పూర్తిగా తగ్గనేలేదు, ఇప్పుడు హాస్పిటల్‌కి వెళ్ళి పేషెంట్స్‌ని చూస్తావా? "

రాఘవ మేడమీద ఉంటూ కింది పోర్షన్ హాస్పిటల్‌కి కేటాయించాడు. అక్కడ జనం బారులుతీరి వుండటాన్ని, పైకి వెడుతూ చూడనే చూసింది రాధ.

"పాపం, వాళ్ళెంతో దూరంనుండి వచ్చి ఉంటారు గదా"

"నిజమేగానీ, చూసే ఓపికుందా? బాగా నీరసంగా కన్పిస్తున్నావ్? " ఆదుర్దాగా అంది రాధ.

ఆమె మాటల్లో తొణికిసలాడుతోన్న బాధని గమనించిన రాఘవ ఆమెవంక పరీక్షగా చూసి నవ్వాడు.

తన మనసులోకి తొంగిచూసినట్లుగా అన్పించిన రాధ సిగ్గుపడింది.

ఎప్పుడూ ఊరివిషయాలే కనుక అంద రితో మాట్లాడినట్లే అతనితోనూ మాట్లాడు తుంది రాధ. బంధువులే అయినా పర్స నల్ విషయాలు అంతగా రావు, ఒక్క ధాత్రి విషయం తప్ప. అతను సిఫార్సు చేసిన డాక్టర్ల దగ్గర ధాత్రికి వైద్యం చేయిం చడంవల్ల, ఇప్పుడిప్పుడే ధాత్రి మామూ

## కొత్తగాలి...

**సుఖం**
**కట్టలతో వస్తుంది!**
**దుఃఖం**
**కట్టలు తెంచుకుంటుంది!**

*– జి.జి.కె. రావు,*
*అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా*

లుగా నడవగల్గుతోంది. జన్మలో ఇక ధాత్రి నడవదనుకున్న రాధకది మహాద్భుతం. అలా ధాత్రి నడవడానికి కారణమైన రాఘవపట్ల ప్రత్యేకాభిమానం మొదలైనా, మనసులోనే దాచుకుంది.

ఒకట్రెండుసార్లు నమ్రత, మేలమాడినా 'అదంతా కృతజ్ఞత తప్ప మరేం కాదని' బుకాయించేసింది.

"ఏంటలా చూస్తావ్? డాక్టర్‌కే అనారోగ్యం అంటే పేషెంట్స్‌కి నీమీద ఎలా నమ్మకం కుదుర్తుంది? ఇవాళ్టికి ఆ పని మరో డాక్టర్‌కి అప్పజెప్పు" అంటూ సెల్ అందించింది, 'వెంటనే చెప్పు' అన్నట్లు.

తన పరిస్థితి తనకి తెలుస్తోంది కాబట్టి, తప్పక, ఆమె చెప్పినట్లే చేశాడు.

ఈలోగా రాధ కిచెన్‌లోకి వెళ్ళి పాలు కాచి, పంచదారవేసి పట్టుకొచ్చింది. వస్తూ వస్తూ తను తెచ్చిన బ్రెడ్‌లోంచి నాలుగు స్లైస్‌లు ప్లేట్లోపెట్టి, అతని ముందుంచింది.

"ఇవి తింటే కాస్త శక్తి వస్తుంది. కళ్ళెంత లోతుకుపోయాయో తెలుసా? నమ్రతా, విశాల్‌లు ఊళ్ళో లేకపోతేనేం? నేనింకా బతికే ఉన్నాగా. నాకో కబురు చేస్తే నిన్ననే వచ్చేదాన్నిగా. ఇందరికోసం తపించే నువ్వు అలా ఒంటరిగా పడి ఉన్నావని తల్చుకుంటే మనసెలాగో అయిపోతోంది" అంటూ అతడు బ్రెడ్ తినేదాకా వదల్లేదు.

ఆమె తనకోసం పడుతున్న బాధ మాటాడిన అక్షరమక్షరంలో తెలుస్తూంటే, జూలీ అలా ఏనాడూ స్పందించలేదన్నది గుర్తొచ్చింది. రాధ పరామర్శ, ఆమె చేసిన ఆ చిన్న సేవ ఎంతో తీయగా తోచి, మనసుకెంతో సాంత్వననిచ్చింది.

"కాస్త అన్నం వండి మిరియాలచారు చేస్తాను, ఓ గంట తర్వాత తిను, సరేనా" అంటూ అతడి జవాబుకోసం చూడకుండా వంటింట్లోకి వెళ్ళింది.

"లంఖణం పరమౌషధం అంటారుగా, నాకోసం ఏమి చేయకు, అంతగా అయితే దుర్గతో చేయించుకుంటాలే"

అన్నాడు రాఘవ, ఆమెకెందుకు శ్రమనుకొంటూ.

"ఏం, నేను దుర్గపాటి కాకపోయానా? లేక నా వంటంటే భయమా? " అంది చిరుకోపంగా.

"మగరాయుడిలా తిరిగే నీకు వంట వస్తుందంటే అనుమానమే" నవ్వుతూ అన్నాడు.

"నీ అనుమానం తీర్చడానికైనా వంట చేసి తీరతాను" అంటూ వంట మొదలెట్టింది రాధ.

అన్నం, చారూ చేసి, నాలుకకి హితవుగా వుంటుందని పుదీనా పచ్చడి, దొండకాయ వేపుడూ చేసింది చకచకా. వెల్లుల్లి వేసి చేసిన చారు మసలుతూంటే, కమ్మటి వాసన ఇల్లంతా కమ్ముకొనేసరికి, ఆకలేసింది రాఘవకి.

"అన్నం పెట్టేయ్ రాధా, నీ తాలింపు ఘుమాయింపుకి ఆకలేస్తోంది" అన్నాడు.

"నిజంగానా? " అంటూ చిన్నపిల్లలా సంబరపడుతూ అన్నం వడ్డించింది.

"నాతోబాటు నువ్వూ తింటేనే తింటాను" అన్నాడు.

"ఎందుకులే బావా, నేను తర్వాత తింటాగా" అంది ఇబ్బందిగా.

"అంటే నీ వంటమీద నీకే నమ్మకం

లేదన్నమాట, అయితే ఒక పని చెయ్. నువ్వు తింటూ, నాకో ముద్దపెడుతూ వుండు" అన్నాడు చిలిపిగా.

ఆ మాటలకు ఒళ్ళంతా ఝల్లుమంది రాధకు. ముఖంలో సిగ్గును కన్పించనీయ కుండా, "అయితే ఓపిక లేదంటావ్, తినడా నిక్కూడా" అంటూ అన్నం కలిపి, ముద్ద లుగా అందించిందతని నోటికి.

రాఘవకి ఆ ఆనందం శాశ్వతం చేసుకో వాలన్పించింది.

"రాధా, ఒకప్పుడు మీ నాన్న సంబంధం గురించి మాట్లాడబోతే, చదువులేని అమ్మా యిని చేసుకోలేను అన్నాను. అలా అని నీలాంటి ఆణిముత్యాన్ని జారవిడుచుకొన్నా నని నాకప్పుడు తెలీదు. ఈమధ్య విశాల్ పెళ్ళి ప్రస్తావన తెచ్చినా 'ఒకసారి ఆమెను హర్ట్‌చేసిన నన్ను తను చేసుకోదేమోలే' అంటూ తోసిపుచ్చాను. ధాత్రితో సమా నంగా స్వీటీని నువ్వు అభిమానించడం గమనించి అమ్మగూడా 'రాధను చేసుకోరా, అందరమూ సుఖంగా వుంటాం' అంది ఎన్నోసార్లు. కానీ నువ్వేమో ధాత్రి, ఈ ఊరూ తప్ప మరేమీ అక్కర్లేదన్నట్లుగా వుంటే, అడగలేకపోయాను. కానీ ఈరోజు నీ కళ్ళలో నాపట్ల వున్న ప్రేమని గమనిం చగలిగాను. అది నిజమైందే అనుకొంటు న్నాను. ఇప్పుడు చెప్పు, నాతో జీవితం పంచుకోగలవా? " ఆమె కళ్ళలోకి చూస్తూ అడిగాడు.

రాధ నమ్మలేనట్లు చూసి "బావా, బాగా ఆలోచించే ఈ నిర్ణయం తీసుకొంటు న్నావా? " అంది స్పష్టంగా.

"ఆహా, ఎంతో ఆలోచించే అంటు న్నాను. నన్ను పెళ్ళి చేసుకోవటం నీకి ష్టమో లేదో తేల్చి చెప్పు. ఇప్పుడే చెప్ప లేనూ అంటే టైమ్ తీసుకొని ఆలోచించే చెప్పు" అన్నాడు మెల్లగా.

'భార్య లేక అతను, భర్త లేక తను ఎంతో వెలితిని అనుభవిస్తున్నారు. జీవిత భాగస్వామి విలువేంటో తెలిసినవాళ్ళే

## కొత్తగాలి...

**మనసుకి**
**మరణముంటుంది**
**మరణానికి**
**మనసుండదు**

– డి. శ్రీనివాసదీక్షితులు,
నరసరావు పేట, గుంటూరు జిల్లా

తామిద్దరూ. ధాత్రి విషయంలో కన్నతం డ్రిలా స్పందించిన ఇతడిని తాను పెళ్ళి చేసుకొంటే, ధాత్రికి 'తండ్రిని' అందించినద వుతుంది. అలాగే తల్లిలేని స్వీటీకీ తల్లిప్రే మని అందించగల్గుతుంది. వృద్ధాప్యంలో ఉన్న ఇంద్రాణత్తకు ఆసరా ఇవ్వగలుగు తుంది' అనుకొంది.

"సరే బావా, మనిద్దరం పెళ్ళి చేసు కొందాం" అంది, సిగ్గుతో ఎర్రబడిన ముఖాన్ని చేతుల్లో దాచుకుంటూ.

"ఇప్పుడే, ఈ వార్తను నమ్రతకు చెప్పాలి. తను చాలా హ్యాపీగా ఫీలవు తుంది" అన్నాడు రాఘవ.

"అలాగే అత్తయ్యాకి కూడా.. అహహ, ఫోన్‌లో వద్దు నువ్వే వెళ్ళి చెబితే బాగుం టుంది" చిరుసిగ్గుతో అంది రాధ.

రాఘవ ఫోన్ చేయగానే, విశాల్ లిఫ్ట్ చేశాడు. రాఘవ చెప్పింది వింటూనే "చాలా మంచి శుభవార్త చెప్పావ్. మా కొత్తింటి పని పక్కన పెట్టేసి, మీ పెళ్ళి పనులమీద దృష్టి పెడతాం" అన్నాడు.

"కొత్తింటి పనినెందుకు ఆపడం? మేం పెళ్ళిని సింపుల్‌గా ప్లాన్ చేయాలనుకొం టున్నాం. మా పెళ్ళి, మీ గృహప్రవేశం ఒక్కసారే కాకుండా చూసుకొంటే రెండు ఫంక్షన్స్‌నీ మనవాళ్ళంతా అటెండ్ చేయగ లుగుతారు" అన్నాడు రాఘవ.



# అనుక్షణం గిరిజన పక్షం!

ఆమె మహా రచయిత్రి
తాలూతప్పా మురికి, మలినం లేని శ్వేతవర్ణ రచనలవి
అన్యాయం, అక్రమాలపై కాళికాదేవిలా
విరుచుకుపడేదావిడ
అర్థమైంది కదూ.. ఆ అపురూప వ్యక్తి
మహాశ్వేతాదేవని!
అక్షరాల అస్త్రాలతో అక్రమాల్ని సవాల్ చేశారామె
కేవలం రాస్తే సరిపోదని ఆదివాసీలతో కలిసి జీవించారు
వారి క్షేమంకోసం అహరహం పోరాడారు అధ్యాపకురాలిగా, జర్నలిస్టుగా,
రచయిత్రిగా సమాజసేవకే అంకితమయ్యారు
సంచారజాతుల అంతులేని దుఃఖాన్ని, ఆదివాసీల దీనస్థితిని
అక్షరాలతో చెక్కి మనసు మూగబోయేలా చేశారు
అగ్రకులాల ఆధిపత్యం, భూస్వాముల దోపిడీపై కొరడా ఝళిపించారు
మహాశ్వేతకు వ్యక్తిగత జీవితం లేదు
అట్టడుగువర్గాలే తన కుటుంబమనుకున్నారు
వారికోసమే అనుక్షణం తపించారు
అడ్డంకుల్ని, అవరోధాల్ని లక్ష్యపెట్టక
మేరునగంలా నిలబడ్డారు
'అరణ్యేర్ అధికార్', 'అగ్నిగర్భ', 'బిట్టర్ సాయిల్' - ఆమె రచనలన్నీ అపురూపాలే
'సంఘర్ష్', 'రుడాలి', 'హజార్ చౌరాసీ కీ మా' - లాంటి చిత్రాలన్నీ ఆణిముత్యాలే
పద్మవిభూషణ్, పద్మశ్రీ, జ్ఞానపీఠ్, రామన్ మెగసెసే, బెంగాలీభూషణ్
లాంటి పురస్కారాలన్నీ ఆమె ఘనతకు దర్పణాలే
మహాశ్వేత భౌతికంగా లేకుంటేనేం
ఆమె అక్షరాలకు క్షయం లేదు
ఆ రచనలు అంధకారంలో విప్లవజ్యోతులు
అవి రేపటి తరాలకు మేల్కొలుపులు.. మార్గదర్శనాలు!

*(జులై 28న పరమపదించిన మహాశ్వేతాదేవికి చతుర / విపుల అక్షర నివాళి)*

"నిన్ననే మిసిమి ఫోన్ చేసింది. రాహుల్ మీతో అన్ని విషయాలూ చెప్పాడట గదా" అన్నాడు విశాల్.

"అవును! చెప్పాడు తను ఆదిత్యపురంలో కట్టబోయే హాస్పిటల్ నిర్మాణంలో నా సహాయం కావాలని. మా పెళ్ళి, మీ గృహ ప్రవేశం రెండూ ఈ రెండుమూడు నెలల్లో జరిగిపోయేలా చూసుకొంటే, మనిద్దరం వారికి సహాయం అందించొచ్చు" అన్నాడు రాఘవ.

"ఎన్నారైలూ, ఇక్కడి యువకులూ నడుంబిగిస్తే మన పల్లెటూళ్ళు కళకళలాడిపోవూ? పల్లెటూళ్ళు అభివృద్ధి చెందితేనే గ్రామాలు, నగరాలు, రాష్ట్రాలు తద్వారా దేశం మొత్తం అభివృద్ధి చెందే అవకాశం వుంటుంది. ఏ గమ్యం చేరాలన్నా ఎవరో ఒకరు ముందుకు అడుగు వేయాల్సిందేగా. అది మనం వేస్తున్నామనుకొంటే సరి" నమ్మకంగా అన్నాడు విశాల్.

★ ★ ★

ఆరోజు రాత్రి భోజనాలు కాగానే మిసిమి, రాహుల్ రోజీతో ఫోన్లో

మాటలు మొదలుపెట్టారు.

"అమ్మా, మా పెళ్ళి దృశ్యాలన్నీ చూశావుగా? ఎలా అన్పించింది? "

"చాలా ఆనందం కల్గింది. నేనూ అక్కడుండి వుంటే ఎంత బావుండేదో అన్పించిన మాట నిజం. కానీ ఏ ముఖం పెట్టుకొని వాళ్ళ ఎదుట పడగలను? నేనొస్తే అంతా నా గురించే చెవులు కొరుక్కొనేవారు. నేను రాకపోవడమే నయమైందిలే" అంది రోజీ.

"అమ్మా, మనం చాలా అదృష్టవంతులమమ్మా. అందుకే అంతటి క్షమామూర్తులు దొరికారు. అందరూ నీ రాకకోసం ఎదురుచూస్తున్నారు. అందరికీ నీమీద సింపతీ, ప్రేమ వుండేలా నాన్నగారు చేశారు తెలుసా? తను చెడ్డయినా ఫర్వాలేదని, తప్పంతా తనమీదే వేసుకొన్నారు. నాన్నగార్కైతే నిన్నెప్పుడెప్పుడు చూడాలా అని ఉంది.

మీ పెళ్ళయిన కొత్తలో నీకోసం మల్లె, సన్నజాజి వేశారట, వాటికి ఎప్పటికప్పుడు అంటుకడుతూ వాటిని ఇప్పటివరకూ నీ కోసం సంరక్షిస్తున్నారంటే.. ఆయనకెంత నమ్మకమో చూడు, నువ్వు తిరిగొస్తావని.. ఆ మొక్కలనుండి ఎవర్నీ పూలు కోయనివ్వక 'అవి మా అమ్ములివి' అంటారట.. మొన్నొకసారి, ఆయనేమంటారో చూద్దామని మిసిమి ఆ సన్నజాజి తీగెనుండి పూలు కోసుకొంటానని అడిగితే, తోట నుండి బుట్టెడు పూలు తెప్పించి ఇచ్చారు గానీ, నీకోసం పెంచే ఆ తీగెలనుండి తెంపి ఇవ్వలేదంటే అర్థం చేసుకో" అన్నాడు రాహుల్.

"నేను ఆయన ప్రేమకు అర్హురాలిని కాదురా. పూజకి పనికిరాని పువ్వునయ్యాను" అంటూ ఏడ్చేసింది రోజీ.

"అమ్మా, అలా అనుకోవద్దు. నువ్వు పారిజాత పుష్పానివి. ఆ పూవు నేల రాలినా పూజకు పనికొచ్చేదే! అమ్మా, ఇప్పటి భార్యాభర్తల సంగతి తెలియందేముంది? ఏ చిన్న అభిప్రాయ బేధాలొచ్చినా విడిపోతున్నారు. తోడుకోసం మరొకర్ని పెళ్ళాడుతున్నారు. విధి వక్రించడం వల్ల మీరిద్దరూ వేర్వేరు పెళ్ళిళ్ళు చేసుకోవలసి వచ్చింది. వాటిని మర్చిపోయి కొత్త జీవితం ప్రారంభించండి. నిన్నటి చేదుని మర్చిపోగల్గితేనే వర్తమానపు తీపి అర్థమవుతుందమ్మా.

ఇందరిమధ్య ఇంత సంతోషంగా వుంటున్నా, నువ్వు లేని లోటు కొట్టొచ్చినట్లుగా వుందమ్మా! నిజమమ్మా, నిన్ను చాలా మిస్ అవుతున్నాను. నిన్నక్కడ ఒంటరిగా వదిలి వచ్చానన్న గిల్టీ ఫీలింగ్ ముల్లులా గుచ్చుకొంటోందమ్మా. నేనలా అప్‌సెట్ అయిపోయి మూడీగా వుంటూంటే మొన్నోసారి మిసిమి 'పాతపాటలు వింటే రిలాక్సవుతానని' పాటలు పెట్టింది- 'చుప్‌కే చుప్‌కే రాత్‌దిన్ / ఆంశూ, బహానా యాద్ హై..' అనే పాట వస్తోంటే నా బాధ మరింత ఎక్కువైంది. నాకోసం అలా రాత్రీపగలూ కన్నీరొలికిస్తూ గడిపిన రోజులెన్నో.. అనుకోగానే మనసంతా నలిబిలి అయిపోయింది.

నిన్ను తల్చుకుంటే నేను నీ దగ్గర లేనన్న బాధతో ఏడుస్తూ వుండే నీ ముఖమే గుర్తుకొస్తోంది. దాంతో సంతోషంగా వుండలేకపోతున్నాను. వీళ్ళకోసం లేని సంతోషాన్ని నటించడం నరకంగా వుంటోంది. ప్లీజమ్మా, నాకోసం వచ్చేయమ్మా.

నీకో కల వుండేదిగా, నేనో పెద్ద హాస్పిటల్ కట్టించి ప్రజాసేవ చేయాలని.. అదిపుడు నిజమవబోతోందమ్మా. నాన్నగారు నాకోసం, మన ఊరికోసం పెద్ద హాస్పిటల్ కట్టిస్తానంటున్నారు. ప్రజాసేవతో బాటు, మనం పుట్టిన ఈ గడ్డ రుణం తీర్చుకొనే అవకాశాన్నిస్తున్నారు.

అంతేకాదు, సంగీత పాఠశాలని గూడా ప్లాన్ చేస్తున్నారు, మిసిమి టాలెంట్

## కొత్తగాలి...

**ఆలోచించు ఓ క్షణం!**
**ఆచరించు మలిక్షణం**
**ప్రతిక్షణం విలక్షణం!**

– అమ్మిన వెంకట అమ్మిరాజు,
పేరూరు, ఖమ్మం జిల్లా

వృథా కాకూడదని. ఎదుటివారి మనసుల్లో ఏముందో గ్రహించే నేర్పు వీరందరికీ ఎలా అబ్బిందో? నాకూ, మిసిమికీ 'గెలుపు తలుపు తీసే / ఆకాశమే / నేడు నా కోసమే..' అంటూ పాడుకోవాలనిపిస్తోంది. మా ఇద్దరి కలలు ఇంత తొందరగా సాకారమవుతాయని అనుకోలేదేమో.. ఈ మహాద్భుతానికి మనసంతా పరవశించిపోతోంది. ఈ ఆనందంలో పాలుపంచుకోవల్సిన నువ్వు లేనందుకు చాలాచాలా బాధగా వుంటోంది" దుఃఖం గరగరలాడుతుండగా అన్నాడు రాహుల్.

రోజీ పరిస్థితి అందుకు భిన్నంగా లేదు. పెదవి విప్పితే ఎక్కడ ఏడ్చేస్తానో అనుకొంటూ మౌనం వహించింది. ఆ తర్వాత చాలాసేపు మిసిమి మాట్లాడింది. ఆమె మామగారు, తదితరుల గురించి చెబుతూంటే వాళ్ళెంతటి క్షమామూర్తులో, ప్రేమాస్పదులో, ఎంతటి సంస్కారవంతులో అర్థం కాసాగింది రోజీకి.

"ఆంటీ, ఎవరి జీవితంలో వాళ్ళు యమా బిజీగా వుంటున్న రోజులివి. ఎవరో మీ గురించి ఏదో అనుకుంటారన్న భయమెందుకు? ఎవరూ కూడా ముఖం ముందు అనరు. అందులోనూ వీరి మంచితనం తెలిసినవారు కాబట్టి అనే అవకాశమే లేదు. ఒకవేళ ఎవరన్నా మూర్ఖులు అన్నారే అనుకోండి, వాళ్ళెంతకాలమని అంటారు? నాల్రోజులు గడిస్తే ఎంతటి విషయమైనా మరుగున పడిపోతుంది. ఇంత మాత్రానికి భయపడి మనవారికి దూరంగా వుండిపోవటమెందుకు?

ఆంటీ, మాకు పుట్టబోయే పిల్లలకు, ఇరు వైపులున్న గ్రాండ్ పేరెంట్స్ ప్రేమ, లాలన కావాలని మాకుంది. ప్లీజ్ ఆంటీ! అందుకోసమైనా రండి. ప్లీజ్, వస్తున్నానని చెప్పండి" అంది మిసిమి రాబోయే బంగారు రోజులను, ఆ క్షణమే ఆమె కళ్ళ ముందుంచుతూ.

దాంతో ఇట్టే కరిగిపోయింది రోజీ. వారంతగా చెబుతున్నారంటే ఇక తను మొండికేయడం మంచిది కాదనుకొంది.

"రాహుల్‌కి చెప్పు, ఇక్కడివన్నీ సెటిల్ చేసుకుని వచ్చేస్తానని" అందామె, అప్పటికప్పుడే ఓ నిర్ణయానికి వస్తూ.

ఆమె మాట వింటూనే ఒక్కసారిగా వింతకాంతి వచ్చింది మిసిమి ముఖంలోకి.

ఆ సంతోషాన్ని గమనించగానే రాహుల్ పరమానందభరితుడై "అమ్మా, నేను.. నాకు.. అహ.. ఏం మాట్లాడాలో తెలీడంలేదు. ఒక్క క్షణం వుండమ్మా, నాన్నగారితో మాట్లాడు" అంటూ అప్పుడే అటుగా వచ్చిన రాజారామ్మోహనరావుగారికి ఫోనందించాడు. వణుకుతున్న చేతులతో ఫోనందుకున్నాడాయన.

"అమ్ములూ, ఎలా ఉన్నావ్? " తన మనసులోని మమతనీ ప్రేమనీ రంగరించి అడిగాడు.

ఆ ప్రేమ రోజీ హృదయాన్ని బలంగా తాకింది.

"మీ కోసం.. మీరు క్షమిస్తారనుకుంటూ ఇదుగో ఇలా ఉన్నాను" ఏడుస్తూ బదులిచ్చింది. ఆమె గొంతు వింటూనే కదిలిపోయాడాయన.

"అమ్ములూ, నేనేంటో నీకు తెలీదా? నిన్ను పరుషంగా ఏనాడన్నా ఒక్కమాట అన్నానా? నీమీద నాకెంత ప్రేమ ఉందో

నువ్వింకా గ్రహించలేదంటే చాలాచాలా బాధగా వుంది. అయినా మనలో మనకీ క్షమాపణలెందుకు? " లాలనగా అన్నాడు రాజారామ్మోహనరావ్

"కానీ అత్తయ్య, మావయ్యలు క్షమించగ ల్గుతారా? వాళ్లకి నా ముఖం ఎలా చూపించను? వారు పెద్ద మనసుతో చెప్పిందేదీ విన్పించుకోలేదు. వాళ్లని చాలా బాధ పెట్టాను నా మూర్ఖత్వంతో" అంది రోజీ.

"అమ్ములూ, గతం గతః. అమ్మానాన్నలు ఎంతో జీవితాన్ని చూసినవారు. ఇప్పుడు జీవితచరమాంకంలోకి వచ్చేశారు. నా జీవితం ఇలా అయిపోయిందన్న చింతతోనే ఉన్నారు. నీ రాకతో నా జీవితంలోకి మళ్లీ వసంతం తిరిగివస్తూంటే, వారెంత సంతోషిస్తారో? అయినా సినిమా పిచ్చితో నువ్వు ఇల్లు వదిలి వెళ్లిన సంగతి, మీ పేరెంట్స్‌కి తప్ప మరెవరికీ తెలీదు.. తెలియనీయలేదు. కాబట్టి ఎలాంటి అపోహలు లేకుండా వచ్చేయ్.

మనిద్దరి పర్యవేక్షణలో హాస్పిటల్, మ్యూజిక్ స్కూల్‌లు రూపుదిద్దుకోవాలని, ఆ తర్వాత వాటి ప్రారంభోత్సవం, మా అమ్మానాన్నల చేతులమీదుగా జరగాలని మన పిల్లల కోరిక. నిండు మనసుతో వారిని ఆశీర్వదించడానికి నువ్వు రాక తప్పదు బంగారం" అన్నాడు.

"మీ ఔన్నత్యం ముందు నేనో పిపీలిక మైపోతున్నాను. నేను రెండో పెళ్లి చేసుకొన్న సంగతి పెద్దలకు తెలిస్తేనో? " అందామె దుఃఖంతో గొంతు పూడుకుపోతూంటే.

"అమ్ములూ, నీ గతం గురించి చెప్పాల్సిన అవసరం లేదు. వాళ్లు పాత తరానికి చెందినవారు కాబట్టి బాధపడే ఛాన్స్ వుంది. ఆ బాధ లేకుండా చేయటానికి నిజం చెప్పకుండా వుండటమూ మంచిపనే అని నేననుకుంటున్నాను.. అయినా పరిస్థితుల ప్రాబల్యంవల్ల నేను కూడా రెండు పెళ్లిళ్లు చేసుకొన్నవాడినే కాబట్టి తెలిసినా 'నీ పరిస్థితి ఎలాంటిదోనన్న' ఆలోచన రాకపోదులే. జీవిత చరమాంకంలో ఒంటరి బతుకులు మహా దుర్భరం. దేవుడు మనకి అలాంటి నరకం ఇవ్వలేదు. కడదాకా కలిసుండమంటూ చక్కటి వరాన్నిచ్చాడు. ఈ వరాన్ని కాలదన్నుకుంటే మనంతటి మూర్ఖులు మరొకరుండరు. ఈ మలిసంజెలో నాకు తోడుగా వచ్చేయవూ? " అంటూ ఎంతో ప్రేమగా, ఆర్ద్రంగా అడిగాడాయన.

కఠిన శిలైనా ఆ పిలుపుకు కరగకుండా వుండలేదు. ఇక మామూలు ఆడదైన రోజీ, కరగకుండా ఉండగలదా?

అందులోనూ రాహుల్ వెళ్లిపోయాక మరింతగా ఒంటరితనం బాధిస్తున్నదేమో. . తన గూటిని వెదుక్కొంటూ వచ్చి వాలే రామచిలుకలా, అతని ఒడిలో సేదదీరాలనుకొంది. అందుకే వెంటనే "నాకూ మీ తోడూనీడా కావాలి. ఈ మలి జీవితాన్ని, మీ అందరి సమక్షంలో గడిపే అవకాశం ఇస్తున్న ఆ దేవుడికి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీడంలేదు. వీలైనంత తొందరలో వచ్చేస్తాను" అంది రోజీ ఎంతో ఉద్వేగంగా.

అది వింటూనే రాజారామ్మోహనరావు ముఖం దీప్తివంతమైంది.

ఆ వెలుగులు గమనించగానే రాహుల్, మిసిమిలకు విషయం అర్థమైపోయి, ఇద్దరూ రాజారామ్మోహనరావుగారి చేతులను ఆత్మీయంగా నొక్కారు, తమ సంతోషాన్ని వ్యక్తం చేస్తూ.

వారిద్దర్నీ చెరోచేత్తో పట్టుకొంటూ మన సారా నవ్వాడు రాజారామ్మోహనరావు.

"వెంటనే ఈ సంగతి తాతయ్య, నాన్నమ్మలకి చెప్పాలి" అంటూ చెంగుచెంగున మెట్లు దిగాడు రాహుల్.

విషయం వింటూనే పరంధామయ్య, సీతమ్మగార్ల వదనాలు, వికసిత శతదళ పద్మాలే అయ్యాయి. ©

పెద్ద కథ

# జేన్



జేన్ ఫౌలర్ని నేను కలిసిన సందర్భం నాకిప్పటికీ బాగా జ్ఞాపకం. మొదటి చూపులోనే నేనామెను అంత నిశితంగా పరిశీలించి ఉండకపోతే అది సంభవం అయ్యేది కాదు.

ఆ మధ్య నేను చైనా టూరు నుంచి లండనుకి తిరిగి వచ్చి మిసెస్ టవర్ ఇంటికి 'టీ'కి వెళ్లాను. మిసెస్ టవర్‌కి అలంకరణల పిచ్చి. అప్పటికి ఎన్నో సంవత్సరాలుగా ఆ ఇంట్లో ఉన్న కుర్చీలు, బల్లలు అమ్మి పారేసి వాటి స్థానంలో సరికొత్త ఫేషన్లవి కొని హాలులో అలంకరించింది. గది గోడల మీద ఫొటో ఫ్రేములన్నీ తీసేసి, సరికొత్త పెయింటింగ్స్ పెట్టింది. పాతది ఒకటి కూడా కనిపించకుండా చేసిందంటే నమ్మండి. అలా అందంగా అలంకరించిన తన ఇంటిని చూడ్డానికి నన్ను ఆహ్వానించింది.

"ఆ పాత ఫర్నీచరు, బొమ్మలు.. నీకు జ్ఞాపకం ఉన్నాయా? " అని అడిగింది.

నేను నాకు తెలిసిన ఆ పాత హాలు గురించి ఆలోచించసాగాను.

గుమ్మాలకి పెద్దపెద్ద కర్టెన్లు కొంది. సోఫాలమీద చక్కని కవర్లు వేయించింది. చూడటానికి అన్నీ బాగానే ఉన్నా నాకెందుకో ఎక్కడో ఏదో లోటుందనిపిస్తోంది. పెదిమలు పైపైకి ప్రతి వస్తువునీ పొగుడుతూనే ఉన్నా వాటిలో ఎక్కడో జీవం లోపించినట్టుంది. మిసెస్ టవర్‌కి మాత్రం తను చేసిన పని ఎంతో తృప్తిని ఇచ్చినట్టు అనిపిస్తోంది.

"ఇదుగో! ఈ హాలులో లైటింగు చూడు.. ఒక్క బల్బూ బయటికి కనిపించదు. కళ్లకి చల్లని కాంతినిస్తుంది" అంది.

"నామట్టుకు నాకు హోల్డర్సు పైకి కనిపించే లైట్లే ఇష్టం" అన్నాను నేను.

అప్పటికామె వయసెంత ఉంటుందో ఊహించలేను నేను. నా చిన్నప్పుడే ఆమె వివాహం అయిపోయింది. నాకంటే చాలా పెద్దదే! ఇప్పుడైతే నన్ను తనతో సమానమైన వయసువాడిగా పరిగణిస్తుందామె. ఆమె చెప్పిన దానిని బట్టి, ఇప్పుడామె వయసు నలభై ఏళ్లు. అంతే కాదు ప్రతి స్త్రీ తన వయసు కనీసం ఓ అయిదేళ్ళయినా దాస్తుందన్నది మనం జ్ఞాపకం పెట్టుకోవాలి. నెరుస్తున్న జుట్టుకు రంగే



స్తున్న విషయం కూడా ఆమె రహస్యంగా ఉంచదు. ఆ వయసులో సగం తెలుపు, సగం నలుపుతో అసహ్యంగా కనిపిస్తుంది కనుక రంగు వేస్తున్నానంటుంది. జుట్టు పూర్తిగా తెల్లబడ్డాక మానేస్తానంటుంది. అప్పుడు మళ్లీ మొహానికి నేవళం వస్తుంది. ఈ లోగా మొహానికి కూడా కొంత ముస్తాబు అవసరం అని ఆమె ఉద్దేశం. సహజంగా అందమైన స్త్రీ ఆమె. చక్కని దుస్తులు ధరిస్తుంది. దాంతో ఆమె వయసు నలభై కంటే ఒక్కరోజు కూడా ఎక్కువ కాదనిపిస్తుంది.

ఇదుగో! ఒక్క అద్దం ముందు నిలబడి అలంకరించుకునేటప్పుడు మాత్రమే నలభై వాట్ల బల్బు అవసరం అవుతుంది. ఎందుకంటే, అది శరీరంలోని లోపాల్ని ఎత్తి చూపి, వాటిని సరిదిద్దుకునేందుకు సహకరిస్తుంది కనుక. మేం కలుసుకుని చాలా రోజులు కావడంతో మా సంభాషణ మా మిత్రులవైపు, ఈ మధ్య నగరంలో జరిగిన విశేషాలవైపు మళ్లింది.

మిసెస్ టవర్‌కి పార్టీలంటే మహా ఇష్టం. రకరకాల మనుషుల్ని ఆహ్వానించి చక్కని వంటకాలు తయారు చేసి వాళ్లకి వడ్డించడం ఆమెకి సరదా. ఇప్పుడు కూడా ఒక తేది నిర్ణయించి "ఇంకా ఎవరెవర్ని పిలుద్దాం? " అంటూ ఒక లిస్టు తయారు చేయసాగింది.

ఉన్నట్టుండి ఏం జ్ఞాపకం వచ్చిందో "ఒక్క విషయం.. జేన్ ఇక్కడ ఉండగా మాత్రం కుదరదు" అంది.

"జేన్ ఎవరు? " అడిగాను నేను.

"ఈ హాలులో నేను మార్పులు చేసే ముందు, ఆ మూలనున్న బల్ల మీద ఒక

ఫొటో పెట్టి ఉండేది. నువ్వు చూసే ఉంటావు. అందులో టైట్ ఫిటింగ్ డ్రస్సులో ఉన్న స్త్రీయే జేన్. వెనక్కి దువ్వి కట్టిన జుట్టు, భూతద్దాల కళ్లజోడు. ఇదీ ఆమె స్వరూపం"

"చెప్పకు నీ ఇంట్లో వందల కొద్దీ ఫొటోలు ఉన్నాయి. అందులో ఏదని అనుకోను? "

"అబ్బ! వాటన్నిటిని తల్చుకుంటేనే ఒళ్లు జలదరిస్తుంది. మొత్తం అన్నీ కట్ట కట్టిం చేసి అటకెక్కించేశాను"

"ఇంతకీ జేన్ ఎవరో చెప్పావు కావు"

"ఆమె నాకొక లంపటం. మా ఆయనకి చెల్లెలు. నా ఆడపడుచు. ఒక బిజినెస్ మాగ్నెట్‌ని పెళ్లి చేసుకుంది. ఆయన పోయి చాలా కాలమయింది. చాలా ఆస్తి వదిలిపెట్టి పోయాడు"

"మరి ఆమె అంటే నీకు ఇష్టం లేదా? "

"అలాగని కాదు. ఆమె బట్టలు కట్టుకునే తీరు, ప్రవర్తన అంతా పల్లెటూరి తరహాగా ఉంటుంది. అనాగరికత అనుకో! చూస్తే ఆమె నాకంటే చాలా పెద్దదానిలా కనబడుతుంది. కాని నా సమవయస్కురాలినని చెప్పుకుంటుంది. బంధుప్రీతి ఎక్కువ. ఆమెకున్న దగ్గర బంధువుని నేనే. అందుకే ఎప్పుడు లండను వచ్చినా నా ఇంట్లోనే బస. తాను మరొక దగ్గర ఉంటే నేను బాధ పడతానని ఆమె ఉద్దేశం. వచ్చినప్పుడల్లా మొహమాటం లేకుండా మూడు నాలుగు నెలలు ఉండి మరీ వెళ్తుంది. అలా ఉన్న రోజుల్లో మర్యాద కోసం అప్పుడప్పుడూ నన్ను హోటలుకి భోజనానికి తీసుకుని వెళ్తుంది కూడా. ఆమెతో వెళ్లడానికి నేను హడలి చస్తాను. చూడటానికి ఆమె పనిమనిషిలా కనబడుతుంది. హోటల్లో నాకు పరిచయం ఉన్న, తెలిసిన పెద్దపెద్ద మర్యాదస్తులు కలిసే అవకాశం ఉంది. అది నాకెంతో అవమానకరంగా ఉంటుంది కదా! డిన్నరు పూర్తయి తిరిగి వస్తున్నప్పుడు అలా నన్ను హోటలుకు తీసుకెళ్లడం తనకెంత తృప్తిగా ఉందో చెప్పీ చెప్పీ ప్రాణాలు తీస్తుంది" మిసెస్ టవర్ గుక్కతిప్పుకోవడానికి ఆగింది.

"నీవంటి తెలివైన స్త్రీ ఆమె బారినుంచి తేలిగ్గా తప్పించుకుని ఉండొచ్చు కావాలంటే" అన్నాను నేను.

"అవుననుకో! కాని ఆ అవకాశం చాలా తక్కువ. నువ్వే చూస్తున్నావుగా. ఆమెది దయగల హృదయం. ఆమె మంచితనంతో నన్ను చంపుతోంది. నాకెంత ఇష్టం లేకపోయినా, ఆ విషయం నేను ఆమెతో నోరు తెరిచి చెప్పలేను కదా!"

"ఇంతకీ ఆమె ఎప్పుడు వస్తోంది? "

"రేపు"

ఆమె నోటి నుంచి ఆ మాట పూర్తయిందో లేదో కాల్‌బెల్ మోగింది. వెను వెంటనే నౌకరు. వెనకాలే ఒక వయసు మళ్లిన స్త్రీ లోపలికి ప్రవేశించారు. నౌకరు జేన్ రాకను ప్రకటించి వెళ్లిపోయాడు.

మిసెస్ టవర్ కూర్చున్న దగ్గర్నుంచి లేచి చేతులు చాచి "జేన్! నువ్వివాళ కాదే రావలసింది" అంటూ ఆహ్వానించింది.

"మీ నౌకరు కూడా అదే అన్నాడు. కానీ నేను నా ఉత్తరంలో ఈరోజు వస్తున్నాననే రాశాను" అంది జేన్.

ఈలోగా మిసెస్ టవర్ ఆశ్చర్యం నుంచి తేరుకుని, "సరేలే! ఎప్పుడయితేనేం! నువ్వెప్పుడిక్కడికి వచ్చినా నాకు సంతోషమే. లక్కీగా నాకివాళ మరే ఇతర కార్యక్రమమూ లేదు కూడా"

"నేను నీకేవిధంగానూ అడ్డురాకూడదనే నా ప్రయత్నం కూడా. ఈ రాత్రికి నువ్వు పెద్ద వంట ప్రయత్నాలేమీ చేయకు. ఉడికించిన ఎగ్ ఒక్కటుంటే చాలు. సరిపెట్టుకుంటాను" అంది జేన్.

మిసెస్ టవర్ 'ఆహా! ఒక ఎగ్ చాలునట!' అని మనసులోనే తిట్టుకుని పైకి

మాత్రం "ఫరవాలేదు. అంతకంటే మంచి భోజనమే చేద్దాం" అంది.

ఆ స్త్రీలిద్దరూ సమ వయస్కులని తెలుసుకుని, నాలో నేను నవ్వుకున్నాను. జేన్‌కి ఏభై అయిదేళ్లకి పైనే ఉంటాయి. లావుగా ఉంటుంది. నల్లటి టోపి పెట్టుకుని, మందంగా ఉండే నల్లటి డ్రస్సు వేసుకుంది. అది చూస్తే లోపల మరిన్ని పెటీకోట్లు ధరించిందేమో అనిపిస్తుంది. బహుశా హ్రస్వదృష్టి కూడా ఉందేమో! భూతద్దాల కళ్లజోడు పెట్టుకుంది.

"ఓ కప్పు కాఫీ పెట్టమంటావా? " అడిగింది మిసెస్ టవర్.

"ఏమనుకోకపోతే పెట్టు. ఈలోగా నేను బట్టలు మార్చుకుంటాను" అని లోపలి గదిలోకి నడవసాగింది. ఆ సమయంలో ఆమె మెడలో ఉన్న బంగారపు గొలుసు నాకంట పడింది. దానికో లాకెట్టు తగిలించి ఉంది. ఆ లాకెట్టులో స్వర్గస్తుడైన ఆమె భర్త ఫొటో ఉందన్నది ఖాయం.

మిసెస్ టవర్ మాత్రం ఒక పక్క నుంచి పళ్లు పటపట కొరుకుతోంది. 'జేన్ గదిలో విప్పిన బట్టలు, గ్లోవ్స్, పెద్ద నల్లటి టోపీ.. అన్నీ ఊడదీసి సోఫా మీద చెల్లాచెదురుగా పడేస్తుంది. తాను అప్పుడే చక్కగా అలంకరించుకున్న గది ఎంతో అసహ్యంగా తయారవుతుంది' అని లోలోపలే మథన పడసాగింది.

అసలలాంటి డ్రస్సు జేన్ ఎక్కడ నుంచి సంపాదించిందో ఆమెకర్థం కాదు. ఆ బట్టల తీరు చూస్తే మరీ అంత పాతవిగానూ లేవు. ఖరీదైనవి కూడా. మరి అంత కొత్త బట్టలు అంత పురాతనపు ఫేషనులో ఏ టైలరు కుట్టాడో! జేన్ తన జుట్టుని మధ్య పాపిడి తీసి, వెనక్కి దువ్వి, గట్టిగా ముడి వేస్తుంది. ఇవేమీ మిసెస్ టవర్‌కి రుచించవు.

బట్టలు మార్చుకుని బయటికి వచ్చిన జేన్ కళ్ళు హాల్లో టేబిల్ మీద పడ్డాయి. దాని మీద మిసెస్ టవర్ కొత్తగా కొనుక్కున్న టీ పాట్ ఉంది. అది చూసి జేన్ అడగనే అడిగింది "మారియన్! డియర్! కిందటిసారి నేను టీ పాట్ మీదికి నీకొక కవర్ ఇచ్చానే, అది ఏది? దానిని నువ్వు వాడడం లేదా? " అని.

"అయ్యో! వాడక పోవడమేమిటి? అదే రోజూ వాడుతూ ఉన్నాను. కాని దురదృష్టవశాత్తూ నిన్ననే అది కాలిపోయింది" అంది మిసెస్ టవర్.

"అయ్యయ్యో! అలాగా! రేపెలాగూ నేను షాపింగుకి వెళ్లాలిలే. ఈసారి లిబర్టీలో మంచి సిల్కుగుడ్డ కొని కవరు కుట్టిపెడతాను" అని అందంగా నవ్వింది జేన్. ఆ నవ్వినప్పుడు ముత్యాల్లాంటి ఆమె పలువరుస చక్కగా మెరుస్తూ ఆమె ముఖానికొక కొత్త శోభ రావడం గమనించాను నేను.

ఆంగ్ల మూలం :
**సోమర్‌సెట్ మామ్**

అనువాదం :
**పాలెపు బుచ్చిరాజు**

ఆ ఇద్దరు బంధువులూ సంభాషణలో మునిగి ఉండగా, ఇంక అట్టే సేపు అక్కడ ఉండవలసిన అవసరం కనిపించలేదు నాకు. మిసెస్ టవర్ దగ్గర సెలవు తీసుకుని ఇంటికి వచ్చేశాను.

మర్నాడు ఉదయమే మిసెస్ టవర్ నుంచి ఫోన్ వచ్చింది. ఆమె మాట్లాడే తీరుని బట్టే మంచి హుషారుగా ఉన్నట్టు గ్రహించగలిగాను నేను.

"భలే మంచి కొత్త న్యూస్ ఉంది. విను.. జేన్ పెళ్లి చేసుకోబోతోంది"

"నిజంగానే!? " ఆశ్చర్యంగా అడిగాను.

"నిజంగానే. ఆమెకు కాబోయే భర్త ఈ రాత్రికి ఇక్కడికి డిన్నరుకి వస్తున్నాడు.

నువ్వు కూడా రావాలి"

"నేనెందుకు పానకంలో పుడకలా? "

"ఏమీ కాదు. జేన్ ప్రత్యేకంగా చెప్పింది. నిన్ను కూడా ఆహ్వానించమని. తప్పకుండా రావాలి"

అట్నుంచి ఆమె హుషారుగా నవ్వుతున్నట్టు తెలుస్తోంది.

"ఇంతకీ ఎవరాయన? " అడిగాను.

"నాకు తెలిస్తే గదా నీకు చెప్పేందుకు"

జేన్ చెప్పిన దాన్నిబట్టి అతనో పెద్ద ఆర్కిటెక్టు.

"జేన్ ఎటువంటి పురుషుడిని పెళ్లి చేసుకుంటుందో నువ్వు ఊహించగలవా? " అంది మిసెస్ టవర్.

నాకు రేపు కొంపలుమునిగిపోయే పనులేం లేవు. మిసెస్ టవర్ ఇంటికి డిన్నరుకి వెళ్లేందుకు నాకే అభ్యంతరం లేదు.

మర్నాడు నేను వెళ్లేసరికి మిసెస్ టవర్ ఒక్కర్తే చక్కగా ముస్తాబై కూర్చుని దర్శనమిచ్చింది.

నన్ను చూసి 'జేన్ లోపల తయారవుతోంది. నువ్వామెను చూసి తీరాలని నేను ఉవ్విళ్ళూరుతున్నాను. ఆమె చాలా సంతోషంగా ఉంది. అతను తనని పూజిస్తాడని చెబుతోంది. అతని పేరు గిల్బర్ట్! ఆమె అతన్ని పొగుడుతూ ఉంటే చూడాలి. గొంతు అదోలా మారిపోతుంది. నాకైతే ఆమె మాటలు వినీ, వినీ నవ్వు పుట్టుకొస్తోంది" అంది.

"అతనెలా ఉంటాడో? "

"నేనూహించగలను. పెద్ద శరీరం. జుట్టు ఊడిపోయి మెరిసే బట్టతలా. బానలాంటి పొట్టా, మెడలో పొట్ట వరకూ వేళ్ళాడే బంగారు గొలుసూ, నున్నగా షేవ్ చేసిన మొద్దుబారిన మొహం"

మేకప్ పూర్తి చేసుకుని జేన్ ప్రవేశించింది. టైట్ ఫిటింగ్ సిల్కు డ్రస్సు, మోచేతుల వరకు వేలాడే స్లీవ్సు, మెడలో డైమండ్ నెక్లెసు. ఓ చేతిలో నల్లటి గ్లోవ్సు, మరో చేతిలో ఆష్ట్రిచ్ ఫెదర్స్‌తో చేసిన పంఖా. మొత్తం మీద ఆమె ఆమెలానే కనిపించే ప్రయత్నంలో సఫల మయిందనే చెప్పాలి.

"జేన్! ఆ నెక్లెసులో నీ మెడ మరింత అందంగా ఉంది" అని పొగిడింది మిసెస్ టవర్.

"మా మ్యారియన్ మీకు నా వివరాలన్నీ చెప్పిందా? " అని నన్ను సంబోధిస్తూ అడిగింది జేన్, అప్పటికే మేం పాత మిత్రులం అన్నట్టుగా.

"మీకు నా హృదయపూర్వక అభినందనలు" అన్నాను నేను.

"అప్పుడే కాదు. అబ్బాయిని రానివ్వండి" నవ్వుతూ అంది జేన్.

"అతని గురించి నీ నోటి ద్వారా వింటే ఎంతో బాగుంటుంది" అంది టవర్.

జాగ్రత్తగా చూస్తే, ఆ భూతద్దాల కళ్ళజోడు వెనక ఆమె కళ్ళు వెలిగి పోవడం గమనించగలం మనం.

"పెళ్ళికొడుకు మరీ అంత ముసలివాడనేం అనుకోకండి. కాటికి కాళ్ళు చాచి ఉన్నవాడిని పెళ్లి చేసుకోవడానికి నేనేమీ పిచ్చిదానిని కాను"

అంతే ఆమె చెప్పింది అంతకంటే ఎక్కువ మాట్లాడడానికి అవకాశం కూడా లేదు. ఈ లోగా నౌకరు వచ్చి గిల్బర్ట్ నేపియర్ రాకని తెలియజేశాడు.

చక్కగా కుట్టిన డిన్నర్ జాకెట్టు వేసుకుని, ఒక యువకుడు హాలులో ప్రవేశించాడు. అతనంత పొడగరి కాదు. శుభ్రంగా షేవ్ చేసుకున్నాడు. నీలిరంగు మెరిసే కళ్ళు, అంతపెద్ద అందగాడు కాకపోయినా, ఆకర్షణీయంగా ఉన్నాడు. వయసు సుమారు ఇరవై నాలుగేళ్ళు ఉండొచ్చు. చూసిన వెంటనే, నాలో మెదిలిన భావమేంటంటే.. అతను జేన్‌ని వివాహం చేసుకునేవాడి కుమారుడై ఉండవచ్చుననీ, తండ్రి ఏ అనారోగ్యం కారణం



గానో రాలేకపోయాడని చెప్పడానికి వచ్చి ఉండవచ్చుననీను.

కానీ, ఆశ్చర్యకరంగా, అతను వస్తూనే, చేతులు రెండూ ముందుకు చాచి, జేన్

వైపు నడిచాడు. ఆమె కూడా ఆప్యాయంగా ముందుకు వచ్చి, అతన్ని కౌగిలించుకుంది. మారియన్ వైపు తిరిగి "ఇదుగో ఈ యువకుడే మారియన్ డియర్!" అంది.

అతను చేయి చాచి ఆమెతో కరచాలనం చేస్తూ "మిసెస్ టవర్! మీ గురించి జేన్ ఎంతగానో చెప్పింది, ఈ ప్రపంచంలో మీరే ఆమెకున్న ఏకైక బంధువులని. మిమ్మల్ని కలుసుకోవడం నాకెంతో ఆనందంగా ఉంది" అన్నాడు.

ఆ పొగడ్తతో మిసెస్ టవర్ మొహం దీపంలా వెలిగిపోయింది. కానీ, అంతలోనే గౌరవ మర్యాదలు గల కుటుంబంలో పెరిగిన ఒక మహిళ తన సహజ గంభీర వదనంలో మనోభావాల్ని ఎంత చక్కగా దాచిపెట్టగలదో మిసెస్ టవర్‌ని చూస్తే నాకు అర్థం అయింది.

నిజానికి మిసెస్ టవర్‌కి వాళ్లిద్దరూ వివాహం చేసుకోవడం ఇష్టంలేదు. కానీ ఆ భావాన్ని కప్పిపుచ్చి, పైకి ఎంతో సంతోషిస్తున్నట్టు ప్రవర్తించగలిగింది. ఆమె మాటల కోసం తడబడుతోంది. గిల్బర్ట్‌కి కూడా కొంచెం ఇబ్బందిగానే ఉంది.

ఇవన్నీ పరిశీలిస్తూ నేను వస్తున్న నవ్వుని ఆపుచేయడానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నాను. మా అందరిలోకి ప్రశాంతంగా ఉన్నది జేన్ మాత్రమే.

"గిల్బర్ట్ నీకు బాగా నచ్చుతాడని నాకు తెలుసు. పైగా అతను మంచి భోజన ప్రియుడు కూడా" అని మారియన్‌తో చెప్పి, "మా మారియన్ వంటలు చాలా రుచికరంగా ఉంటాయి" అని గిల్బర్ట్‌తో చెప్పింది జేన్.

"అవునవును" అన్నాడు గిల్బర్ట్.

మారియన్ సందర్భోచితంగా జవాబిచ్చింది.

భోజనాల దగ్గర సంభాషణ నేనంత తొందరగా మరిచిపోలేను.

నిజానికి వాళ్ళిద్దరూ జోక్ చేస్తున్నారో, లేక గిల్బర్ట్ వయసుని కప్పిపుచ్చి, జేన్ తనని ఫూల్‌ని చేద్దామనుకుందో అర్థం చేసుకోలేకపోతోంది మారియన్. ఆమెకు నిజం ఏమిటో అంతు పట్టడం లేదు. ఏమైనప్పటికీ తాను సంయమనం కోల్పోలేదు. తన పార్టీ చక్కగా పూర్తికావాలన్నది ఆమె కోరిక. అందుకోసం ఆమె సంభాషణ కొనసాగించింది. కానీ, మారియన్ చూపించే ఆప్యాయత వెనక దాగి ఉన్న, అసూయా ద్వేషాల్ని గిల్బర్ట్ ఎంతవరకు అర్థం చేసుకున్నాడన్నది సందేహమే!

ఆమె అతన్ని బాగా పరిశీలిస్తోంది. అతని మనసులోకి దూరి చూడాలని ప్రయత్నిస్తోంది. ఆ మానసిక వేదన వల్ల ఆమె మొహం, బుగ్గలు మరింత ఎర్రబడ్డాయి.

"నువ్వు బాగా ఎర్రగా ఉంటావు మారియన్" అంది జేన్, ఆమె మొహం మీది ఎరుపుని చూస్తూ.

"ఈ రోజు నా మేకప్ కొంచెం ఎక్కువైనట్టుంది" అంది మారియన్.

"ఓహో! అదంతా మేకప్పా? అలా అని తెలిసుంటే అడిగేదాన్నే కాదు" అని గిల్బర్ట్‌ని "మారియన్, నేనూ చిన్నప్పుడు కలిసి చదువుకున్నాం అంటే నమ్మగలవా? " అని అడిగింది జేన్.

ఆమె ఈ ప్రస్తావన ఎందుకు తీసుకొచ్చిందో నాకర్థం కాలేదు. ప్రత్యేకమైన కారణం ఏమీ లేనట్టు యాథాలాపంగా చెప్పింది మాటలు.

"మనం ఇప్పుడు ఏభయ్యోపడిలో పడ్డాం కదూ!" అంది మారియన్.

అలాగని జేన్ ముసలితనాన్ని ఎత్తి చూపించాలని ఆమె అనుకుంటే పొరపడినట్టే! ఎందుకంటే, జేన్ "గిల్బర్ట్ లెక్కలో నేను ఇప్పుడు నలభైతొమ్మిది దాటలేదన్నది సత్యం" అని సమాధానం చెప్పింది.

మారియన్ కొంచెం దెబ్బతింది. కానీ అంత తేలిగ్గా ఓటమిని అంగీకరించే రకం కాదామె.

"మీ యిద్దరికీ వయసులో చాలా తేడా ఉంది కదా!" అంది.

'ఆc! ఏముందిలే! ఇరవై ఏడేళ్ళేగా! అది అంత పెద్దతేడా అంటావా? గిల్బర్ట్ దృష్టిలో నేను నా వయసుకి బాగా తక్కువగా కనిపిస్తాను. అయినా, నేను ముందే చెప్పాను కదా! ఓ కాలు కాటిలో పెట్టిన వాడిని చేసుకోవడం నాకిష్టంలేదని"

నాకు నవ్వాగలేదు. గిల్బర్ట్ కూడా నవ్వాడు. ఆ నవ్వులో కుర్రతనం ఉంది. జేన్ మాట్లాడిన ప్రతీమాటా అతన్ని ఆనందంలో ముంచెత్తుతోంది. కానీ, మిసెస్ టవర్‌కి చిర్రెత్తుకొస్తున్నట్టు అనిపిస్తోంది.

పరిస్థితిని అదుపులో పెట్టాలంటే దారి మార్చాలని నేను ముందుకొచ్చి "మీ పెళ్లి బట్టలు కొనుక్కోవడంలో మీరు బిజీగా ఉన్నారనుకుంటాను" అన్నాను.

"లేదు. బట్టలన్నీ నేను లివర్‌పూల్ నుంచి తెప్పిద్దామనుకున్నాను. కానీ గిల్బర్ట్ వద్దన్నాడు. అవన్నీ తానే సెలక్టు చేస్తానంటాడు" అంటూ అతని వైపు ఆప్యాయంగా చూసింది, పదిహేడేళ్ళ బాలాకుమారిలా గారాలు పోతూ.

మారియన్ మొహం పాలిపోయింది.

"హనీమూన్‌కి ఇటలీ వెళ్ళాలనుకుంటున్నాం. అక్కడి రినైసాన్సు ఆర్కిటెక్చరు గిల్బర్ట్ ఇంకా చూడలేదు. దారిలో పారిస్ వెళ్లి బట్టలు కొంటాం"

"ఎన్నాళ్ళు ప్రోగ్రాం? "

"గిల్బర్ట్ ఏకంగా ఆర్నెల్లు ప్లాన్ చేశాడు. బ్రహ్మచారి కనుక, ఇంతవరకు వారం పది రోజులకంటే ఎక్కువ రోజులు సెలవు పెట్టి ఎరగడు"

భోజనాలు పూర్తయ్యాయి. ఆడవాళ్లిద్దరూ మమ్మల్ని వదిలిపెట్టి మేడ మీదికి వెళ్ళారు. మేమిద్దరం పిచ్చాపాటికి దిగాం. మరో రెండు నిముషాల్లో పైనుంచి నౌకరు ఒక నోట్ తెచ్చి నాకిచ్చాడు. అది మిసెస్ టవర్ రాసింది.

'ఒకసారి నువ్వు పైకి రా! ఏదో మిష మీద నువ్వు బయటికి వెళ్తూ, అతన్ని కూడా నీతో తీస్కుపో. ఈ జేన్‌తో నేను ఇటో అటో తేల్చుకోకపోతే, ఇప్పుడే ఫిట్స్ వచ్చి పడిపోయేలా ఉన్నాను' అని ఉంది అందులో.

అవసరార్థం నేను ఒక చిన్న అబద్ధం ఆడాను "మిసెస్ టవర్‌కి తలనొప్పిగా ఉందట. ఆమె పడుకోవాలనుకుంటోంది. ఇంక మనం వెళ్ళడం భావ్యమేమో"

"తప్పకుండా అలాగే చేద్దాం" నాతో ఏకీభవించాడు గిల్బర్ట్.

మేం మేడ మీదికి వెళ్లిన మరో అయిదు నిముషాలకు ఇల్లు వదిలి పెట్టాం. నేను టాక్సీని పిలిచి "నాతో వస్తారా!" అని అడిగాను.

"అక్కర్లేదు. నేనలా వెళ్లి బస్సు ఎక్కుతాను" అన్నాడు గిల్బర్ట్.

మేం అలా బయటికి వెళ్ళగానే జేన్‌తో భేటీ వేసుకుంది మారియన్.

"నీకేమైనా మతిపోయిందా? "

"పిచ్చాసుపత్రిలో చేరేటంత పరిస్థితి మాత్రం లేదు"

"అసలు నువ్వా యువకుడిని ఎందుకు పెళ్లి చేసుకుంటున్నావు? " మర్యాదగా అడిగింది మారియన్.

"సగం కారణం - నేను కాదంటే అతనొప్పుకోడు. ఇప్పటికి ఐదుసార్లు నన్ను అర్థిం

**కొత్తగాలి...**

**అత్తింటివారు అవమానిస్తున్నారు**
**కష్టాల్లో కన్నవారు**
**కట్టుకున్నవాడు**
**మొహం చాటేస్తున్నాడు**
**ఊరంతా మహిళాదినోత్సవం!**

– జి.వి.ఎస్. ప్రియంవద,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

## కొత్తగాలి...

పుట్టించేది
బ్రహ్మ!
కాపాడేది
అమ్మ!

– కె. శ్రీహరి,
ఇందుర్తి

చాడు. కాదని చెప్పిచెప్పి అలసిపోయాను.

"నిన్నే పెళ్ళాడాలని అతనెందుకు తొందర పడుతున్నాడంటావు? "

"నేనంటే అతనికంత ఇష్టం కాబట్టి"

'ఏం కాదు. అతనికి మంచీచెడ్డా తెలియదు. స్వార్థపరుడు. ఈ విషయం నేనతనికి చూచాయగా తెలియజేశాను"

"నీ అనుమానం నిజం కాకపోవచ్చు. అలా చెప్పి అతన్ని అవమానించావేమో!"

"అతను కటిక దరిద్రుడు. నువ్వు ధనికురాలివి. అతనికి కేవలం నీ డబ్బు మీదే దృష్టి ఉంది. ఆ విషయం గ్రహించలేనంత మూర్ఖురాలివేమీ కాదు నువ్వు"

అది విన్నప్పటికీ జేన్‌కి మిసెస్ టవర్ మీద కోపం రాలేదు.

ఆమె ఆదుర్దాని గమనించి "అతనంత చెడ్డవాడని నేననుకోను. అతనికి నేనంటే ఎంతో అభిమానం" అంది.

"జేన్! నువ్వొక వయసు మళ్ళిన స్త్రీవని మరిచిపోకు"

"నా వయసూ, నీ వయసూ ఒకటే!"

"సరే! నా విషయం వేరు. ఇప్పుడు నా వయసు నలభైకంటే ఎక్కువని ఎవరికీ అనిపించదు. అయినప్పటికీ, నేను వయసులో నాకంటే ఇరవై ఏళ్ళు చిన్నవాడిని పెళ్ళి చేసుకునే ధైర్యం చేయలేదు"

"ఇరవై కాదు. ఇరవై ఏడు"

"వయసులో తన తల్లి కాగల స్త్రీని ఒక యువకుడు భార్యగా సాకగలడని నువ్వు నమ్ముతున్నావా? "

"నేను జీవితంలో చాలా భాగం చిన్న ఊరిలోనే గడిపేశాను. మనుషులు, మన స్తత్వాల గురించి నాకంత బాగా తెలుసని నేననుకోను. వయసులో అంత చిన్నవాడిని ప్రేమిస్తాననీ ఎప్పుడూ అనుకోలేదు. ఆస్ట్రియాలోనో ఎక్కడో ఫ్రాయిడ్ అని ఒక పండితుడుండేవాడట..."

జేన్ మాటల్ని మధ్యలోనే తుంచి మారియన్ "మరీ అంత నిర్లక్ష్యంగా ఉండకూడదు. అది అంత మంచిది కాదు. నువ్వెంతో తెలివైన దానివని నమ్మాను. ఇదెంత అమర్యాదగా ఉంటుంది? " అంది.

"అతనంటే నాకిష్టం. లేకపోతే అతన్ని వివాహం చేసుకునేందుకు నేను ఎలా అంగీకరిస్తాను? "

మిసెస్ టవర్‌కి కోపం నషాళానికెక్కుతోంది. ఆమె బీ.పీ. పెరిగి బుర్ర బరువెక్కసాగింది. దగ్గరలో విసనకర్ర దొరక్కపోతే, పాత పేపరు ఒకటి తీసుకుని విసురుగా విసురుకోసాగింది.

"అతనంటే అంత ఇష్టం లేనప్పుడు, పెళ్లెందుకు చేసుకోవడం? "

"నేను చాలాకాలం వైధవ్యంతో కాలం గడిపాను. ఓ పల్లెటూరిలో మూలని ఒంటరిగా పడి ఉన్నాను. నాకూ జీవితంలో మార్పు కావాలనిపించింది"

"పెళ్లి పెళ్లి కోసమే చేసుకోవాలనుకుంటే నీతో సమాన వయస్కుడైన వాడిని ఎన్నుకోవచ్చుగా!"

"అటువంటి వాడెవడూ నా వెంట పడి, అయిదు సార్లు నన్ను పెళ్లి చేసుకోమని దేబిరించలేదు. అసలటువంటి మనిషే నాకెప్పుడూ తారసపడలేదు" చెప్పుతూ చెప్పుతూ జేన్ విలాసంగా నవ్వుతోంది.

ఆ నిర్లక్ష్యపు సమాధానాలూ, ఆ ధీమా నవ్వులూ చూసినకొద్దీ మారియన్‌కి జేన్ మీద కోపం ఎక్కువ కాసాగింది.

"జేన్! అలా నవ్వకు. నాకది ఇష్టం ఉండదు. నువ్వు చేస్తున్నది మంచిపని అని నాకనిపించడం లేదు. ఇది నమ్మ శక్యంగా లేదు"

ఇక ఆమె భరించలేక దుఃఖం ముంచు కొచ్చి ఏడవ సాగింది. అలా ఏడవడం మంచిది కాదనీ, దానివల్ల మొహం అంతా ఉబ్బిపోయి, కళ్లు ఎర్రబడి చూడడానికి అసహ్యంగా తయారవుతుందని ఆమెకు తెలుసు. కానీ ఎంత ప్రయత్నించినా ఆమెకు దుఃఖం ఆగలేదు.

జేన్ మాత్రం ఏమీ కానట్టే ప్రవర్తి స్తోంది. ఆ భూతద్దాల కళ్ళజోడులోంచి మారియన్‌ని పరిశీలనగా చూస్తోంది.

"నువ్వు చాలా బాధపడతావు జేన్! ఎంత చెప్పినా నీకు అర్థం కావడంలేదు" అని మళ్లీ ఏడుపు లంకించుకుంది. మారి యన్ కళ్ళ వెంటకారే నీటిని కాటుక చెదర కుండా తుడుచుకుంది.

"నీ భయం వట్టి నిరాధారం" జేన్ సుతారంగా సమాధానం చెప్పి, చిరునవ్వు మిళితమైన మాటలతో ఇలా అంది "ఈ విషయం గురించి ఒక నిర్ణయానికి వచ్చే ముందు, మేం చాలా చర్చించాం. నేను నా వ్యక్తిత్వాన్ని బట్టి ఎటువంటి మనిషైనా నాతో కలిసి జీవించగలడని నమ్ముతు న్నాను. గిల్బర్ట్‌ని సంతోషపెట్టగలననే ధైర్యం నాకుంది.

పాపం అతని ఆలనా పాలనా చూసే వారు ఇంతవరకూ ఎవరూలేరు. పూర్తిగా ఒకరినొకరు అర్థం చేసుకున్నాకనే మేం ఈ నిర్ణయం తీసుకున్నాం. అంతే కాక, ఏనా డైనా సరే, మాలో ఎవరు విడిపోదల్చు కున్నా నిరభ్యంతరంగా విడిపోవచ్చును. ఒకరి దారిలో మరొకరు అడ్డంకులు పెట్టరు"

ఇప్పటికి మిసెస్ టవర్ దుఃఖం నుంచి తేరుకుంది. కానీ, చాలా అలసటగా ఫీలవు తోంది "ఈ రోజుకి ఇక చాలు. ఈ చర్చ రేపు కొనసాగిద్దాం. నాకు బాగా నిద్రవ స్తోంది" అంది జేన్‌తో.

"అది అవసరం ఉండనే ఉండదు. రేపే నేనూ, గిల్బర్ట్ మేరేజ్ రిజిష్ట్రారాఫీసుకి వెళ్తున్నాం" అంది జేన్.

ఇంక చెప్పేందుకేమీలేక మిసెస్ టవర్ మౌనం వహించింది.

★ ★ ★

మర్నాడు ఉదయమే జేన్, గిల్బర్ట్‌ల వివాహం మేరేజ్ రిజిష్ట్రారాఫీసులో జరి గింది. నేనూ, మిసెస్ టవర్ సాక్షి సంత కాలు చేశాం.

గిల్బర్ట్ నీలంరంగు సూటులో చిన్న పిల్లాడిలా కనిపించాడు. కొంచెం జంకుతూ ఉన్నట్టు కూడా అనిపించింది.

కానీ జేన్ మాత్రం చక్కగా, ఉత్సా హంగా కనిపించింది. నిండుగా డ్రస్సు చేసుకుంది. ఆ కటింగ్ నేర్పు చూస్తే, అది ఎన్నోసార్లు ఆమెకి బట్టలు కుట్టిన దర్జీ కుట్టుపని అనిపిస్తుంది. అంత చక్కగా నప్పింది ఆమె వంటిమీద ఆ డ్రస్సు. ఆస్ట్రిచ్ ఈకలతో చేసిన పెద్దటోపీ ధరిం చింది. బంగారు ఫ్రేము కళ్ళజోడు ఉండనే ఉంది.

ఫార్మాలిటీస్ పూర్తి కాగానే రిజిష్ట్రారూ వధూవరుల వయసు వ్యత్యాసానికి ఆశ్చ ర్యపడినప్పటికీ, తన విధుల్లో ఒకటిగా వారిద్దరినీ అభినందించాడు. ఆ తరువాత పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు ఒకరి బుగ్గల మీద ఒకరు ముద్దులు పెట్టుకున్నారు. తరవాత మిసెస్ టవర్, అయిష్టంగానే అయినా, జేన్‌ని ముద్దు పెట్టుకుంది. తర వాత నాకూ ఆ కొత్త పెళ్లికూతుర్ని ముద్దు పెట్టుకోక తప్పలేదు. మేం రిజిష్ట్రారాఫీసు నుంచి బయట పడ్డాం.

ఆ మధ్యాహ్నమే కొత్తజంట పారిస్ ప్రయాణం. వారికి బై చెప్పడానికి నేను మిసెస్ టవర్ కారులో విక్టోరియా స్టేషను వరకూ వెళ్ళాను. అక్కడ స్టేషన్ రెస్టారెం

టులోనే బ్రేక్‌ఫాస్ట్ చేద్దామంది జేన్. కేవలం బంధువన్న బంధం కోసం తప్ప, మారియన్ మనస్ఫూర్తిగా తన సంతోషాన్ని పంచుకోలేకపోయింది. నాకూ ఆ భోజనం అట్టే రుచించలేదు.

జేన్ మాత్రం, 'ప్రయాణం ముందు కడుపునిండా భోజనం చేయడం అవసరం' అంటూ బాగానే లాగించింది.

వాళ్ళ బండి వెళ్ళాక, మేమిద్దరం మిసెస్ టవర్ ఇంటికి వచ్చాం.

మిసెస్ టవర్ పెదిమలు విరుస్తూ "ఈ ముచ్చట ఎంతకాలం సాగుతుందంటావు? ఆరు నెలలా? " అంది.

"ఏమో! అంతా బాగానే జరుగుతుందని ఆశిద్దాం" అన్నాను.

"బాగు!? ఏం బాగు? నువ్వు కూడా అలా మాట్లాడితే ఎలా? అతనామెను డబ్బుకోసం చేసుకున్నాడన్నది నిర్వివాదం. అలాంటి పెళ్లి ఎంతకాలం నిలుస్తుంది? జేన్ చిక్కుల్లో పడకుండా తప్పించుకోగలిగితే అది చాలు"

నేను నవ్వాను. ఆ మాట్లాడడంలో ఉన్న గూఢార్థం తెలుసుకోవడం నాకేమీ కష్టమనిపించలేదు.

"అదే నిజమైతే 'నీకు ముందే చెప్పానుగా!' అనే అవకాశం నీకు వస్తుందిలే" అన్నాను.

"అలా సంతృప్తి పడే వాళ్ళలో నేనాఖరి దాన్ని"

"అలా అయితే, నేనలా అనలేదన్న తృప్తి నీకు మిగులుతుంది. నీ కత్తికి రెండు వైపులా పదునే!"

"జేన్ ముసలిది. అసహ్యంగా డ్రస్సు చేసుకుంటుంది. మొద్దులా ఉంటుంది"

"మొద్దులా ఉంటుందనుకోను. ఎక్కువగా మాట్లాడక పోవచ్చు. మాట్లాడిన నాలుగు ముక్కలూ విన సొంపుగానే ఉంటాయి మరి"

"ఆమె చక్కని జోక్ వేయగా నేనెప్పుడూ వినలేదు జీవితంలో!"

★ ★ ★

జేన్, గిల్బర్ట్‌లు హనీమూన్ ఎంజాయ్ చేసి తిరిగి వచ్చిన రోజుల్లో, రెండు సంవత్సరాల పాటు నేను విదేశాల్లో ఉండి, లండను రావడం పడలేదు. మిసెస్ టవర్‌కి నేను అప్పుడప్పుడూ పిక్చర్ పోస్ట్ కార్డులు పంపినా ఆమె నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు మాత్రం జరపలేదు. ఆ కారణంగా నాకు ఇక్కడి విశేషాలేమీ తెలిసే అవకాశం లేకపోయింది.

తిరిగి వచ్చిన వారం రోజులకు, ఒక పెద్ద పార్టీలో కలిసింది మిసెస్ టవర్. వచ్చిన అతిథులు ఇరవై, ఇరవైనాలుగు మంది వరకు ఉంటారు.

నేను కొంచెం ఆలస్యంగా వెళ్లాను. వచ్చిన వారిని పరిశీలించి చూశాను. చాలామంది నాకు పరిచితులే! ఆ హోస్టుకి పేరు ప్రఖ్యాతులున్న మనుషుల్ని ఆహ్వానించి, విందులు ఇవ్వడం సరదా. నేను మిసెస్ టవర్‌ని పలకరించి, మామూలుగా ఇద్దరు మిత్రులు రెండేళ్ళ తరవాత కలుసుకున్నప్పుడు చెప్పుకోవలసిన కబుర్లన్నీ చెప్పుకున్నాక, "జేన్ ఎలా ఉంది? " అని అడిగాను.

"ఏం? బాగానే ఉంది" అంది ముభావంగా.

"ఆ పెళ్ళి తరవాత విశేషాలేంటి? "

"ప్రస్తుతానికి ఏమీ లేవు. విజయవంతంగానే నడుస్తూ ఉంది"

"అయితే మరి నువ్వోడినట్టేనా? "

"ఎన్నటికీ కాదు. ఆ పెళ్ళి ఎంతో కాలం నిలవదని నేనన్నాను. ఈరోజూ అదే మాటమీద నిలబడుతున్నాను. అదే జరక్కపోతే అది మానవ స్వభావానికి విరుద్ధం"

"ఆమె ఆనందంగా ఉందా? "

"ఇద్దరూ సంతోషంగానే గడుపుతున్నారు"

"చూస్తుంటే, నువ్వు వాళ్ళని అట్టే కలు

స్తున్నట్లులేవు"

"మొదట్లో బాగానే కలుస్తూ ఉండే దానిని. ఈ మధ్య..." మిసెస్ టవర్ పెదిమలు పళ్ళమధ్య నొక్కి పట్టి "జేన్ చాలా పెద్దదైంది" అంది.

"అంటే? ఏమిటి నీ ఉద్దేశం?"

"ఆమె ఈ రోజు, ఈ పార్టీలో ఉందంటే నమ్ముతావా?"

ఇప్పుడు ఆశ్చర్యపోవడం నా వంతయింది. "నిజంగానే? ఇక్కడా?" అని అడుగుతూనే చుట్టూ కలయ జూశాను. మా హోస్టెస్ మంచి ఆవిడే! కానీ ఇలాంటి పార్టీలకి, జేన్ వంటి మామూలు, ఊరు, పేరూ లేని అతిథుల్ని ఆహ్వానిస్తుందని నేను అనుకోను.

నా ముఖ కవళికల్ని బట్టి మిసెస్ టవర్ అర్థం చేసుకుందో ఏమో, చిన్నగా నవ్వుతూ "అదుగో! మన హోస్టెస్‌కి ఎడం పక్కగా కూర్చున్నావిడని చూడు" అంది.

నేనటు చూశాను. అక్కడ కూర్చున్న స్త్రీమూర్తి తన రూపురేఖలతో నేను పార్టీ రూములో అడుగు పెట్టగానే నన్నాకర్షించింది. చూపుల్ని బట్టి ఆమె కూడా చూచాయగా నన్ను గుర్తించినట్టే అనిపించింది. నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు, అటువంటి స్త్రీని ఇంతకుముందెన్నడూ నేను చూసిన గుర్తులేదు. ఆమె కొంత వయసు మళ్లినదే! జుట్టు నెరిసింది. కానీ, అది కత్తిరించి ఉంగరాలుగా చుట్టి ఉంది. వయసుకి తగ్గట్టుగా మేకప్ మాత్రం అంతంత మాత్రంగానే చేసుకుంది. ఆ డ్రస్సు కూడా సుమారు ఒక ఫేన్సీ డ్రస్సులా ఉంది. ఆమె శరీరానికది బాగానే నప్పినా, మరొకరికి ఎబ్బెట్టుగా కనిపించ వచ్చు. సింగిల్ పీస్ ఐ గ్లాసు ధరించింది.

"ఏంటీ? ఆమేనా?" అని అడిగాను.

"ఆహా! ఆమే మిసెస్ జేన్ నేపియర్!" అంది మిసెస్ టవర్ చప్పగా.

నేను జేన్ వైపు దృష్టి సారించి చూసినప్పుడు ఆమె చిన్నగా నవ్వుతూ చుట్టూ ఉన్నవారికి ఏదో చెబుతోంది.

మా హోస్టెస్ ఆమె వైపు తిరిగి కూర్చుని, ఆమె చెప్పేది శ్రద్ధగా వింటోంది. మరొక బట్టతల ముసలాయన రెండో పక్కన కూర్చుని ముందుకు వంగి మరీ వింటున్నాడు. మరొక జంట కూడా వాళ్ళతో కలిసింది. ఆమె చెప్పడం పూర్తికాగానే అందరూ సీట్లలో వెనక్కి జేరబడి నవ్వసాగారు.

టేబిలుకి ఆవల పక్క కూర్చున్న ఓ పెద్ద మనిషి "మీ బంధువు ఇంకొక జోకు వేసింది" అన్నాడు మిసెస్ టవర్‌తో.

ఆమె అలవోకగా నవ్వి ఊరుకుంది.

"జేన్ అమూల్యమైనది కదూ!" అంది మిసెస్ టవర్ నాతో.

"ఏమో! నాకంతా అయోమయంగా ఉంది. ఓ పెగ్గు పడితే గాని సర్దుకునేలా లేదు" అన్నాను సరదాకి.

ఏం జరిగిందో ఆ తరువాత నాకిలా తెలిసింది.

హనీమూన్ ప్రారంభం కాగానే గిల్బర్ట్ ఆమెను ప్రతీ బట్టల షాపుకీ తిప్పాడు. మొదట్లో ఆమె తనకిష్టమైన బట్టలే కొన్నా, రానురాను, సెలక్షనుకి గిల్బర్ట్ మీద ఆధారపడ సాగింది. ప్రస్తుతం ఆమె అతనికిష్టమైన, బిగుతుగా ఉండే, సిల్కు డ్రస్సులు మాత్రం వేసుకుంటోంది. మరి ఈ వయ

**కొత్తగాలి...**

**విలువల్లేని**
**తనువు**
**వేళ్లు లేని**
**తరువు!**

– కృష్ణ మాధవరపు,
కాకినాడ

సులో అలా బైట తిరిగినా ఆమెకు జలుబు ఎందుకు చేయడంలేదో నాకర్థం కాలేదు.

ఇంక ఆమె పెట్టుకునే భూతద్దాల కళ్ళ జోడు అతనికసలు నచ్చలేదు. బంగారం ఫ్రేము మార్చి చూశాడు. రంగులు మార్చాడు. ఊహు.. నప్పలేదు. ఆఖరికి సింగిల్ పీస్ ఐ గ్లాసు కొన్నాడు. ఆమె జుట్టు కత్తిరించి, ఉంగరాలు పెట్టించిన వాడు కూడా అతనే.

చిత్రమేమిటంటే, అతన్ని సంతోషపెట్ట డానికి తనకిష్టం ఉన్నా లేకపోయినా, బాహ్యాలంకరణలో మార్పులు అతను చెప్పినట్టు చేసింది. ముందు కొంత సిగ్గు పడినా రాను, రాను వాటికి అలవాటు పడి పోయింది జేన్. అంతేకాదు, ఆ తరవాత వాటినే ఇష్టపడసాగింది కూడా.

"కానీ, జేన్ ఈ రోజు ఇంతమందిని ఈ పార్టీలో ఆకర్షించడానికి ఇదొక్కటే కారణం అనుకోను" అన్నాను.

మిసెస్ టవర్ మనసులో కుళ్ళిపోతోం దనేందుకు ఏ మాత్రం సందేహం లేదు. ఆమె మాటల్లో, చేతల్లో, ముఖంలో ఆ విషయం ప్రస్ఫుటమౌతూనే ఉంది.

"జేన్ తాము తిరిగి వస్తున్నామని రాసినపుడు, వాళ్ళని పార్టీకి ఆహ్వానిద్దా మని నిశ్చయించుకున్నాను నేను. నా కంత ఇష్టం లేకపోయినప్పటికీ అది మర్యాద లక్షణం కాబట్టి పిలవక తప్పదు. నాకు దగ్గర మిత్రులైన పెద్ద మనుషులం దరినీ పిలవాలనుకున్నాను. అంతే కాకుండా సమాజంలో మర్యాదస్తులెందరో నా మిత్రులన్న విషయం ఆమెకి తెలియజె ప్పాలంటే ఇదొక విధానం. సాధారణంగా నేను ఏడెనమండుగురు కంటే ఎక్కువ మందిని విందుకి పిలవను. కాని ఈ సారి కనీసం పన్నెండు మంది తేలారు.

ఆ విందు నాటి సాయంత్రం నాకు జేన్‌ని కలిసే అవకాశం లేకపోయింది. ఆమె కోసం మేం కొంత వేచి ఉండవలసి వచ్చింది. అవి గిల్బర్ట్ తెలివి తేటలు. అప్పుడు వచ్చిందామె. ఆ సమయంలో నువ్వు చూసి ఉండాల్సింది ఆమెను. ఆ అలంకరణ ముందు, అక్కడున్న ఆడవా ళ్ళంతా దిగదుడుపే! ఆమె ధరించిన డ్రస్సు వర్ణించడమే గొప్పపని. ఇక 'ఐ గ్లాసు' గురించి చెప్పనే అక్కరలేదు. ముప్పై ఏళ్లుగా వాడే భూతద్దాల కళ్ళ జోడు తీసి పారేసింది"

"కానీ, ఆమెది మంచి పర్సనాలిటీ అని ఎరుగుదువు కదా!"

"కానేం తెలుసు? ఆ బట్టల్లో ఆమె అంత ఆకర్షణీయంగా కనిపిస్తుందని! ఆ విషయం ఆమె పట్టించుకున్నట్టుగా కూడా కనిపించదు. డిన్నరు టేబిలుకి అటు చివ రగా కూర్చుంది. అక్కడ చేరిన వారం దరూ పెద్దగా నవ్వుతున్నారు. నా అతి థుల్ని ఆమె అలా ఎంటర్‌టెయిన్ చేస్తు న్నందుకు నాకు సంతోషంగానే ఉన్నా, పార్టీ పూర్తయ్యాక, ఇద్దరుముగ్గురు అతి థులు జేన్‌ని మెచ్చుకుంటూ, తమ యిళ్ళకి ఆహ్వానించినప్పుడు మాత్రం మతిపో యింది నాకు. నేను తలకిందులుగా నిల బడ్డానేమోననిపించింది. ఇరవై నాలుగ్గం టలు తిరక్కుండా, ఇదుగో ఈ రోజు విందు చేస్తున్నావిడ నాకు ఫోను చేసి, జేన్ ఇక్కడే ఉన్నట్టు తెలిసిందనీ, ఎలా గైనా తమ యింటికి భోజనానికి తన తరఫున ఆహ్వానించి తీసుకురమ్మని కోరింది. నెల గడిచిందో లేదో, సంఘంలో అంతా జేన్ గురించే చర్చలు. నేనీరోజు ఈ విందుకు రావడానికి కారణం ఆమెతో నాకున్న ఇరవై ఏళ్ల పరిచయం కాదు. నేను జేన్‌కి దగ్గర బంధువుని కాబట్టి"

పాపం! మిసెస్ టవర్‌ది దయనీయ మైన పరిస్థితి. ఆమె ఆ విధంగా దెబ్బతి నడం నాకో విధంగా సంతోషంగా ఉన్నప్ప టికీ, ఒక పక్క జాలిగా కూడా ఉంది.

"నవ్వించే మనుషులు ఎదుటి వారిని



ఇట్టే ఆకట్టుకోగలుగుతారు" అన్నాను ఆమెను ఓదార్చే ప్రయత్నంతో.

"జేన్ నన్నెప్పుడూ నవ్వించలేక పోయింది" అంది మిసెస్ టవర్.

మరోసారి అందరూ విరగబడి నవ్వడం వినిపించింది. జేన్ మరో జోకు వేసింది అనుకున్నాను.

"అయితే, ఆమెకంత సరదాగా ఉండడం తెలియదని నువ్వొకతెవేనా అనుకునేది? "

"ఆమెకన్నీ తెలుసనుకుంటున్నావా? "

"నాకామెలో అంత ప్రత్యేకత ఏమీ కనిపించలేదు"

"ఏముంది? చెప్పినవే చెప్పుతుంది. నేను గత ముప్పై ఏళ్లుగా వినివిని విసిగి పోయాను. అందరితో కలిసి మర్యాద కోసం నవ్వుతాను తప్ప, నాకవన్నీ పాత చింతకాయ పచ్చడే!"

## కొత్తగాలి...

**బతికుంటే**
**నువ్వు మట్టిమీద!**
**మరణించావా**
**మట్టి నీ మీద!**

– కె.వి. సుబ్రహ్మణ్యం,
సింహాచలం

మాట మారుద్దామనే ఉద్దేశంతో, "గిల్బర్ట్ పార్టీకి వచ్చినట్టు లేదే!" అన్నాను.

"అతన్ని వదిలి ఆమె ఎక్కడికీ పోదు. కానీ ఈ రాత్రి అతనికి ఆర్కిటెక్టుల అసోసియేషన్ మీటింగు ఉందట. అందువల్ల రాలేదతను"

"నేను మళ్లీ ఆమెతో పరిచయాన్ని పెంచుకుందామని అనుకుంటున్నాను"

"పార్టీ పూర్తవగానే వెళ్లి ఆమెని కలుసుకో. మంగళవారంనాడు ఇంటికి రమ్మని ఆహ్వానం అందుతుంది"

"మంగళవారమా? "

"ప్రతీ మంగళవారం ఆమె ఇంటి దగ్గరే ఉంటుంది. ఆ రోజున అక్కడ రకరకాల పెద్ద మనుషుల్ని కలుసుకోవచ్చు. ఆమె ఇచ్చే విందులు లండన్‌లో పేరెన్నికగన్నవి. నేను ఇరవై ఏళ్లలో సాధించలేనిది ఆమె ఒక సంవత్సరంలో సాధించింది"

"నువ్వు చెప్పుతున్నది నమ్మశక్యంగాకుండా ఉంది. ఇంతలో అంత మార్పు ఎలా సాధ్యం అయింది? "

మిసెస్ టవర్ భుజాలెగర వేసింది.

"ఆ విషయం నువ్వే నాకు చెప్పగలిగితే సంతోషిస్తాను" అంది.

విందు పూర్తి కాగానే నేను జేన్ కూర్చున్న సోఫా దగ్గరికి వెళ్లాను. కానీ నాలాంటి వాళ్ళప్పటికే ఆమె చుట్టూ చేరి ఉన్నారు. వెనక లైనులో ఉండిపోయిన నాకు కొంతసేపటికి కాని ఆమెను చేరే అవకాశం రాలేదు.

మా హోస్టెస్ నా చేయిపట్టుకుని "మా పార్టీకి స్టార్‌ని నీకు పరిచయం చేస్తాను రా!" అని తీసికెళ్ళి "మిసెస్ జేన్ నేపియర్‌ని నువ్వెరుగుదువా? ఆమె అమూల్యమైన స్నేహితురాలు. ఆమె చెప్పే కథలు నువ్వు రాసే కథల కంటే ఎక్కువ హాస్యాన్ని ఒలకబోస్తూ ఉంటాయి తెలుసా? " అంటూ నన్ను పరిచయం చేసింది.

నేనామెతో కలిసి జేన్ దగ్గరికి వెళ్లేసరికి ముందు నేను చెప్పిన ఆర్మీ ఆఫీసరు ఇంకా ఆమెను విడిచిపెట్టలేదు. ఇప్పుడప్పుడే కదిలేలా లేడు కూడా. జేన్ నన్ను పలకరించి, అతన్ని నాకు పరిచయం చేసింది "ఎడ్మిరల్ రెజినాల్డ్ ఫోర్బిషర్‌ని మీరెరుగుదురా? " అంటూ.

మేం మాటల్లో పడ్డాం. ఆమె ఒకప్పటి నేనెరిగిన జేన్ మాత్రమే? కానీ బాహ్యరూపంలో వచ్చిన మార్పులు బ్రహ్మాండంగా ఉండి, ఆమె వ్యక్తిత్వం ఒక ప్రత్యేకతని సంతరించుకుంది. ఆమె ఏం మంత్రం వేసిందో! ఉన్నట్టుండి ఆమె మాటలకి నేను నవ్వసాగాను. ఆమె మాట్లాడే తీరు, ఆ 'ఐ గ్లాస్'ని ధరించే విధానం అన్నీ అద్భుతం.

జేన్ అంత పాపులర్ అయిందంటే ఆశ్చర్యపడలసిన అవసరం లేదు. నేనామె వద్ద సెలవు తీసుకుని వచ్చేస్తుండగా "ఈ మంగళవారం మీకేమీ ముఖ్యమైన పనులు లేకపోతే, మా యింటికి విందుకు రావలసింది. గిల్బర్ట్ మిమ్మల్ని చూస్తే చాలా సంతోషిస్తాడు" అని ఆహ్వానించింది.

"ఆయన నెల రోజులుగా లండన్‌లో ఉన్నవాడైతే, స్వయంగా తనే తెలుసుకుంటాడు మీ యింట్లో విందుకంటే ముఖ్యమైనది మరేమీ ఉండదని" అన్నాడు ఇంకా పక్కనే కూర్చున్న ఎడ్మిరల్ రెజినాల్డ్ ఫోర్బిషర్.

ఆ మంగళవారం నాడు కొంచెం ఆలస్యం అయినా జేన్ ఇచ్చే విందుకి వెళ్లాను నేను.

అక్కడున్న అతిథుల్ని చూసి ఆశ్చర్యపోయాను. వారంతా సంఘంలో పేరు ప్రఖ్యాతులున్న రచయితలు, కళాకారులు, రాజకీయనాయకులు, నటీనటులు, పేరు మోసిన స్త్రీ జనం, అందాల భామలు, ఒక రేమిటి? నగరంలో గొప్పవాళ్లుగా లెక్కించ దగిన వారంతా అక్కడ ఉన్నారు.

మిసెస్ టవర్ చెప్పింది నిజమే. ఆ పార్టీ రాత్రి రెండు గంటలవరకు సాగింది.

ఆ తరవాత నేనామె ఇంటికి తరచూ వెళ్ళసాగాను. అంతేకాక ఆమె పక్కన లేకుండా బయట లంచ్, డిన్నరు అరుదుగా చేసే వాడిని.

నాకు హాస్యం అంటే చాలా ఇష్టం. కనుక ఆమెలో ఉన్న ప్రత్యేకత ఏమిటో తెలుసుకోవాలని ఉండేది. ఆమె మరీ అంత తెలివైన ఘటం ఏమీ కాదు, కాక పోతే ఎవరినీ నొప్పించకుండా తియ్యగా మాట్లాడుతుంది.

హాస్యం తెచ్చిపెట్టుకున్నట్టు గాక చాలా సహజంగా ఉంటుంది. సీతాకోక చిలక ఒక పువ్వు నుంచి మరొక పువ్వు మీదికి ఎగిరినంత సుతారంగా మాట్లాడుతుందామె. దీని రహస్యం అంతా గిల్బర్ట్, ఆమె బాహ్యాలంకరణలో తీసుకొచ్చిన మార్పుల్లో ఉందే మోననిపిస్తుంది. అది కూడా ఆమె నేర్పరితనంలో ఒక భాగంగా మనం గుర్తించాలి.

ఇప్పుడు జేన్ ఒక ఫేమస్ గురువు. ఆమె నోరు విప్పితే చాలు ప్రజలు జేజేలు కొడుతున్నారు. వారిలో ఏ ఒక్కరికీ గిల్బర్ట్ లాంటి నవయువకుడు ఒక వయసు మళ్ళిన స్త్రీని ఎందుకు వివాహం చేసుకున్నాడన్న ఆలోచనే లేదు. జేన్ లాంటి స్త్రీ మూర్తికి వయసుతో పనిలేదని వారి భావన.

గిల్బర్ట్ తిరుగులేని అదృష్టవంతుడు. అనుకోని ఈ విజయానికి అతను చాలా సంతోషంగా ఉన్నాడు. అతన్ని నేనర్థం చేసుకున్న కొద్దీ అతనంటే ఇష్టపడసాగాను. స్వతహా అతను దుర్మార్గుడు కాదని, డబ్బుకాశపడే మనిషికాదని అతని చేతల ద్వారా స్పష్టం అవుతూనే ఉంది. అతను జేన్‌ని ఆరాధించడమే కాక ఆమె కోసం చాలా త్యాగం చేశాడు కూడా. అతనిలో స్వార్థం లేదు. ఆమె అంటే అతనికి జాలి, దయ..

ఒకనాడు "జేన్ గురించి ఇప్పుడు మీరేమనుకుంటున్నారు? " అడిగాడు నన్ను.

"మీ యిద్దరిలోనూ గొప్ప వారెవరన్నది తేల్చుకోలేక పోతున్నాను" అన్నాను.

"ఆః! నాదేముంది లెండి" అన్నాడతను మర్యాదగా.

"అదేం కాదు. జేన్ అంతగా మారిపోవడానికి కేవలం మీరే కారణం"

"నేను చేసిందల్లా ఒక్కటే. ఆమెలో మరుగున పడి ఉన్న ఒక రహస్యాన్ని కనిపెట్టి, బయటికి తీసుకురాగలిగాను"

"ఆమె బాహ్యాలంకరణలో మీరు తీసుకొచ్చిన మార్పులు నేను అర్థం చేసుకోగలను. కానీ ఆమెనొక హాస్యపు జల్లుగా ఎలా తీర్చిదిద్దగలిగారు? "

"ఆమె ఎప్పుడూ అలాగే ఉంది"

"ఆమెనర్థం చేసుకున్నది మీరొక్కరే!"

మిసెస్ టవర్ కూడా గిల్బర్ట్‌ని అంచనా వేయడంలో పొరబడినట్టు సగౌరవంగా అంగీకరించింది. కానీ, నవ్వు వచ్చే విషయమేమిటంటే, ఇంత జరిగినా వారి వివాహం నిలుస్తుందని మాత్రం మిసెస్ టవర్ ఏనాడూ ఒప్పుకోలేదు.

"అంత ఆప్యాయంగా, అన్యోన్యంగా ఉండే జంటని నేనెప్పుడూ చూడలేదు" అన్నాను నేను, మిసెస్ టవర్‌తో వారి విషయంలో.

గిల్బర్ట్‌కి ఇప్పుడు ఇరవై ఏడేళ్ళు. అంద

## కొత్తగాలి...

**కుక్కపిల్లను**
**అల్లారుముద్దుగా పెంచుతున్నారు**
**అల్లారుముద్దుగా పెంచిన**
**తల్లిదండ్రులను**
**వృద్ధాశ్రమాలకు తరలిస్తున్నారు**

– టి. హేమలత,
మచిలీపట్నం

మైన ఆడపిల్ల ఎవరైనా మనసు పారేసుకునే వయసది. ఆ రోజు జేన్ ఇచ్చిన విందులో, నువ్వు గమనించావా? ఎడ్మిరల్ రెజినాల్డ్‌తో వచ్చిన యువతి, అతని మేనకోడలు. జేన్ ఆమెనీ, గిల్బర్ట్‌నీ మార్చి మార్చి చూడడం? దానికర్థం ఏంటి? "

"ఈనాడు జేన్, అలాంటి ఆడమనిషి, తన ప్రియుడిని కొట్టేస్తుందని భయపడుతుందని అనుకోను"

"కొన్నాళ్లాగి చూడు నీకే తెలుస్తుంది"

"అప్పుడు నువ్వు ఆరు నెలలు ఇచ్చావు"

"సరే! ఇప్పుడు మూడేళ్ళు ఇస్తున్నాను"

★ ★ ★

ఏదైనా ఒక విషయంలో ఒకళ్ళు తిరుగులేని నమ్మకంతో ఉన్నప్పుడు, వాళ్ళు ఓడిపోతే చూడాలనుకోవడం మానవ సహజం.

మిసెస్ టవర్‌కి తన నమ్మకంలో ప్రగాఢమైన విశ్వాసం ఉంది. అయితే నాకు మాత్రం అసంతృప్తి మిగల్లేదు. ఎందుకంటే, ఆఖరికి వారి వివాహం విషయంలో ఆమే గెలిచింది.

కానీ విధి కూడా విచిత్రమైంది. మనకి కావలసింది లభించినా, అది కావలసిన విధంగా లభించకపోవడంలో, విధి చేయి తప్పకుండా ఉండి తీరుతుంది. చూడండి! మిసెస్ టవర్‌కి తను చెప్పిందే నిజమయిందన్న సంతృప్తి మిగిలినా ఆ జరగడం మాత్రం ఆమె అనుకున్నట్టు జరగలేదు.

మిసెస్ టవర్ ఒకనాడు నన్నర్జంటుగా రమ్మని కబురు పెట్టింది. అదృష్టవశాత్తు నాకు మరేమీ పని లేకపోవడంతో వెంటనే బయల్దేరి వెళ్లాను. నేను హాలులో ప్రవేశించగానే, మిసెస్ టవర్, లేడిని చూసి చిరుతపులి దూకినంత వేగంతో నాకెదురు వచ్చింది. ఆమె చాలా ఉత్సాహంగా ఉంది.

"జేన్- గిల్బర్ట్‌లు విడిపోయారు" అంది ఉన్నట్టుండి.

"నిజంగానా? ఆఖరికి నీ అంచనాయే నిజమయింది" అన్నాను.

ఆమె ముఖకవళికల్ని బట్టి మనసులో భావాల్ని చదవలేకపోయాను నేను. "పాపం! జేన్" అన్నాను.

"పాపం! జేన్" అంది మిసెస్ టవర్. కాని ముఖంలో చూపించిన భావాలు మాత్రం నన్నాశ్చర్యంలో ముంచెత్తాయి. అసలేం జరిగిందో వివరించడానికి ఆమె ఇరకాటంలో పడ్డట్టుంది.

జరిగిందిది..

మిసెస్ టవర్ నాకు ఫోన్ చేసే ముందే గిల్బర్ట్ ఆ యింటి నుంచి వెళ్ళాడు. అతను వాడిపోయిన ముఖంతో తన ఇంటికి వచ్చినప్పుడే జరగరానిదేదో జరిగి ఉంటుందని ఊహించింది మారియన్. అతను నోరు విప్పకముందే 'జేన్ నన్ను విడిచిపెట్టింది' అని చెప్పబోతున్నాడని ఆమెకు తెలుసు. అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని ఓదార్చింది.

"మీలో ఏమీ లోపం లేదని నాకు తెలుసు. జనాలు మీరే ఆమెని విడిచిపెట్టారనుకోవడం ధర్మం కాదు" అంది.

"మీరు మాత్రమే నన్ను అర్థం చేసుకోగలరు. అందుకే నేను మిమ్మల్ని చూడడానికి వచ్చాను"

"గిల్బర్ట్ మీరేమీ బాధపడకండి. ఇందులో మీ తప్పేమీ లేదు. ఇది ఇలాగే జరగవలసి ఉంది"

అతను నిట్టూర్చాడు.

"అంతే! ఎల్లకాలం ఆమె నాతోనే కలిసి జీవించాలని నేను ఆశించలేదు. ఆమెది అంత చక్కని పర్సనాలిటీ. నేనేమో మా మూలు సగటు మనిషిని"

మారియన్ అతని చేతిని అలవోకగా నొక్కింది. అతను చక్కగా పెద్దమనిషిలా ప్రవర్తిస్తున్నాడు.

"ఇక ముందు కార్యక్రమం ఏంటి? "

"ఆమె నాకు విడాకులిస్తుంది"

"మీరెప్పుడైనా ఆమెతో విడిపోయి మరొక అమ్మాయిని పెళ్ళిచేసుకోదల్చు కుంటే తనకేమీ అభ్యంతరం ఉండదని జేన్ నాతో అంటూ ఉండేది"

"ఒకసారి జేన్ భర్తనైన నేను మరొక వివాహం చేసుకునే ప్రసక్తే లేదు. ఆమె నా ఆరాధ్యదేవత"

మారియన్ ఖంగు తింది. "అంటే? జేన్‌ని మీరే వదిలేస్తున్నారా? "

"నేనా? అలా ఎన్నటికీ జరగదు"

"మరి? జేన్ మీకెందుకు విడాకులి స్తోంది? "

"జేన్, ఎడ్మిరల్ రెజినాల్డ్‌ని పెళ్లి చేసు కోబోతోంది"

మారియన్ అపనమ్మకంతో ఓ అరుపు అరిచింది. మూర్ఛపోయినంత పని అయిందామెకు.

"మీరామెకు చేసిన సహాయానికి ఇంత నమ్మకద్రోహమా? "

"నేనేమీ సహాయం చేయలేదామెకు"

"ఆమె మిమ్మల్ని ఉపయోగించుకుని వదిలిపెడితే చూస్తూ ఊరుకుంటారా? "

"మా ఇద్దరిలో ఎవరు ఎప్పుడు కావాల నుకున్నా, ఒకరినొకరు వదిలిపెట్టి వెళ్ళిపో వడానికి అభ్యంతరం చెప్పకూడదని పెళ్లికి ముందు ఒప్పందం కుదుర్చుకున్నాం"

"కానీ అది మీ కోసం. మీరు ఆమె కంటే ఇరవై ఏడేళ్ళు చిన్న"

"అదే ఆమెకు బాగా ఉపయోగపడింది"

జేన్ చేసిందంతా తప్పని ఋజువు చేయడానికి మారియన్ శాయశక్తులా ప్రయత్నించింది.

కానీ, జేన్ విషయంలో ఏ నియమాలూ వర్తించవనీ, అంతా ఆమె కోరిక ప్రకారమే జరగాలనీ చెప్పాడు గిల్బర్ట్.

ఇదంతా మిసెస్ టవర్ ద్వారా విన్నాక నేను చాలా ఆశ్చర్యపోయాను. తనతో ఏకీ భవించే వాడొకడున్నాడని మిసెస్ టవర్ తృప్తి పడింది.

ఇంతలో తలుపు తెరుచుకుంది. నౌకరు ముందు రాగా, జేన్ ప్రవేశించింది. ఆమె చక్కని నలుపు, తెలుపు రంగు బట్టలు ధరించి, నెత్తిపై పెద్ద టోపీతో అద్భుతంగా కనిపిస్తే, నేను తేరిపార చూస్తూ ఉండిపో యాను. కానీ ఆమె అదేమీ లెక్కచేయ కుండా తిన్నగా పోయి మారియన్‌ని ముద్దు పెట్టుకోబోయింది.

మారియన్ వెనక్కి తగ్గి "గిల్బర్ట్ వచ్చి వెళ్ళాడు" అంది.

"నాకు తెలుసు" చిరునవ్వు చిందిస్తూ అంది జేన్.

"నేనే అతన్ని నీ దగ్గరికి పంపాను. ఈ రాత్రికి నేను పారిస్ వెళ్తున్నాను. నేను లేని నాలుగు రోజులూ నువ్వతన్ని కనిపె ట్టుకుని ఉండాలి. లేకపోతే అతను చాలా ఒంటరితనం ఫీల్ కావచ్చు. నీకప్పగిస్తే నేను నిశ్చింతగా వెళ్లి రావచ్చు"

"గిల్బర్ట్ నాకు చెప్పిన వార్త నమ్మలేని దిగా ఉంది. నువ్వతనికి విడాకులివ్వడ మేంటి? ఎడ్మిరల్ రెజినాల్డ్‌ని పెళ్లి చేసు కోవడమేంటి? "

"నువ్వు మరిచిపోయావా? నేను గిల్బర్ట్ ని పెళ్లి చేసుకునేముందు, నువ్వే సలహా ఇచ్చావు. నాతో సమాన వయస్కుడిని పెళ్లి చేసుకోమని. ఎడ్మిరల్ రెజినాల్డ్‌కి ఏభై మూడేళ్ళు"

"కానీ, జేన్! గిల్బర్ట్ నీకింత చేశాడు. అతను లేని నీ జీవితానికి అర్థం ఉందా?

ఆఖరికి నీ బట్టల డిజైన్ దగ్గర్నుంచి అంతా అతనే చేశాడు"

"అయితేనేం? ఇక ముందు కూడా నా బట్టలు అతనే డిజైన్ చేస్తాడు"

"దేముడిలాంటి భర్త గిల్బర్ట్. అలాంటి వాడిని వదిలిపెట్టడానికి నీ మనసెలా ఒప్పింది? "

"అది మాత్రం నిజం. అతనెంతో మంచి వాడు. అతనికి నేనంటే చాలా ఇష్టం"

"మరి నువ్వంత దయాహీనంగా ఎందుకు ప్రవర్తిస్తున్నావు? "

"నిజం చెప్పాలంటే, మొదటినుంచీ, గిల్బర్ట్ అంటే నాకంత ప్రేమలేదు. నాతో సమాన వయస్కుడైన వాడినే పెళ్లి చేసు కుందామనుకుంటున్నానని అతనితో చెప్పాను" అని కొంచెం ఆగి, చిరునవ్వుతో మళ్లీ ఇలా అంది "ఏమయినా, అతను నా దగ్గర్నుంచి దూరం కాకుండా జాగ్రత్త పడ్డానులే! ఎడ్మిరల్ రెజినాల్డ్‌కి వయ సులో ఉన్న ఒక మేనకోడలు ఉంది కదా! వీళ్ళిద్దరినీ మాతో మా దగ్గరే ఉంచుకుం టాం. వాళ్ళిద్దరూ కలిసి తిరుగుతూ ఉంటే, సహజంగా ప్రేమలో పడవచ్చు"

మారియన్ ముక్కుతూ, జేన్‌తో అంది "అంతే కాకుండా ఈ ఎడ్మిరల్‌తో కూడా నీ యిష్టం వచ్చినపుడు విడిపోవడానికి ఒప్పందం కుదుర్చుకునే ఉంటావు"

"నేనీ విషయం ఎడ్మిరల్‌తో ముచ్చటిం చాను కానీ, అతను తన మంచిచెడ్డలు తెలుసుకోగలననీ, ఒకసారి నన్ను చేసుకు న్నాక మరొక స్త్రీ గురించి తను ఆలోచించే ప్రసక్తే లేదనీ చెప్పాడు. ఇంకా, మరొక ఆగంతుకుడెవడైనా నా విషయంలో జోక్యం చేసుకుంటే, తన దగ్గర పన్నెండం గుళాల తుపాకులు ఎనిమిది ఉన్నాయని, తానెప్పుడూ గురి తప్పననీ, షార్ట్ రేంజిలో బలాబలాలు తేల్చుకుంటాననీ, కచ్చితంగా చెప్పాడు రెజినాల్డ్"

మిసెస్ టవర్‌కి కోపం వస్తే వచ్చింది కానీ, నేను భళ్ళున నవ్వకుండా ఉండలేక పోయాను.

"ఎడ్మిరల్ రెజినాల్డ్ చాలా దయా హృదయుడు" అన్నాను నేను.

మిసెస్ టవర్ నా వైపు కోపంగా చూసి, జేన్‌ని ఉద్దేశించి "నువ్వంత సరదా మనిషి వని నేననుకోలేదు" అంది.

"నేను సరదా మనిషినని నేనే ఎప్పుడూ అనుకోలేదు" అంది జేన్.

"అదృష్టవశాత్తూ సంఘంలో మిగిలిన వారందరూ కూడా మనలాగే అనుకునే కంటే, ముందుగానే నేను నగరాన్ని విడిచి పెట్టి వెళ్తున్నాను"

"నీ విజయ రహస్యం నాకు చెప్పి మరీ వెళ్ళు" అన్నాను.

ఆమె నా వైపు చూసి చెప్పింది "నన్ను చూసి నా మాటలకి ప్రజలు నవ్వుతూ ఉంటే ఎందుకో నాకే అర్థం కాలేదు. గిల్బర్ట్‌ని వివాహం చేసుకునే ముందు, ముప్పై ఏళ్లుగా నేనదే మాట్లాడినప్పుడు, ఇదే ప్రజలకి అందులో విశేషమేమీ కనిపిం చలేదు. మొదట్లో, మారిన నా బాహ్యా రూపం అనుకున్నాను. తరవాత నేను నిజాన్ని నిజంగా చెప్పడం వల్లనేమో అని పించింది. సాధారణంగా నిజాన్ని నిజంగా స్వీకరించడం చాలా మందికి హాస్యాస్ప దంగా ఉండొచ్చు"

"అలా అయినప్పుడు, అది నాకొక్కతికే హాస్యంగా అనిపించక పోవడానికి కారణం? " అడిగింది మారియన్.

జేన్ కొంచెంసేపు తటపటాయించింది. ఆమె నిజంగానే సరైన సమాధానం కోసం తడుముకుంటున్నట్టుంది.

"నువ్వు చూస్తున్నదే నిజమని నీకే తెలి యదేమో.. మారియన్!" అంది జేన్ సమాధానంగా.

దానికి తిరుగులేదు. జేన్‌దే ఎప్పుడూ పై చేయి అనిపించింది నాకు.

అవును.. ఆమె అమూల్యమైనది! 

# 'క్షోభ'నం

- శంకరనారాయణ

**రూ**పాయి కాసంత బొట్టు పెట్టుకున్న మా బామ్మ నన్ను ముందుకు నెట్టింది. కాస్తంత కాలు జారినా పాలగ్లాసు పట్టుకున్న నేను ఎలాగో నిలదొక్కుకున్నాను. బామ్మ మాట బంగారు బాట కదా! ఆమె మాట వినాల్సిందే. బామ్మ అర్హతలు కూడా అలాంటిలాంటివి కావు. బామ్మ అంటే బి.ఏ., డబుల్ ఎం.ఏ.

అసలు కథ పరమ రహస్యం. ఎవరికీ చెప్ప కండి. అది నా మొదటి రాత్రి! పెళ్లి నడక మెల్లగా ఉంటుంది గానీ శోభనం నడక గురించి తెలీదు. గుడ్డిగా వెళ్లాను. మొదటి రాత్రి అని మొదట అన్నవాడెవడో గానీ వాడిదంతా బు. త(బుద్ధి తక్కువ). పుట్టినప్పటి నుంచీ ఎన్నో రాత్రులు వస్తుంటాయి. పోతుంటాయి. అది తొలిరాత్రి ఎలా అవుతుంది? అంటే ఎవరూ చెప్పరు. మొత్తం మీద పాలగ్లాసుతో గదిలో ప్రవేశించాను. గదిలో అడుగుపెట్టగానే బిత్తరపో యాను. మొగుడుగారు గురకపెడుతూ నిద్రపో తున్నారు! కాగల కార్యం గంధర్వులు తీరుస్తారం టారుగానీ ఇటువంటి విషయాల్లో ఎవ్వరూ ఉప యోగపడరు. స్వయంకృషి తప్ప!

## చతుర కతే

మంచం మీద పక్కన కూర్చుని లేపి కూర్చోపె ట్టడానికి నా తల ప్రాణం మొలలోకి వచ్చింది(తోకలోకి వచ్చిందని అనొచ్చుగానీ నాకు తోక ఎక్కడ చచ్చింది?'). ఎంత మొగుడైనా కొత్త కదా! రూల్సు ప్రకారం సిగ్గులు ఒలకపో యాల్సిందే. పాలగ్లాసు ఆయన చేతికిచ్చాను. ఆయన దానిని పక్కన పెట్టారు. అర్థాంగిని కదా అర్థభాగం నన్ను తాగమంటారని ఆశపడ్డాను. అయినా ఆడదాని ఆశ అంత తొందరగా ఎలా నెరవేరుతుంది? ఆయన చేత ఎలాగూ నీళ్లు తాగించలేను! కనీసం పాలు అయినా తాగించా ల్సిందే అనుకున్నాను.

'ఏమండీ పాలవేడి తగ్గుతుంది. చల్లబడక ముందే తాగండీ' అన్నాను, చొరవ తీసుకుని! అప్పుడాయన పాలు 'షుగర్ లెస్సా?' అన్నారు.

'సారీ! కాదండీ!' అంటే 'షుగర్ లెస్ తీసుకురా' అన్నారు.

అపుడు నేను 'బెల్లం ఫర్వాలేదుగా!' అన్నాను. అప్పుడాయన 'బెల్లం సంగతి కాదు.. షుగర్ లెస్ కాఫీ కావాలంతే' అన్నారు.

వెళ్లి అమ్మను అడిగాను. ఆమె పొయ్యిమీద కాఫీ, కంటతడి పెట్టింది. ఏం చేస్తాను! తాళి కట్టించుకున్న తర్వాత ఖాళీ అయినా ఊరుకోవా ల్సిందే.

మళ్లీ షుగర్ లెస్ కాఫీ తెచ్చాను.. అప్పటికీ ఆయన గ్లాసు తీసుకోలేదు. ఏమిటి సంగతి? అన్నారు. నేను ఏమీ మాట్లాడలేదు. 'మొదటి రాత్రి గురించి నెట్‌లో నిన్నటి నుంచి కొడుతు న్నాను. మ్యాటర్ ఏమీ దొరకలేదు. రాత్రంతా టీలు తాగేసి మేలుకోవడం అన్న పాయింటు ఒక్కటే కనిపించింది' అన్నారు.

అప్పటికీ 'మౌనమే నా భాష ఓ మూగమ నసా!' అయింది నా పరిస్థితి. నాతో ఉలుకూ పలుకూ లేకుండా సెల్‌ఫోన్ చేతిలోకి తీసుకు న్నారు. 'సెల్లునయినా కాకపోతిని త్రిల్లు డ్రిల్లు చేయగా' అన్నట్టయింది. బిజీబిజీగా ఉన్నారు. సెల్‌లో ఫేస్‌బుక్ ఓపెన్ చేశారు.

శోభనం గదిలో పెళ్లాం ఫేస్ చూడకుండా ఫేస్‌బుక్ చూడడమేమిటని నాకు తెగ చిరాకే సింది.

'నా ఫ్రెండ్ రిక్వెస్ట్ నువ్వు ఇంకా యాక్సెప్ట్ చెయ్యలేదా?' అన్నారు నిలదీసినట్టు. సెర్చ్ అంతటితో పూర్తి కాలేదు. ఇక లైకులు కొట్టేదె ప్పుడు? కామెంట్లు చేసేదెప్పుడు? అనుభూతులు షేర్ చేసుకునేదెప్పుడు?

దాంతో నాకు మల్లెపూల మత్తు దిగిపో యింది. అయితే ఆయనలో మత్తు లక్షణాలు కనిపించాయి. కొంపదీసి 'బుడ్డి'మంతుడు కాదుగా అన్న అనుమానం వచ్చింది. ఏ దేవుడు కరుణించాడో పతి దేవుడు ఫోన్ పక్కన పెట్టాడు.

'అమ్మయ్య' అనుకున్నాను. అహమహమికతో ఉన్నాను. ఎలా ఉంటాడో ఏమో అన్న ఆలోచన బుర్ర తొలుస్తోంది. కొన్నాళ్ల కిందట 'ప్రతి మగాడూ ఇంజనీరే! ఎటొచ్చీ పెళ్లి అయిన కొత్తలో హార్డ్‌వేర్.. కొంతకాలం సాఫ్ట్‌వేర్.. ఆ



తర్వాత అంతా 'మెకానికల్' అంటూ నాకు బాగా క్లోజ్ అయిన ఆంటీ అనుభవంతో చెప్పిన విషయం గుర్తొచ్చింది. అప్పుడు ఆ విషయం 'యాంటీనేమో' అనుకున్నాను. ఇప్పుడు అది నిజ మేనేమో అనిపిస్తోంది.

ఎలా రాసిపెడితే అలా అవుతుందిలే అనుకు న్నాను. అయినా మగాళ్లను నమ్మడానికి వీల్లేదు. మొగుడుగారు అకస్మాత్తుగా లైట్లు తీసేశారు. నాకు అనుమానం ఎక్కువయింది. అతడిలో పారదర్శకత్వం లోపించిందనిపించింది. ఇదేదో కుట్రలాగుంది. నాకు తెలియకుండా ఏదో జరిగి పోతోందనిపించింది. మొదటిరాత్రి కాకుండా మొదటిపగలు అని ఏడవచ్చుగా అని పెద్దాళ్ల మీద పీకల్దాకా కోపం వచ్చింది. అసలే కరెంట్ కట్ రోజులు. ఇన్వర్టర్ లేకపోతే ఇబ్బంది. ఆలో చిస్తుండగానే పతిదేవుడు నన్ను దగ్గరికి తీసుకు న్నారు. క్షణాల్లో పంపు కొట్టడం మొదలుపె ట్టాడు. 'నిన్ను పెళ్లి చేసుకోగానే అలెగ్జాండర్ గొప్ప సింహాసనం ఆక్రమించినప్పుడు ఎంత గర్వ పడ్డాడో, నేనూ అంత గర్వపడ్డాను' అన్నారు.

'ఏమోనండీ, నాకు చరిత్ర తెలియదండీ' అన్నాను.

అతడు ఆగలేదు. 'నువ్వు మాట్లాడుతుంటే, జ యలలిత శాసించినట్టుగా ఉంది' అన్నారు.

'ఏమోనండీ, నాకు రాజకీయాలు తెలియవండీ' అన్నాను.

అయినా వదల్లేదు.. 'నువ్వు పాడితే చాలు శ్రేయా ఘోషల్ పాడుతున్నట్టుగా ఉంటుంది' అన్నారు.

దాంతో 'నాకు సంగీతం రాదండీ' అని స్పష్టం చేశాను.

'నువ్వు అడుగుతీసి అడుగు వేస్తుంటే దీపికా పదుకొనే డ్యాన్స్ చేస్తున్నట్టుగా ఉంది' అన్నారు.

చీకట్లో ఆయనకు కనపడకపో యినా ఏడుపు మొహం పెట్టి 'నాకు డ్యాన్స్ అస్సలు రాదండీ' అన్నాను. నా జవాబుల తీరు చూసి ఆయన చిరాకు పడ్డట్టున్నారు. 'కొంపతీసి ఎవరినయినా ప్రేమించావా? ' అని అడిగారు.

'నాకు లెక్కలు రావండీ' అన్నాను. అసలే మొగుడు.. అబద్ధం చెప్పకూడదు కదా! ఆడవా ళ్లకు అగ్నిపరీక్షలు పెడతారని తెలుసుగానీ ఈ భగ్నపరీక్షలేమిటి? అనుకున్నాను. ఆడదానిగా పుట్టడం కన్నా అడవిలో 'మ్యాన్' అయి పుట్టడం మేలు అన్నది ఇందుకేనేమో!

శ్రీవారు దిక్కులు చూసుకుంటున్నట్టు ఉంది. చీకటి కదా నాకేమీ కనిపించలేదు. కళ్లు పొడు చుకున్నట్టు అయినా ఆయన కదలికలు గమని స్తున్నాను. ఆయన పట్టనట్టు ఉన్నారు. నేను నిద్రపట్టనట్టు ఉన్నాను.

చట్టంలాగా గడియారం తనపని తాను చేసు కుంటూ పోతూ ఉంది. అర్ధరాత్రి పన్నెండు, ఒంటిగంట, రెండు గంటలు వరస తప్పకుండా దాటిపోతూ ఉన్నాయి. ఆయన ఆవులింతలు వినిపిస్తున్నాయి. నేను పేగులు లెక్కపెట్టే పనిలో ఉన్నాను. సెగలు పోయాయి. దాని బదులు దిగులు వచ్చింది. తెల్లచీర అలాగే తెల్లగా ఉంది. తెల్లారిపోయింది. వెలుగుల కోసం రేపు చీకటిపడేంతవరకు ఎదురు చూడ్డమేనా? 'వెలుగులోనుంచి చీకటిలోకి నడిపించు దేవా' అని ప్రార్థిస్తున్నాను. మొదటిరాత్రి మరపురాని రాత్రి అంటారు. ఇది నగ్నసత్యమే. ఎంత మర చిపోదామన్నా జీవితాంతం నేను మరచిపోలే నిది, మరచిపోలేనిది!

నా పేరు సుబ్బలక్ష్మి, నన్ను మాత్రం మరచిపోండే!

©




జి.యస్. చలం

# రేవు

నిర్వహణ : వి. రాజారామమోహనరావు

**రచయిత పేరుకి ముందు ఆయన రచన విశేషణంగా చేరడం ఆ రచన ప్రాచుర్యాన్ని తెలుపుతుంది. 'రేవు' నవలారచయిత జి.యస్. చలాన్ని చాలామంది 'రేవు చలం' అని వ్యవహరిస్తుంటారు. 'రేవు' నవల వైశిష్ట్యం ఎంతో ఇదే తెలుపుతోంది. ఈ నవల ప్రథమ ముద్రణ 2000 ఆగస్టులో జరిగింది. ప్రత్యేకంగా ఓ వృత్తికి సంబంధించి తెలుగులో వచ్చిన నవలలు తక్కువ. అలాంటి వాటిలో 'రేవు'ది ప్రత్యేకస్థానం.**

బట్టలు ఉతికి జీవించే రజకుల కథ ఇది. పట్టణాలలో, నగరాలలో రజకుల పరిస్థితికి, గ్రామాల్లో పరిస్థితికి చాలా తేడా వుంది. పట్టణాలు, నగరాల్లో అయితే బట్టలు ఉతికి ఇస్త్రీ చెయ్యటమే వారి పని. గ్రామాల్లో అలా కాదు. మంచికి చెడ్డకీ.. అన్నింటికీ ఇంటి చాకలి ముందుండాలి. అది ఊరు కట్టుబాటు, సంప్రదాయం. రాత్రనక, పగలనక.. ఎండనక, వాననక సంవత్సరమంతా పనిచేస్తే ఏడాదికి ఒకసారి పంటలప్పుడు ఆ చాకలికి ధాన్యం కొలుస్తారు. అదీ ఏదో దయతలచి ఇస్తున్నట్టు ఉంటుంది. అలా వచ్చిన ధాన్యంతో సంవత్సరమంతా బతకాలి. అందులోంచే బట్టలు ఉతకటానికి అవసరమైన చాకలి సోడా లాంటి సరంజామా, ఇస్త్రీకి బొగ్గులు లాంటి అన్నింటికీ పెట్టుబడి చూసుకోవాలి. వెరసి గ్రామాల్లో చాకళ్ళ జీవనస్థితి దీనాతిదీనం.. నిత్యదరిద్రం! దీనికితోడు రకరకాల వెట్టిచాకిరీ అదనం.


రేవు
జి.యస్. చలం

గ్రామాల్లో చాకళ్ళ దుస్థితిని, వాళ్ళు గురవుతున్న రకరకాల దోపిడీతో పాటు బాగా విసిగిపోయిన చాకలివాళ్ల నిరసనని, తిరుగుబాటుని రచయిత జి.ఎస్. చలం ప్రతిభావంతంగా అక్షరీకంచారు. ఎంతో సహజంగా, నిత్యజీవితంలోని సంఘటనల్లాగే ఇవన్నీ సాగిపోతాయి.

కొత్తపల్లి గ్రామంలో ఆదిశెట్టి అనే ఓ చాకలి కుటుంబ గాథగా ఈ నవల ఆరంభమై, ముందుకు సాగుతుంది. మూడు తరాలుగా ఆదిశెట్టి కుటుంబం ఆ గ్రామంలోనే వుంది. ఆ గ్రామ పద్ధతులకి, జీవనరీతికి ఓ రకంగా ఆ కుటుంబం ప్రతినిధి లాంటిది. ఆదిశెట్టి కుటుంబంలో జరిగినవన్నీ, మిగిలిన చాకళ్ళ కుటుంబాలలో జరక్కపోయినా, వ్యక్తుల మనస్తత్వాలలో తేడాలున్నా, జరిగిన సంఘటనల తీవ్రతలో హెచ్చు తగ్గులున్నా.. మొత్తానికి ఆ ఊరి చాకళ్ళ జీవితాల తీరుతెన్నులు ఒక్కటే!

ఆదిశెట్టి కుటుంబ జీవితాన్ని రచయిత చలం ఓ క్రమంలో కథగా చెప్పలేదు. జరిగిన కొన్ని సంఘటనల్ని చెప్పుకుంటూ వచ్చారు.

ఆదిశెట్టి మెతకమనిషి. ఊరి రివాజు ప్రకారం కట్టుబాటుకి, సంప్రదాయానికి లోబడి బతకాలనుకునే వ్యక్తి. ఆదిశెట్టి భార్య అంకమ్మ అలా కాదు. అతనిలా తల వంచే రకం కాదు. ఆమె నోరంటే ఊరివాళ్లందరికీ అదురే. నోరు విప్పిందంటే ఎవరూ ఎదురు నిలవలేరు. తిట్లు మొదలుపెడితే ఎంతటి మనిషయినా అవమానంతో తలొంచుకోవాల్సిందే. కచ్చితంగా సూటిగా మాట్లాడుతుంది. ఈ నవలలో అంకమ్మది ఓ ప్రత్యేక పాత్ర. కోపతాపాలు, అక్కసు, ఆక్రోశాల ప్రతి

## కొత్తగాలి...

**మనస్సాగరంలో**
**ఆలోచనా తరంగాలు**
**అహర్నిశలూ అలజడే**
**నరులంతా నడయాడే సంద్రాలే!**

– మహబూబ్ కమల్,
కాజీపేట, వరంగల్

రూపం. ఈ సహజ సజీవ లక్షణం కొన్ని గొప్ప పాత్రలలోనే కనిపిస్తుంది. పూర్తి దుర్మార్గమో, పూర్తి మంచితనమో మూసపోసిన పాత్ర కాదు. ఆదిసెట్టి కుటుంబానికి, ఊళ్ళో పెద్ద కుటుంబాల వాళ్ళకి మధ్యలో వచ్చిన చాలా తగవులకి ఓ రకంగా అంకమ్మ ఎదిరింపు, నిరసనలే కారణం.

అంకమ్మ నోటి దురుసుతో చాలా తగువులు తలెత్తినా, వాటిల్లోకెల్లా ప్రత్యేకంగా చెప్పాల్సినవి రెండు. చాకలి చెరువులో వేసవికి నీళ్ళు చాలా తగ్గిపోయాయి. బట్టలుతకడానికి నీళ్ళెలాగనే బెంగతో వాళ్ళున్నారు. సరిగ్గా అదే సమయంలో అసిరినాయుడు మోటారు తీసుకొచ్చి చెరువులోని ఆ కాసిని నీళ్ళని తన పొలంలోకి తోడటం మొదలెట్టాడు. అసిరినాయుడు కంబారీవాళ్ళకి, చాకళ్ళకి గొడవైంది. ఓ కంబారీ చెయ్యి చేసుకోటంతో చాకలి నారిసెట్టి ముక్కు పగిలింది. అది చూసిన అంకమ్మ ఆగ్రహోదగ్రురాలయింది. చాకళ్లందరిని ఉద్దేశించి ఉద్రేకంగా మాట్లాడింది. అసిరినాయుడే కాదు, ఏ నాయుడూ మన చెరువు జోలికి రాకుండా ఉండాలంటే మీకొక సంగతి చెబుతాను. మనమివ్వాళ్ల నుండి వాళ్ల గుడ్డలు ఉతకొద్దు. దాంతో మరెవ్వరూ మన చెరువు జోలికి రారు. తప్పని నాయుళ్ళందరు ఒప్పుకున్నంతవరకు వాళ్ల గుడ్డలు ముట్టుకోకూడదు అంది. చాకళ్ళందరూ సరేనన్నారు. అంకమ్మ ఉద్బోధతో చాకళ్ళ సమ్మె ఆరంభమైంది. నాయుళ్ళ ఇళ్ళల్లో బట్టలు మురికి వాసనొచ్చాయి. కక్కలేక మింగలేక చివరికి ఊరి నాయుళ్ళు రాజీకి వచ్చి చాకలి చెరువు జోలికి రామని మాటిచ్చారు.

ఇంక రెండో గొడవ.. ఊరి పెదనాయుడు చచ్చిపోయాడు. ఏడాదిన్నరగా పక్షవాతంతో మంచం మీద తీసుకున్నాడు ఆ పెద్దమనిషి.

పీతి గుడ్డలు ఉతికే పనికి విరామం దొరికింది. పెదనాయుడు దుర్మార్గం అంతా ఇంతా కాదు. ఆయన పోయినందుకు ఎవరూ 'అయ్యో పాపం!' అనలేదు. అంతేకాదు 'దుర్మార్గుడు ఇంకా కొన్నేళ్లు తీసుకు తీసుకు చావాల్సింది. తొందరగా చచ్చాడు' అని శాపనార్థాలు పెట్టారు. పెదనాయుడికన్నా దుర్మార్గుడు అతని కొడుకు. దీనికి తోడు లోభి.. కుళ్ళుబోతు.

పెదనాయుడు చనిపోయిన మంచం ఇంటి చాకలి ఆదిసెట్టికి రావాలి. అది పందిరి మంచం. అన్నాళ్ళు ఆ పెద్దాయన పీతిగుడ్డలన్నీ ఉతికారు. అది చాకలికి ఇవ్వటం అంటే బాధగా అనిపించింది చిననాయుడికి. అందుకని తండ్రి ఆ మంచం మీద పోలేదని, ముందే చాప మీదకి దింపేశామని అబద్ధమాడాడు. అంకమ్మ ఊరుకోలేదు. ఆయన పోయినప్పుడు తను అక్కడే వున్నాననీ, ఇంకా ఎవరెవరు ఉన్నారో సాక్ష్యాధారాలతో నిరూపించింది. 'అంత పెద్దమంచం మీ పాకలో ఎక్కడ పెట్టుకుంటావు? చోటు ఏది?' అన్నాడు నాయుడు. 'నెత్తినెట్టుకుంటా.. నీకెందు' కని నానా రభసా చేసింది అంకమ్మ. నాయుడికి మంచం ఇవ్వక తప్పలేదు. అంత పెద్దమంచాన్ని ఊడగొట్టి, మోపులా చేసి పాకలో పెట్టుకుంది అంకమ్మ. చాకళ్ళు ఏ పద్ధతీ తప్పకూడదు కానీ పెద్దోళ్ళు కుత్సితంగా నడవచ్చు. అలా చెలామణీ కాకూడదన్నదే అంకమ్మ పట్టుదల. ఈ రకం ఘర్షణలే ఇరువర్గాల మధ్యా వైషమ్యాన్ని పెంచాయి.

అంకమ్మకి ఒక కూతురు, ఒక కొడుకు. కొడుకు బూసిగాడు చిన్నవాడు. కూతురు సిమాల్ని తమ్ముడు రామిసెట్టికిచ్చి పెళ్ళిచేసి కూతుర్ని అల్లుణ్ణి తన దగ్గరే పెట్టుకుంది. అక్క అంకమ్మలాగే రామిసెట్టికీ ఆవేశం ఎక్కువే. ఊరు తీరు నచ్చక విశాఖపట్నం వెళ్ళిపోయాడు. వెళ్ళే ముందు అతను అన్న మాటలు 'చాకలాడి పనేంటి? బట్టలుతకటం! అయితే మనం చేస్తున్న పని అదొక్కటేనా? నాయుడోరి ఇళ్ళల్లో చావైనా, పెళ్ళయినా, వాళ్ళ ఆడపిల్ల మూలకూ చున్నా, వాళ్ళకు కడుపొచ్చినా.. కావుళ్ళు మోసుకెడతాం. పెళ్ళికి పల్లకీలు మోస్తాం. వాళ్ళ శవాలు పాతటానికి గోతులు తవ్వుతాం. కాలే శవాల దగ్గర కాపలా వుంటాం. ఇంకా మనిషి చెయ్యకూడని చాకిరీ అంతా చేస్తున్నాం.

సరే, మనం చేస్తున్న పనికి నాయుడోరిచ్చే జీతమెంత? సంవత్సరానికి ముష్టిలాగ ముప్పం

దుం ధాన్యం (ముప్ఫయి కుంచాల ధాన్యం- అంటే సుమారుగా తొంభై కిలోలు) మనం చేసే చాకిరికి ఎంత జీతం రావాలి? వాళ్ళిస్తున్న జీతం ఆళ్ళబట్టలు బాగుచెయ్యటానికి అవసరమయ్యే సబ్బులు, 'నీలిమందు, బొగ్గులులాంటి వాటికే చాలదు' ఇలా రామిశెట్టి చాలా ఆవేశంగా మాట్లాడాడు. అతను చెప్పినదంతా నిజమే అయినా మనం చెయ్యగలిగిందేం లేదన్నట్లు వుండిపోయారు వాళ్ళు. దాంతో విసిగిపోయిన రామిశెట్టి విశాఖపట్నం వెళ్ళిపోయాడు.

విశాఖ చేరిన రామిశెట్టి చాలా బాధలు పడ్డాడు. తెలిసినవారు ఎవరూలేరు. పెద్ద నగరం. అంతా అయోమయం. అదృష్టవశాత్తు రామిశెట్టికి మంగలిషావు సూరి పరిచయం అయ్యాడు. సూరికి రామిశెట్టి మీద ఎంతో జాలి కలిగింది. తనింటికి తీసికెళ్ళి ఆశ్రయం ఇచ్చాడు. ఆ తర్వాత సూరి ద్వారానే రామిశెట్టికి బతుకుతెరువు దొరికింది. ఇస్త్రీ తోపుడు బండిని ఇప్పించాడు. మూడు ఇళ్ళల్లో పొద్దునే బట్టలు ఉతకటం, సాయంత్రం ఇస్త్రీ బండి పెట్టడం. రోజులు గడిచిపోతున్నాయి. కొంచెం స్థిరపడ్డాక ఊర్నించి భార్య సిమాల్ని తీసుకొచ్చి, ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకుని కాపురం పెట్టాడు. సిమాలు రెండిళ్ళల్లో పనిమినిషిగా కుదిరింది.

'పట్నమొచ్చాక తనేమి సంపాదించాడన్నది తరువాత, కానీ ఒకరి కింద బతుకుతున్నాననే బాధ తప్పింది. తన మీద ఒకరి అదుపు అజమాయిషీ లేదు' అని రామిశెట్టి భావనగా రచయిత చలం చెబుతారు.

నగర ప్రభావం ఆ తర్వాత అతని జీవితంలో రకరకాల మార్పులు తీసుకొస్తుంది. కొత్తలో చేతి నిండా డబ్బు ఉన్నట్టు వుంటుంది. వాయిదాల మీద చీరలు, సరుకులు కొంటారు. వస్తు వ్యామోహం పెరుగుతుంది. అప్పులు చేస్తారు. అనారోగ్యాలకి అంతులేని ఖర్చులు. క్రమేపి వడ్డీల ఊబిలో కూరుకుపోతారు. పిల్లల కాన్వెంట్ చదువులు. ఎంత సంపాదించినా శ్రమే తప్ప ఫలితం వుండదు. ఇదంతా మలి అధ్యాయం. దీని జోలికి రచయిత వెళ్ళలేదు. పల్లెలో బతుకు దుర్భరం అనుకున్నవారు పట్నానికి వచ్చేసినంత మాత్రంలో జీవితం స్వర్గంలా మారిపోదు అని చెప్పటానికే ఈ మలి అధ్యాయం ప్రసక్తి.

రామిశెట్టి విశాఖలో ఉండగా కొత్తపల్లి ఊళ్ళో ఓ చిత్రమైన పంచాయితీ జరిగింది. వర్షాలు తరుచుగా పడటం వల్ల, ఎండ రాకపోవటం వల్ల బట్టలు ఆరక చాకళ్లకి నానా యాతనగా ఉంది. ఇంటి నిండా తడిపొడి బట్టలు. దరిద్రపు వాసన ఆదిశెట్టికి కంపం పుట్టిచ్చింది. తెల్లారితే కొంచెం తెరిపిచ్చి, ఎండకాసేలా వుంది. ఆ అవకాశం వదులుకోకూడదు. మర్నాడు బట్టలన్నీ మరో సారి ఉతికేసి ఎండేస్తే భారం తగ్గుతుంది, ముఖ్యంగా నాయుడుగారి బట్టలు. కానీ ఇంట్లో ఒక్క ఎండు కంపా లేదు. అన్నీ వానకి నానిపోయాయి. తెగించి ఆ అర్ధరాత్రి నాయుడిగారి కళ్ళానికి వెళ్ళాడు. కర్రల కుప్పలోంచి నాలుగు ఎండు కర్రలు లాగాడు. ఆ కళ్ళంలో తరచుగా జరుగుతున్న దొంగతనాల వల్ల కాపలా వున్న కంబారి కర్రల అలికిడి విని చేతిలోని దుడ్డుకర్రతో గురి చూసి గట్టిదెబ్బ కొట్టాడు. ఆదిశెట్టి కుప్పకూలిపోయాడు.

మర్నాడు కర్రల దొంగతనం పంచాయితీ పెట్టాడు. ఆదిశెట్టికి దెబ్బ కొంచెం పక్కకి తగలటం వల్ల చచ్చి బతికాడు. నడినెత్తిన అయితే పోయేవాడే! గతంలో జరిగిన దొంగతనాల నేరం కూడా ఆదిశెట్టి మీదే మోపారు. ఆదిశెట్టి ఏం మాట్లాడలేకపోయాడు. అంకమ్మ ఊరుకోలేదు. ఆదిశెట్టి ఎలాంటి వాడో ఊరందరికీ తెలుసంది. నాయుడుగారి బట్టలకోసమే ఆయన కళ్ళంలోని కర్రలు తెచ్చుకోటం దొంగతనమే కాదంది. అలా తెచ్చుకోటం నాయుళ్ళకి తెలియని సంగతి కాదంది. అంతవరకూ నిశ్శబ్దంగా వున్న నాయుడుగారు అకస్మాత్తుగా తన ఉదారత ప్రదర్శించి ఆదిశెట్టిని వదిలేయమన్నాడు. పంచాయితీ పెద్దలు అలాగే చేశారు. నాయుడు ఎత్తు ఎవరికీ తెలియలేదు.

మూడునెలలు గడిచాయి పంటలు చేతికొచ్చాయి. ఆదిశెట్టికి ఇవ్వాల్సిన ధాన్యం నాయుడు ఇవ్వలేదు. అడిగితే ఏవేవో వంకలు చెప్పాడు. నిజానికి అంకమ్మ మీద కోపం. ఎదిరించిందని అక్కసు. చాకళ్ళు కూడా ఎదురు చెప్పేస్థితికి వచ్చారన్న కసి. అంకమ్మ ఊరుకోలేదు. నాయుడిది అన్యాయం అని తెగేసి చెప్పింది. ఎవరూ విని భరించలేనన్ని తిట్లు తిట్టింది. నాయుడు, భార్యా ఇంటిలోపలికి వెళ్ళి తలుపులు మూసుకున్నారు. అంకమ్మ అయినా ఆగలేదు. అమ్మ ఆలి బూతులు మొదలెట్టింది. నాయుడు ఊరుకోలేక అకస్మాత్తుగా తలుపు తెరుచుకు వచ్చి అంకమ్మని చాచి పొట్టలో తన్నాడు. అంకమ్మ విరుచుకు పడిపోయింది.

అత్తగారు అంకమ్మ చావుబతుకుల్లో ఉందని

# మన జీవితాలే కథలకు ప్రేరణ!



అన్ని కథలూ జీవితంలోంచే పుడతాయి. అవన్నీ మానవజీవితంలోనే బతుకుతాయి. 'రేవు' నవల ఇతివృత్తానికి మా స్వగ్రామం విజయనగరం జిల్లా గరుగుబిల్లి మండలం కొత్తపల్లిలో జరిగిన సంఘటనే ప్రేరణ. వృత్తిదారుల జీవితాల్లో రజకులకు ఎంతో పీడన ఉంటుంది. శ్రమదోపిడీతో పాటు మానసికంగా నిత్యం అవమానాలకు గురవుతూంటారు. రజకులు గ్రామాల్లో ఉన్నతవర్గాలతో నిత్యం సంఘర్షిస్తూనే ప్రకృతితో పోరాటం చేస్తుంటారు.

'రేవు' నవల సాధారణ పాఠకవర్గానికంటే రజకులే ఎక్కువమంది చదివి అభినందించారు. ఈ నవల రాసేనాటికి నేటికీ రజకుల్లో చైతన్యం పెరిగింది. ఈ నవల మీద ఆంధ్రా యూనివర్శిటీలో ఎం.ఫిల్. సిద్ధాంతవ్యాసాన్ని సమర్పించారు. 1994 'చతుర' నవలల పోటీకే ఈ నవల ప్రారంభించాను. కానీ సకాలంలో పూర్తిచేయలేకపోయాను. తరువాత ఆరేళ్లకు 'ప్రజాశక్తి' నవలల పోటీలో ద్వితీయస్థానం పొందింది.

కథలు, రేడియో ప్రసంగాలు, నాటకాలు రాశాను. 'కళింగాంధ్ర మాండలిక పదకోశం', రావిశాస్త్రి రచనా విశేషాలతో 'రావి', 'కన్యాశుల్కంలో వాడుక మాటలు' గ్రంథాలు రాశాను. 'ఒక దశాబ్ది నవల.. విస్తరించిన వివిధ కోణాలు' అనే రచనకు 2006 'ఆటా' పోటీల్లో పురస్కారం లభించింది. 'కన్యాశుల్కం' సంపూర్ణ నాటక ప్రదర్శనలో అగ్నిహోత్రావధాన్ల పాత్రపోషణ చేస్తున్నాను. 1966 జనవరి పదోతేదీన కొత్తపల్లిలో పుట్టిన నేను 'ఈటీవీ' రచనా విభాగంలో 1995లో ఉద్యోగజీవితం ఆరంభించాను. ప్రస్తుతం తెలుగు పండితునిగా ఉద్యోగం చేస్తున్నాను.

**– జి.యస్.చలం**

తెలిసి విశాఖ నుంచి సిమాలుతో కలిసివచ్చాడు రామిశెట్టి. తను వెళ్ళింతర్వాత గడిచిన యాడాదిలో ఊరిలో నాయుళ్ళు, చాకళ్ళ మధ్య ఘర్షణ బాగా పెరిగిందని గ్రహించాడు.

అన్యాయాన్ని ఇదివరకటిలా సహించటం లేదనిపించింది. తను వీళ్ళందర్నీ వదిలేసి విశాఖలో తన స్వార్థం చూసుకోవటం కాదు. వాళ్ళతో కలిసి తనూ ఆ ప్రవాహంలో కలవాలని నిర్ణయించుకున్నాడు.

ఇక్కడ రచయిత జి.యస్. చలం 'రేవు' నవలని ముగించారు. నిజానికి ఇది ముగింపు కాదు. ఓస్థాయి వరకూ సాంఘిక పరిణామాన్ని చూపించటం. జీవితమన్నాక.. అందులో ఓ వర్గపు జీవితం అన్నాక మంచి చెడులు రెండూ వుంటాయి.. జరుగుతూ వుంటాయి. అది ఓ ప్రవాహం.. ముగింపు కాదు.

చాకళ్ళ మీద నవల రాయటమే కాదు, వాళ్ల అలవాట్లని, నిత్యజీవితాన్ని, మాటతీరుని, సరదాల్ని, వేళాకోళాల్ని, దుఃఖాల్ని, దిగుళ్ళని, ఇబ్బందులని చక్కగా పట్టుకోగలిగారు రచయిత. మరో విశేషం నవలని 'చలి.. చలి', 'దాహం.. దాహం', 'వానా.. వరదా' అన్న శీర్షికలతో విభజించారు. చాకళ్ళ జీవితానికి, వాతావరణానికి ఎంతో సంబంధం. కాలానుగుణమైన ఈ విభజన ప్రణాళిక శిల్పరీత్యా మెచ్చుకోవాల్సిన అంశం. వర్ణనలలో కూడా ప్రత్యేకత వుంది. వాళ్ళ జీవితాలని వాతావరణంతో పెనవేసిన తీరుతోనే వర్ణనలూ సాగాయి. 'మబ్బుపట్టిన ఆకాశం మాసిన చీరలా వుంది', 'చెరువు అడుగున ఎవరో మంటపెట్టినట్టు నీటిపైన సనసన్నగా మంచు పొగలు లేస్తున్నాయి' ఇలాంటి పోలికలు అద్భుతం.

పై వర్గంవాళ్ల అవకాశవాదం.. చాకళ్ల కింద స్థితి, వాళ్ల చాకిరీ, అవమానభారాన్ని వ్యక్తీకరించడానికి రచయిత ప్రయోగించిన భాష అంటే నిత్యజీవితంలో వినిపించే మాటతీరుని ఈ నవలలో కూర్చిన విధానాన్ని ప్రత్యేకించి ప్రశంసించాలి. రైతులాగే చాకలికీ యాడాదంతా ప్రకృతితో పోరాటమే. అది చాలామంది దృష్టికి రాని అంశం. 'రేవు' దీన్ని విశదంగా చెప్పింది.

'మనం బట్టలు వేస్తాం! వాళ్ళు ఉతికి ఇస్త్రీ చేసి తెస్తారు' అన్న అభిప్రాయం ఆవల వున్న మరోజీవితాన్ని తెలిపే ఈ నవల చదవటం వల్ల వ్యక్తుల మధ్య, వర్గాల మధ్య సామరస్యం పెరుగుతుంది. ప్రజలందరూ ఎదుర్కొనే సమస్యల్ని ఎదుర్కొంటూనే చాకలి అదనంగా, ఎండా వానల విషయంలో ఎంతగా ఆరాటపడతాడో, అవి అతని అంతరంగం మీద ఎంతటి ప్రభావం చూపిస్తాయో నేర్పుగా చిత్రించిన నవల ఇది. ©

# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస
డా. కె. రామానుజాచార్య
సమాధానాలు



ప్ర. అభిషేకం పేరున కుండలకొద్దీ పాలు, తేనె, పెరుగు వగైరా ద్రవ్యాలు దేవునికి సమర్పిస్తారు. మరోపక్క ఎందరో అభాగ్యులు ఆకలి కడుపులతో కూర్చుంటారు. ఇలా విగ్రహాలకు పోస్తేనే పుణ్యమా? ఇదంతా వ్యర్థం కాదా? అసలు ఈ అభిషేకాల పరమార్థం ఏమిటి?

– పక్కి శ్రీదేవి, గంట్యాడ
– పి.వి.ఎన్. ప్రసాద్, తాడేపల్లి
– బోడపాటి కృష్ణవేణి, చెన్నై

జ. మీ దృష్టి దేవుని అభిషేకాల మీదనే ఉందా? ఇద్దరు దంపతులు ఉండటానికి ఒక శ్రీమంతుడు పదమూడు వందల కోట్లతో ఇల్లు కట్టుకున్నాడు. ఇంకో శ్రీమంతుడు వేల కోట్లతో ఆకాశంలో సముద్రాలలో భవనాలు నిర్మిస్తున్నాడు. అవి కనపడటం లేదా? అవి శాస్త్రసమ్మతాలా? ఇది భారతదేశం! వేదాలకు పుట్టినిల్లు! శాస్త్రాలు, పురాణాలు తాండవించిన దేశం. ఆధ్యాత్మికత, వ్యక్తిత్వ వికాసం ప్రధానాలు. శాస్త్రాలు చదవకుండా, తెలియకుండా వేద శాస్త్ర పురాణాలు విధించిన దైవాభిషేకం వ్యర్థమని చాలా సాహసం చేశారు. నిజంగా సార్థకం, సాఫల్యం అంటూ ఏదైనా ఉంటే అది దైవారాధనే! ఆధ్యాత్మిక వికాసమే! మనలో మానవత్వం వెల్లివిరిసిన నాడు ఏ ఒక్క అభాగ్యుడు ఆకలితో అలమటించడు. ఆ మానవత్వ వికాసానికి, దయకు, దాక్షిణ్యానికి ప్రయత్నించండి. వైదిక, దైవిక కర్మలు సమసమాజ సంక్షేమానికి, సమ సమాజ వికాసానికి దోహదపడతాయి. వేదకాలం నుండి పాటిస్తున్న, చేస్తున్న నియమనిష్ఠలు వ్యర్థమని పనికిరావని భావించకండి! మనకు కనపడేవే ఉన్నవి అంటే మనమే ఉండము కదా! పంచామృతాభిషేకం ప్రపంచశాంతికి, సౌభాగ్యానికి, ఆయురారోగ్యాలకు నిదానం.

ప్ర. మరణించిన వారికి పుత్రులు లేనప్పుడు వారి కుమార్తెలు దినకర్మలు చేయవచ్చునా?

– కరణం శివానందరావు, కర్నూలు

జ. వారికి పుత్రులు లేకుంటే అన్నదమ్ముల పుత్రులు, వారు లేకుంటే అన్నదమ్ములు, వారు లేకుంటే చిన్నాన్న, పెదనాన్న పుత్రులు, వారు లేకుంటే పినతండ్రి, మేనమామ, వారు లేకుంటే బిడ్డకొడుకులు, వారు లేకుంటే పురోహితులు, వారు లేకుంటే ఎవరో ఒకరు పితృకర్మలు, శ్రాద్ధాదులు చేయాలి. వేదమంత్రాలు, పురాణశ్లోకాలు, వాటిలోని బీజాక్షరాలు ఉచ్చరించడానికి ఉపనయనం, యజ్ఞోపవీతం, నిత్యసంధ్యావందనం, తర్పణాదులు, ఏకాగ్రమైన మనస్సు, నియమనిష్ఠలు, దృఢమైన దీక్షకఠినత్వం అవసరం. పితృకర్మలు, వైదిక కర్మలు చేసేప్పుడు నాభికి పై భాగం నుండి భుజముల వరకు వస్త్రం ఉండకూడదు. ఉత్తరీయాన్ని నడుముకు కట్టుకుని ఆచరించాలి. కొన్ని సందర్భాలలో అంగవస్త్రం.. అది కూడా మోకాళ్ల పైకి ధరించి, నడుముకు ఒక అంగవస్త్రం ధరించాల్సి ఉంటుంది. ఇలాంటి వాటికి ఆడవారి శరీరస్థితి అంగీకరించదు. అది గాక ఆ కార్యక్రమం చేయవలసిన రోజులలో రుతుక్రమం, గర్భధారణ వంటి శరీర పరిస్థితులు అనుకూలించవు. ఇన్ని కారణాలతో ఆడవారు చేయరాదు అన్నారు.

ప్ర. తమలపాకుల ప్రత్యేకత ఏమిటి? అవి హనుమంతునికి ఎందుకు ప్రీతిపాత్రమయ్యాయి? అలాగే అప్పాలు, వడలను కూడా ఆయన ఎందుకు ఇష్టపడతారు?

– తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్

జ. ఒక్క హనుమంతునికే కాదు సకల దేవ




# చతుర ప్ర.జ.4



ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ఉప న్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణన లోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ - 082

తలకు అవి ప్రీతిపాత్రములే! తమలపాకులు తీగతో ఉంటాయి. తీగ ఒకదాన్ని ఆశ్రయించి పెరుగుతుంది. ఎన్నో తీగలు ఉన్నా తమలపా కులు ఇతర సుగంధ ద్రవ్యాలను తనలో దాచు కొని నోటికి సుగంధాన్ని అందిస్తుంది. సకల ఆహారపదార్థాలను జీర్ణం చేస్తుంది. ఆరోగ్యానికి దివ్యౌషధం. జలుబును, శ్లేష్మాన్ని తగ్గిస్తుంది. ఎప్పుడూ తమలపాకు ఒంటిగా ఏపనీ చేయదు. తమలపాకులు, వాము, తులసి, మిరియాలు, లవంగాలు, యాలకులు, దాల్చినచెక్క, పసుపు కలిపి కషాయం చేసి తాగితే శ్లేష్మ, అజీర్ణ, వాత రోగాలను తగ్గిస్తుంది. కవులకు, గాయకులకు, వక్తలకు తాంబూలం ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తుంది. సత్కారాలలో, సన్మానాలలో, పూజ లలో, దానాలలో తమలపాకులు అవసరం. దక్షిణ ఇవ్వాలన్నా తమలపాకులు కావాలి. తమ లపాకులతో పాటు వక్కలు, పండ్లు ఉండాలి. అంటే తమలపాకు ఒకరిని ఆశ్రయించి తాను పెరిగి తనలో నలుగురిని కలుపుకొని ఇతరులకు ఆనందాన్నిస్తుంది. ఈ గుణాలు గల ప్రతిజీ వుడు పరమాత్మకు, ప్రతిదైవానికీ ఇష్టం. ఇక అప్పాలు, వడలు నూనెలో వేగి మనకు రుచిని, తృప్తిని ఇస్తాయి. నూనె ఉన్నంతవరకే వేగు తాయి. నూనె అయిపోతే మాడుతాయి. రుచి పోతుంది. తాను బాధలను అనుభవించినా పదిమందికీ ఆనందాన్ని కలిగించువారంటే స్వామికే కాదు, సమాజానికి కూడా ఇష్టమే. నూనెను స్నేహం అంటారు. స్నేహం ఉన్నంత వరకే తపిస్తాం.. పరితపిస్తాం. స్నేహం తరిగి పోతే తానూ కాలుతాడు. ఇతరులకూ నచ్చడు. ఈ సత్యాన్నే అప్పాలు, వడలు చెబుతాయి. ఇలాంటి గుణజాలం ఉన్నవారందరూ పరమా త్మకు ఇష్టులే!

ప్ర. కనీవినీ ఎరుగని ఎన్నో జీవులు కొత్తగా కనపడి ఆశ్చర్యచకితుల్ని చేస్తున్నాయి. మరెన్నో జీవులు అంతరించిపోతున్నాయి. ఈ నేపథ్యంలో జీవులు ఎనుబది నాలుగు లక్షలని పూర్వులు ఎలా నిర్ణయించారు?

– బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్

**జ.** మనం కనీవినీ ఎరుగనివి పూర్వులు కన లేదని, వినలేదని, తెలియలేదని అనుకోరాదు. జీవరాశులు ఎనుబది నాలుగు లక్షలు. పాము లు అంటాం. వాటిలో లక్ష భేదాలున్నా పాములే అంటాం. రెండు తలల పాములు, నాలుగు తలల పాములు, రెండు తోకల పాములు, కాటు వేసేవి, నాలుకతో నాకేవి, తోకతో కొట్టేవి, చూపుతో చంపేవి, పాకి చంపేవి ఇవన్నీ పాములే! దందశూకములు, అశీవిషములు, సర్ప ములు, ఫణులు, పడగలపై మణులున్నవి, లేనివి ఇలా చాలా భేదాలున్నాయి. వీటన్నిటినీ ఒక జీవరాశిగానే పరిగణిస్తారు. పశువులలో ఒక గిట్టకలవి, రెండు గిట్టలు కలవి, చీలని గిట్టలు కలవి, ఐదు గోళ్లు కలవి, ఆరు కలవి, నాలుగు కలవి ఇలా చాలా భేదాలున్నాయి. ఆవులు, గేదెలు, గొర్రెలు, మేకలు, గుర్రాలు, ఏనుగులు, లేళ్లు, జింకలు, కోతులు ఇత్యాదివన్నీ పశుజాతులు. ఇక మృగజాతులు వ్యాఘ్ర, భల్లూక, సింహ, శరభాదులు. జీవముగా ఒకటి.. అందులో భేదాలు అనంతాలు. ఈనాడు మనం కనుగొనేవి, కన్నవీ ఆ జాతులలోనివే. అవాంతర భేదాలుగా తెలియాలి.

ప్ర. పరమ పూజ్యులు, భగవత్ సాక్షాత్కారం

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. పంచమి, పంచభూతములు, పంచమ వేదము, పంచతంత్రము, పంచవటి ప్రదేశము.. ఇలా అన్నీ పావనమై అలరారు భారతావనిలో పంచములను మాత్రం సమానులుగా భావించలేకపోవడానికి కారణమేమిటి?

– కె. సుబ్రహ్మణ్యకుమార్, కర్నూలు

జ. విశిష్టాద్వైత సిద్ధాంతంలో ఆళ్వారులుగా ఈనాటికీ అందరితో పూజలందుకునే వారిలో చాలామంది పంచములే! చాలా మతాలలో కులంతో ప్రసక్తి లేకుండా జ్ఞానాధిక్యంతో పూజలందుకునేవారు చాలామంది ఉన్నారు. మహాభక్తుల, మహాజ్ఞానుల చరిత్రలు చదివితే చాలా విషయాలు తెలుస్తాయి. వ్యాసభగవానుడు ఎపుడో దీనికి సమాధానం చెప్పాడు.

శ్వానే వరాహే మహిషే మిత్కణే కుక్కుటే తథా
రక్తం సునిశ్చితం జ్ఞేయం జ్ఞానం తత్ర న నిశ్చితమ్
జ్ఞాన సామ్యేన సామ్యం స్యాత్ జ్ఞేయం సర్వత్ర సర్వదా
రక్తసామ్యం న సామ్యం స్యాత్ జ్ఞాన సామ్యంతు సామ్యకమ్

కుక్కలో, వరాహంలో, దున్నపోతులో, నల్లిలో, కోడిలో ఒకే రక్తముంది. సామ్యం రక్తంతో కాదు. జ్ఞానసామ్యాన్ని చూడాలి. జ్ఞానమున్నవారంతా సమానులే.

పంచ సంఖ్యతో ఉన్నవన్నీ పవిత్రములు కావు. పంచ మహాపాతకాలున్నాయి. పంచ పాప మాంసాలున్నాయి. పంచ ఉగ్ర నరకాలున్నాయి. పంచ ఉగ్ర క్రూరమృగాలున్నాయి. పంచ కల్మష కుండాలున్నాయి.

ప్రతి సంఖ్యతో మంచి చెడులుంటాయి. సంఖ్యతో శుచిత్వం, అశుచిత్వం ఉండదు. సమానత్వానికి జాతి, మతం, కులం, సంఘం వ్యవస్థాపకములు కావు. గుణములు, జ్ఞానం.. ఇవి సమానత్వాన్ని అందచేస్తాయి.

పొందిన త్రిమతాచార్యులు శంకర, మధ్వ, రామానుజులు ఆ పరమాత్మ ఆరాధన విషయంలో భిన్నమత స్థాపనకు కారణాలేమిటి?

– కె. లక్ష్మీనరసింహారావు, విజయవాడ

జ. త్రిమతాచార్యులు ఆరాధన విషయంలో భిన్నమతాలు స్థాపించలేదు. భగవత్స్వరూప స్మరణ విషయంలో భిన్నమార్గాలను అనుసరించారు. బ్రహ్మ తప్ప ఇంకొకటి లేదు. జీవుడు లేడు. జగత్తు లేదు. అంతా బ్రహ్మ ఒక్కటే అనేది అద్వైతం. పరమాత్మ వేరు, జీవాత్మ వేరు, ఇద్దరుంటారనేది ద్వైతం. జీవునితో, ప్రకృతితో కూడిన పరమాత్మ ఒక్కడు అనేది విశిష్టాద్వైతం. ముగ్గురూ మూడూ ఒప్పుకున్నారు. ఒక్కటిలో మూడు చూడాలా? మూటిలో ఒక్కటి చూడాలా? రెంటిలో ఒక్కటి చూడాలా? అనేది మతం. అభిమతం. అది దృష్టిలోని భేదం. ధర్మతత్త్వం ఒక్కటే. కాలానుగుణంగా వారు ఆయా దృష్టులను ఏర్పరచుకున్నారు. తాము నమ్మిన వాటిని ప్రచారం చేశారు. ఇది కూడా భగవదారాధనే!

ప్ర. కలియుగం నాలుగు లక్షల ముప్పయి రెండు వేల సంవత్సరాలు కదా! ఇప్పటికి ఎన్ని సంవత్సరాలు గడిచాయి? అసలు కలియుగం ఎప్పుడు ప్రారంభమయింది?

– తోకల నారాయణరావు, మచిలీపట్నం

జ. కలియుగం ప్రారంభమై ఐదువేల నూరు సంవత్సరాలు దాటింది. ప్రతి పంచాంగంలో ఈ విషయం చాలా స్పష్టంగా ఉంటుంది. ఇది శ్వేత వరాహకల్పంలో వైవస్వత మన్వంతరంలో 28వ కలియుగం. ప్రతి కల్పంలో ఈ గణన ఉంటుంది. బ్రహ్మకు నాలుగు యుగాలు వేయి మార్లు తిరిగితే ఒక పూట. ఆ ఒక పూటలో 14 మంది మనువులు ఉంటారు. ఒక్కొక్క మనువు 71 మహాయుగాలు పరిపాలిస్తాడు. శ్రీకృష్ణపరమాత్మ తన అవతారాన్ని చాలించి వైకుంఠానికి వెళ్లిన నాటినుంచి కలియుగం ప్రారంభమైంది.

ప్ర. బియ్యాన్ని అక్షతలుగా చల్లి ఆశీర్వదించే సంప్రదాయాన్ని వివరించగలరు?

– ఎం. లక్ష్మీనారాయణ, పూడూరు

జ. బియ్యాన్ని శ్రీమహావిష్ణువుగా, పసుపును శ్రీమహాలక్ష్మిగా శాస్త్రం చెబుతుంది. అక్షతలు అంటే ఆది దంపతులు. క్షతం అంటే విడిపోవుట అని అర్థం. అక్షతం అంటే హానిలేనిది, ఎప్పుడూ కలిసి ఉండేది. లక్ష్మీనారాయణులు, పార్వతీపరమేశ్వరులు ఇలా ఆది దంపతులు అక్షతలకు అర్థం. వారి దయతో మనం అన్నివేళలా కలిసి మెలిసి సుఖసంతోషాలతో ఉండాలి! ఉంటాం! అని పరమార్థం. ©

# భామనే.. సత్యభామనే..!





మిస్ ఇండియా యూనివర్స్ టైటిల్‌ను 2012లో గెలుచుకుందామె.. కానీ వయసు తక్కువ కావడంతో అది ఆమెకు దూరమైంది. అయినా నిరాశకు గురి కాలేదు. తాననుకున్న లక్ష్యాన్ని చేరుకోవాలనుకుంది. అలా 2015లో మిస్ దివాగా నిలిచింది. అంతేకాదు, సినిమాల్లోనూ అవకాశాలందుకుంది. 'సింగ్ సాబ్ ది గ్రేట్' బాలీవుడ్ సినిమాతో తెరంగేట్రం చేసింది. అందరి ప్రశంసలూ అందుకున్న ఆ అందాలభామ.. ఊర్వశి రతాలె. ఆమె ఫిట్‌నెస్ మంత్రమేంటో ఆమె మాటల్లోనే..

## సొగసు చూడతరమా...

సాధారణ జీవితాన్ని గడపడానికి ఇష్టపడతా. చర్మసౌందర్య సాధనాల్లో కెమికల్ ఉత్పత్తులు లేకుండా చూసుకుంటా. అదే నా వయసును తక్కువ చేసి చూపిస్తుంది. నీళ్లు ఎక్కువగా తాగుతాను. తాజా కూరగాయలు, పండ్లు తీసుకుంటాను. సరైన ఆహారం, సరిపడ నిద్ర, ఆరోగ్యం.. ఈ మూడూ అందంలో భాగమే. షూటింగ్ లేని సమయాల్లో మేకప్‌కు దూరంగా ఉంటా.

బరువు విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటాను. ఎక్కువ పోషకాలు, తక్కువ కొవ్వు పదార్థాలున్న ఆహారానికే ప్రాధాన్యమిస్తాను.



సమయానికి ఆహారం తీసుకోవడం, వ్యాయామం చేయడమే నా ఫిట్‌నెస్ మంత్రం! ఇవి ఆరోగ్యం, ఫిట్‌నెస్‌లను మెరుగుపరచడమే కాక చక్కని శరీరాకృతిని ఇస్తాయి.

అల్పాహారంలో మూడుగుడ్లు, ఒక గ్లాసు పాలు లేదా పండ్ల రసం తీసుకుంటా. ఎట్టిపరిస్థితుల్లోనూ అల్పాహారం మానను. ఒకవేళ ఆ సమయానికి షూటింగ్ ఉంటే పండ్లు, కూరగాయలు తీసుకుంటాను. మధ్యాహ్న భోజనంలో రెండు లేదా మూడు చపాతీలు. బయటి ఆహారం ఇష్టపడను. రాత్రి భోజనంలో తేలికగా జీర్ణమయ్యే ఆహారం ఉండేట్లు జాగ్రత్త పడతా.

జిమ్, యోగా, డ్యాన్స్, నడక, జాగింగ్ వంటివి నా వ్యాయామంలో భాగం. వారానికి నాలుగుసార్లు జిమ్‌కు వెళ్తాను. వెయిట్‌లిఫ్టింగ్, స్ట్రెచింగ్ వంటి వ్యాయామాలు చేస్తా. ఒక గంట ట్రెడ్‌మిల్‌పై రన్నింగ్ చేస్తా. వారానికి రెండుసార్లు యోగా చేస్తుంటా. జిమ్‌కెళ్లడం కుదరకపోతే ఉదయాన్నే నడక లేదా జాగింగ్ చేస్తా. పనిమీద ఎక్కువగా శ్రద్ధ పెడతాను. నిజానికి అదే పెద్ద వర్కవుట్‌గా భావిస్తాను.

జీవితం సంతోషంగా సాగాలంటే మనం సంతోషంగా ఉండాలి. అది ఆరోగ్యానికి తద్వారా చేస్తున్న పనిమీద ఏకాగ్రతకు దోహదం చేస్తుంది.

సేకరణ : సంధ్యారాణి




# మతిమరుపుకు మందులేదా?

మనమెన్నోసార్లు మొబైల్ని టేబుల్ మీద పెట్టి కూలర్‌మీద వెతుకుతాం. దాన్నయితే మిస్‌డ్ కాల్‌తో కనిపెట్టొచ్చు. కానీ రిస్టువాచీ, కళ్ళ జోడు, చదవాల్సిన పత్రిక, కట్టాల్సిన బిల్లు ఇలా ప్రతిదీ మర్చిపోయి వెతకాల్సొస్తే కాలం వృథా, లేనిపోని టెన్షను. అలసిన శరీరానికి నిద్రలా జరిగిన అంశాలకి మరపు అవసరమే. లేకుంటే బ్రెయిన్‌డ్రైవ్ ఫుల్లై కొన్ని డిలీటౌతాయ్ లేదా టోటల్‌గా కరప్టౌతాయ్. కానీ మితిమీరిన మతిమరపు అల్జీమర్సై ఆల్జీబ్రా లాగే గుండెగాబరా తెప్పిస్తుంది.

2015లో జరిపిన సర్వేలను అనుసరించి ప్రపంచవ్యాప్తంగా నాలుగు కోట్ల ఎనభై లక్షల మంది అల్జీమర్స్‌తో బాధపడ్తున్నారు. 2010లో ఈ వ్యాధితో 5 లక్షలమంది చనిపోయారంటే దీని తీవ్రత అర్థమౌతుంది. సాధారణంగా 65 ఏళ్ళు పైబడినవారికి అల్జీమర్స్ వస్తోంది. పురుషులకంటే స్త్రీలని ఈ వ్యాధి మరింత పీడిస్తోంది. పనిభారం, వత్తిడి అందుక్కారణమని తేలింది. అల్జీమర్స్ అంటే మెమొరీ లాసే కాదు, మేథోశక్తీ తగ్గుతుంది.

మనసు దేనిమీదా నిలవదు. భావాన్ని వ్యక్తం చేసే పదాలు తట్టవు. ఎక్కడికెళ్ళాల్సింది, ఏం చేయాల్సింది గుర్తుండవు. ఏదైనా నేర్చుకోవాలి, సాధించాలి లాంటి ప్రేరణలుండవు. ప్రవర్తన మీద అదుపుండదు. ఆత్మీయుల్ని సైతం మర్చిపోతారు. ఆఖరిదశలో శరీరం కూడా పనిచేయడం మానేస్తుంది.

అల్జీమర్స్ ఎందుకొస్తుందో ఇదమిద్ధమైన కారణం తెలీనప్పటికీ అధికశాతం జీన్స్‌ని బట్టి వస్తుందనేది ఒక అంచనా.

తలకు తగిలిన దెబ్బలు, మెదడుభాగం గట్టిబారడం, నరాలు చిక్కుపడటం, ఇన్‌ఫెక్షన్లు, హార్మోన్ రీప్లేస్‌మెంట్ థెరపీ, వత్తిడి, ఆందోళన, అధిక రక్తపోటు, మితిమీరిన మధుమేహం లాంటి కారణాలతో వచ్చే అవకాశం వుంది. ఈ రుగ్మత వుందని తెలిశాక సిగరెట్లు, ఆల్కహాల్ లాంటివి మానకపోతే మరణానికి చేరువచేస్తాయి. వయసు మళ్ళినవారికి మతిమరపు సహజమని ఉదాసీనం వహించక, దాన్ని అల్జీమర్స్ అవునో కాదో డాక్టర్ని సంప్రదించి నిర్ధారించుకోవడం ఉత్తమం. ప్రస్తుతానికి అల్జీమర్స్ రావచ్చని ముందుగానే హెచ్చరించే నిఖార్సయిన సిగ్నల్ టెస్టు లేనప్పటికీ ఫామిలీ హిస్టరీ, బ్లడ్ టెస్టు, మెడికల్ ఇమేజింగ్, బ్రెయిన్ టిష్యూ పరీక్షలతో వ్యాధి నిర్ధారణ చేసే వీలుంది.

బ్రెయిన్ స్కాన్, స్పైనల్ ట్యాప్ లాంటి పద్ధతులతో ఆరంభదశలోనే గుర్తించవచ్చు. ఈ వ్యాధిగ్రస్తుల్ని కుటుంబసభ్యుల్లో ఎవరో ఒకరు నిరంతరం కనిపెట్టుకుని వుండాల్సివుంటుంది కనుక ఇది వ్యాధిగ్రస్తునికే గాక కుటుంబసభ్యులకూ భారమే.

అల్జీమర్స్‌ను ఎంత త్వరగా గుర్తించగల్గితే చికిత్స అంత సులువౌతుంది. తొలిదశలో తగినంత పని అప్పజెప్పడంద్వారా ఈ వ్యాధిని నివారింపవచ్చును. పునశ్చరణ లాంటి వ్యాయామా

# టెక్ గురూ!

## క్లీన్‌మాస్టర్

గూగుల్ సెర్చ్‌లో ఉన్నపుడు ఏదైనా అవసర మనిపించగానే డౌన్‌లోడ్ చేసేస్తుంటాం. ఆ తర్వాత అవసరాన్ని బట్టి వాటిని వాడతాం లేదంటే ఆ విషయమే మర్చిపోతుంటాం. అవి అలా పేరుకుపోయి మెమొరీ నిండిపోతుంది. అప్పటికి అవసరమైనవేవైనా డౌన్‌లోడ్ చేస్తున్నా, చివరికి ఓ ఫొటో సేవ్ చేయాలన్నా 'మెమొరీ ఫుల్' అనో, 'నో స్పేస్' అనో వస్తుంది. అలాంటి పరిస్థితుల నుండి విముక్తి కలిగేందుకు ఇపుడు క్లీన్ మాస్టర్ యాప్ అందుబాటులోకి వచ్చింది. మెమొరీ మేనేజ్‌మెంటే కాదు, అనేక ఇతర ఫీచర్లు ఇందులో ఇమిడి ఉన్నాయి.




★ యాప్స్, ఇతరత్రాలు ఇన్‌స్టాల్ చేసినపుడు జంక్ ఫైల్స్ క్రియేట్ అవుతుంటాయి. వీటితో మెమొరీ నిండిపోవడంతో అవసరమైనవి డౌన్ లోడ్ చేసుకుంటున్నపుడో, ఫొటోస్ సేవ్ చేస్తున్న పుడో ఖాళీ లేదన్న సంకేతాన్ని చూపుతుంది. అలా కాకుండా అనవసరమైన ఫైళ్లను గుర్తించి వాటంతట అవే డిలీట్ చేసేస్తుంది క్లీన్ మాస్టర్ యాప్.

★ ఫేస్‌బుక్, గ్యాలరీ, కాంటాక్ట్స్, ఎసెమ్మెస్ వంటివాటికి లాక్ చేసుకునే వెసులుబాటు క ల్పిస్తుంది ఈ యాప్.

★ బ్యాటరీ పరిస్థితిని ఎప్పటికపుడు గమ నిస్తూ ఎక్కువ బ్యాటరీని ఉపయోగించుకునే యాప్స్‌ను డీ యాక్టివేట్ చేయొచ్చు.

★ హోమ్ స్క్రీన్‌కు వెళ్లకుండానే ఇతర యాప్స్‌ను యాక్సెస్ చేయొచ్చు.

★ ఇన్‌స్టాల్ చేస్తున్న ప్రతి యాప్‌ను, ఫైళ్లను, ఇమేజెస్‌ను స్కాన్ చేసి వైరస్‌ల నుంచి ఫోన్‌ను కాపాడుతుంది.

★ మన ఆసక్తికి తగినట్లుగా అనవసరం అను కున్న యాప్స్‌ను తొలగిస్తుంది.

★ గేమ్స్ లాంచ్ చేస్తున్నపుడు 30శాతం వేగం పెరుగుతుంది.

---

లతో ఈ రుగ్మత తగ్గే అవకాశం వుంది.

నిత్యం చేయాల్సిన పనులను ఉపేక్షించ కుండా చేసేట్లు చూట్టం కూడా వ్యాయామంలో భాగమే. బిహేవియరల్ థెరపీ, మతిభ్రమణా నికి తగిన చికిత్స అవసరం. అయితే ఈ మందులు మోతాదు మించితే ప్రాణానికే ముప్పట.

బిగ్గరగా పద్యాలు చదవడం, బట్టీపట్టడం లాంటివి కాలం చెల్లిపోయిన అలవాట్లయ్యాయి. నిజానికవి జ్ఞాపకశక్తిని పెంచుతాయి. అందుకే పెద్దలకున్న జ్ఞాపకశక్తి మనకి లేదు. పూర్వం గురువుగారి దగ్గర మాత్రమే తాళపత్ర గ్రంథా లుండేవి. శిష్యులు గురువు ముఖతా విని వల్లెవే సేవారు. ఆ పద్ధతి జ్ఞాపకశక్తిని, మేధస్సునూ వృద్ధిచేస్తుందని, వృద్ధాప్యంలో మతిమరపు సమస్య రాకుండా కాపాడుతుందని నిపుణులు చెప్తున్నారు.

అందుకే కాబోలు మన తాతగార్లు 'పంతొ మ్మిది పంతొమ్మిదులెంతంటే' టక్కున చెప్తారు. మనమో 'రెండు రెళ్ళెంతంటే' నాలుగో ఆరో తేలక కాలిక్యులేటర్ నొక్కుతాం.

మానసిక, శారీరక వ్యాయామం తగినంత వున్నప్పుడు అల్జీమర్స్ వచ్చే అవకాశాలు తక్కువ. ఇక వేళకు తిండి, నిద్ర, పోషకాహారం, జంక్ ఫుడ్డు, మద్యపానాదులకు దూరంగా వుండటం లాంటి జీవనశైలితో ఈ వ్యాధికి చెక్ చెప్పే అవ కాశం వుంది.

మేధస్సును పెంచే పఠనం, ఆటలు, పజిల్స్ పూరణం, సామాజిక సేవ, లలితకళల్లాంటి వ్యాసంగాలతో క్రియాశీలకంగా, చురుగ్గా వుండే వారికి, ధ్యానం చేసేవారికి అల్జీమర్స్ వచ్చే అవ కాశం లేదని పరిశోధనల్లో తేలింది. ఇంత సులు వైన మార్గాలిన్ని వుండగా ఇంకా భయమెందుకు, ఆక్టోపస్‌లా చుట్టుముట్టాలని చూస్తోన్న అల్జీమ ర్స్‌ని ఉపేక్షించక తరిమికొడదాం.

*(ఈ నెల 21 వరల్డ్ అల్జీమర్స్ డే)*

– నాగరత్న

## చతురంగం - 65 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 క | బా | 2 లి | ■ | 3 బా | 4 తు | లు | ■ | 5 వా | 6 క |
| వి | ■ | 7 పి | 8 పీ | లి | కం | ■ | 9 మ | రా | ళం |
| 10 సే | 11 ద | ■ | 12 పా | శు | ■ | 13 అ | మ | ల | కి |
| 14 న | ష్ట | 15 ము | ■ | 16 డు | 17 మ | ల్లు | ■ | బ్బి | ■ |
| ■ | ■ | 18 ద్రా | 19 వా | ■ | 20 తే | డా | లు | ■ | 21 న |
| 22 ఉ | ష్ణ | ప | మా | కం | ■ | మ | ■ | 23 సా | లు |
| ద | ■ | 24 కు | క్షి | ■ | 25 అ | జా | మీ | ళు | డు |
| 26 రం | 27 గు | లు | ■ | 28 మా | లి | కా | ■ | వ | ■ |
| ■ | ర్రా | ■ | 29 వా | తా | పి | ■ | 30 భ | వం | 31 తి |
| 32 మ | లు | పు | లు | ■ | 33 రి | క్షా | ■ | 34 శం | కు |

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**చిల్లర సీతారామారావు**

5-5-1147,
సాయినాథ్‌కాలనీ,
వనస్థలిపురం, హైదరాబాద్
పిన్ : 500 070

## సరైన సమాధానాలు రాసిన వారు

1. ఎస్. శివసుబ్రమణ్యం పిళ్లై, తిరుపతి, 2. యు.యు.యు. ఎమ్మిగనూరు, 3. పి. శుభ, బంజారా హిల్స్, 4. జి. శోభ, తిరుపతి, 5. యం. తులసీకుమార్, యేర్పేడు, చిత్తూరు జిల్లా, 6. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 7. డా. కె. శివభూషణమ్, కర్నూలు, 8. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 9. కస్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 10. బచ్చు రోహిత్ సత్య, కొత్తగూడెం, 11. పుల్లాపంతుల వెంకట సుబ్బారావు, భీమవరం, 12. కొత్తపల్లి స్వరలయ, చీరాల, 13. యం. నర్సింహులు, వికారాబాద్, 14. గోశికే లింగయ్యగారి వేంకటేశం, చిక్కడపల్లి, 15. చిట్యాల శంకరయ్య, వికారాబాద్, 16. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 17. డా. మునిగోటి సుందరరామశర్మ, మదనపల్లె, 18. కె. మహేశ్, మోపూర్, నెల్లూరు జిల్లా, 19. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 20. అడపా సత్యనారాయణ బాబ్జీ, హైదరాబాద్, 21. ఎ. పూర్ణచంద్రరావు, విశాఖ, 22. చక్రవర్తి మధుసూదనరావు, వికారాబాద్, 23. లింగబత్తుల భవ్యశ్రీ, ముప్పారం, వరంగల్ జిల్లా, 24. అక్షింతల సంజీవశర్మ, అనంతపురం, 25. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 26. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 27. చింతలపాటి శివశంకరశాస్త్రి, రామచంద్రాపురం, 28. నార్నే చంద్రబాబునాయుడు, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 29. అనుముల బదరీనారాయణ, కడప, 30. గుడ్లూరి బలరామశాస్త్రి, మల్లాపూర్, రంగారెడ్డి జిల్లా, 31. గానుగపాటి సరోజినీదేవి, మల్లాపూర్, 32. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 33. యు. జాన్సీలక్ష్మి, న్యూ పాల్వంచ, 34. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 35. ఎం. అరుణరేఖ, ఎల్.బి. నగర్, 36. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 37. గరికిపాటి ఇందిరాతుషార, కాకినాడ, 38. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 39. ఎం.పి. రమేశ్‌కుమార్, కొడిమ్యాల, కరీంనగర్ జిల్లా, 40. సముద్రాల సంతోష్‌కుమారాచార్య, కొడిమ్యాల, 41. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, హైదరాబాద్, 42. కూనపరెడ్డి సత్యనారాయణ, పెనుగొండ, ప.గో. జిల్లా, 43. మండ సూర్యకుమారి, అరసవల్లి, 44. నేమాన సుభాష్‌చంద్రబోస్, వైజాగ్, 45. ఆర్.వి. సి హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 46. ఆర్. సత్యకృష్ణకుమారి, నొయిడా, ఉత్తరప్రదేశ్, 47. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 48. పి.బి. సీతాదేవి, నరసాపురం, 49. యు.ఎన్. మూర్తి, లాలాపేట, 50. ధరణికోట శివరాంప్రసాద్, బోరబండ, 51. పప్పు శ్రీదేవి, అమలాపురం, 52. సూరి నాగరాజు, బెంగళూరు, 53. ఆంద్ర రామలక్ష్మి, తణుకు, 54. కాకర్లమూడి బాలకృష్ణప్రసాదు, తణుకు, 55. నియాజ్ అలి, హైదర్‌గూడ, 56. గరికిపాటి కృష్ణమూర్తి కడప, 57. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 58. దేవళ్రాజు వెంకటనరసింహారావు, *(..128లో)*

చిటికెలో రుచిగా..!

# వెజిటబుల్ రైస్

**కావలసిన పదార్థాలు**

బాస్మతి/సాధారణ బియ్యం - 1 కప్పు
ఉల్లిగడ్డలు - 2
తురిమిన అల్లం - 1 టీస్పూను
పచ్చిమిర్చి - 2 లేదా కారం- 1 టీస్పూను
కూరగాయ ముక్కలు - 1 కప్పు(బీన్స్, క్యారెట్, ఆలు, బఠానీ)
పుదీన ఆకులు - పిడికెడు
కొత్తిమీర - కొద్దిగా
నిమ్మరసం - 1 టేబుల్‌స్పూను
నూనె - 1 టేబుల్‌స్పూను
దాల్చినచెక్క - అంగుళం ముక్క
లవంగాలు - 2
యాలకులు - 1
ఉప్పు - తగినంత

**తయారుచేయు విధానం**

ముందుగా బియ్యం కడిగి పదిహేను నిమిషాల పాటు నానబెట్టి, నీళ్లు వంపి పక్కన పెట్టుకోవాలి. కూరగాయలను తరిగిపెట్టుకోవాలి. పాన్‌లో నూనె పోసి కాగాక దాల్చినచెక్క, యాలకులు, లవంగాలు వేయాలి. కొద్దిగా వేగాక ఉల్లిపాయ ముక్కలు, పచ్చిమిర్చి, అల్లం తురుము కూడా వేయాలి. ఉల్లిపాయ ముక్కలు వేగాక కూరగాయ ముక్కలు, పుదీనా, కొత్తిమీర వేసి కలపాలి. రెండు నిమిషాల తర్వాత బియ్యం, రెండుకప్పుల వేడినీళ్లు, నిమ్మరసం, ఉప్పు వేసి కలపాలి. నీళ్లు మరుగుతున్నపుడు సన్నని మంట మీద మూత పెట్టి అన్నం అయ్యేవరకు ఉడకనివ్వాలి. అంతే వెజిటబుల్ రైస్ రెడీ! రైతా లేదా ఏదైనా చెట్నీతో తింటే రుచిగా ఉంటుంది.

# చిట్కాలక్ష్మి



* ఫొటోలను పోస్టు ద్వారా పంపవలసి వస్తే కవరులో పెట్టే ముందు ఫొటోలపై కాస్త టాల్కమ్ పౌడరు చల్లడం వల్ల ఒకదానికొకటి అతుక్కుపోవు.
* స్టెయిన్‌లెస్ స్టీలు సింకులు తళతళ మెరుస్తూ ఉండాలంటే కాస్త బేకింగ్ సోడాను ముద్దలా చేసి దాంతో సింకును రుద్దాలి.
* గర్భిణులు కోడిగుడ్లు కానీ, కొబ్బరి కానీ వాడకుండా ఉంటే పుట్టే పిల్లలకు జుట్టు బాగా ఉంటుంది.

# గోధుమ లడ్డూ

## కావలసిన పదార్థాలు

| | |
|---|---|
| గోధుమపిండి | - 1 కప్పు |
| ఎండుఅల్లం పొడి | - 1/4 కప్పు |
| బెల్లం | - 3/4 కప్పు |
| కొబ్బరి తురుము | - 1/2 కప్పు |
| డ్రై ఫ్రూట్స్ | - 1/2 కప్పు |
| నెయ్యి | - 1/3 |

## తయారుచేయు విధానం

పాన్‌లో నెయ్యి వేసి గోధుమ పిండి, అల్లంపొడి, కొబ్బరిపొడి విడివిడిగా వేయించి ఒక గిన్నెలో వేసుకోవాలి. అదే పాన్‌లో బెల్లం కరిగే వరకు వేడి చేసి పిండిలో కలపాలి. బాదం, జీడిపప్పులు చిన్నచిన్న పలుకులు చేసి, దానిలో వేసి బాగా కలిపి, కొద్దిగా వేడి తగ్గాక కావలసిన సైజులో లడ్డూలు కట్టుకోవాలి. గాలి చొరబడని డబ్బాలో పెడితే రెండు మూడు నెలల వరకు నిల్వ ఉంటాయి.



# చతురంగం - 66 ఆధారాలు

## అడ్డం

1. పౌర్ణమికి వికృతి రూపం (3)
3. ఇటీవల వచ్చిన త్రివిక్రమ్ సినిమా (2)
4. బోయ జంగయ్యకు పేరుతెచ్చిన నవల (3)
6. ఆలోచన (3)
7. గూఢచారి (2)
8. బట్ట, వలువ, (3)
10. అందము, ఆకారము (3)
12. ప్రాణము గలది (2)
13. 'అగుగాక!' కు సంస్కృత పదం అటునుంచి (2)
14. నాటు తుపాకి (3)
15. పెద్ద భేరీ (2)
16. అల్లు అర్జున్ సినిమా.. దేశ- - - (3)
18. పద్ధతి, విధానం, స్వభావం (2)
20. దేశవాళీ క్రికెట్‌లో ప్రసిద్ధమైన ట్రోఫీ (2)
23. నీళ్లు కాచుకునే పాత్రలు (3)
25. వర్షం (2)
26. ఒట్టు లాంటిదే (3)
28. పాకిస్థాన్‌లో ఓ ప్రధాన పట్టణం (3)
30. శ్మశానం (2)
31. భవిష్యత్తు (2)
32. స్నానానికి ముందు పసివాళ్ల ఒంటికి పట్టించేది (3)
33. తెలుగు 'నిబ్', ప్రాచీన భాష (2)
35. పొలాల్లో పనికిరాని మొక్కలు, 'మిక్స్' చేయడం (3)
37. మా చేత (2)
39. ఎవరి అందచందాలు చూసి అగ్నిదేవుడు కామంతో దహించుకు పోయాడు (5)
39. లక్ష్మి .. సరస్వతి .. పార్వతులు ముగ్గురినీ కలిపి ఇలా అంటారు (4)

## నిలువు

1. ఆర్కియాలజీ శాఖ తెలుగులో (4)
2. తక్కువ.. హద్దు (3)
3. చాలా సున్నితం, అరుదైన (4)
4. ఆలస్యం (2)
5. అందమైన స్త్రీ (3)
7. తినగ తినగ - - తియ్యనుండు (2)
9. ఆయుధం గజిబిజి (3)
11. చిల్లర కొట్టును - - - కొట్టు అని కూడా అంటారు (3)
12. ప్రహరీ (3)
14. కోయడం, తగ్గిపోవడం (3)
17. తెలుగు షాపు (3)
19. నేలమీద పరిచేది, చాపలాంటిదే (3)
21. మనిషిని వేదాంత పరిభాషలో ఇలా అంటారు (3)
22. దేవుడి మేలుకొలుపును ఇలా వ్యవహరిస్తారు (5)
24. పార్టీల్లో, సంస్థల్లో, కుటుంబాల్లో లోపాలు, తడబాట్లు, పురుగులు తొలిచే ధ్వనికి అనుకరణ ధ్వనులు (3)
27. 'నావి'కి బహువచనం (2)
29. ఒకరకం తృణధాన్యం (3)
30. రామకృష్ణ పరమహంస ఇష్టదైవం (4)
34. పాలగుమ్మి పద్మరాజు పొట్టిపేరు (2)
36. కూతురు (2)
38. పొలాలు (2)

*(125వ పేజీ తరువాయి...)*

చైతన్యపురి, 59. ఎ.వి. శివారెడ్డి, యర్రగుంట్ల, 60. పక్కి శ్రీదేవి, గంట్యాడ, విజయనగరం జిల్లా, 61. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 62. ఎస్. జయరామ్ మోహన్, నిజామ్‌పేట, హైదరాబాద్, 63. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 64. గుర్రపు పురుషోత్తము, హన్మకొండ, 65. పి. సురేఖ, హన్మకొండ, 66. పి.సి. అలేయమ్మ, హన్మకొండ, 67. సాలగ్రామం నారాయణరావు, నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా, 68. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 69. కోలా సత్యనారాయణ, విశాఖపట్నం, 70. యస్. ఆర్.కె. మూర్తి, విజయవాడ.

# చతురంగం - 66

**రూ.150/- బహుమతి** | **గడువు తేది : సెప్టెంబరు 17**

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | | 4 | | 5 |
| | | 6 | | | | 7 | | | |
| 8 | 9 | | | 10 | 11 | | | 12 | |
| 13 | | | 14 | పం | | | 15 | | |
| | 16 | 17 | | | 18 | 19 | | 20 | 21 జీ |
| 22 | | 23 | | 24 | | 25 | | | |
| 26 | 27 | | | 28 | 29 | చీ | | 30 | |
| 31 | | | 32 | | | | 33 | | |
| | | 34 | | 35 | | 36 | | 37 | 38 |
| 39 | | | | | | 40 త్రి | | | |

పంపినవారి పేరు: ------------------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------------

--------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ----------------

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబు [...] రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంప[...]చ్చు ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు

[...]ామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# హిందీ కథల ప్రత్యేకం సెప్టెంబరు సంచిక!

* ఆ ముసలాడి మాటలకు ఆమె నవనాడులూ కుంగిపోయాయి. తాను చేసిన తప్పు అతడ్ని ఏ స్థితిలోకి నెట్టిందో అర్థమై ఆమె హృదయం ద్రవించింది. కానీ అతడికి తానెవరో చెప్పలేదు. కారణం? చదవండి **హీరావల్లభ్ తివారి** **తీర్థయాత్ర**
* ఆమె జీవితానికి ఆలంబనగా నిలవాల్సిన తల్లీ, తండ్రీ ఇద్దరూ పోయారు. కన్నతల్లే జ్ఞాపకంగా మారిపోయిన వేళ.. ఆమెతో పంచుకున్న జ్ఞాపకాలెలా చెంతకొస్తాయి? ఆ దురదృష్టకర సమయంలో ఆమె పెద్దమ్మ ఏం చేసింది? **సూర్యబాల** **నేను-మా పెద్దమ్మ**
* పుణ్యాన్ని ముడుపుకట్టే ప్రయత్నం చేస్తారు కొందరు. కానీ ఆ ప్రయత్నం అభాగ్యుల పాలిట శాపమైతే మనం ఎవరి పక్షం నిలవాలి? అని ప్రశ్నిస్తోన్న **అంజు ఉబానా** **మనమెటువైపు?**
* సుఖియా గుర్తు రాగానే అతని శరీరం పులకరించింది. వడివడిగా ఇంటివైపు అడుగులు వేసేవాడల్లా వానరాకతో ఓ గుడిలో తలదాచుకున్నాడు. అట్నుంచి ఇంటికి వెళ్లాల్సిన వాడు తిరిగి రై స్టేషన్‌కు చేరుకున్నాడు. ఎందుకు? **భగవతీ చరణ్‌వ** **నరకం**




**విపుల**

* ఆమె ఓ పెద్దింటికి ఆడపడుచు. మరో పెద్దింటి కోడలు. కానీ అనివార్య పరిస్థితుల్లో తమ దగ్గర పనిచే డ్రైవర్‌తో పారిపోవాల్సి వచ్చింది. కూతురి పెళ్లి దొంగ టుగా చూడాల్సి వచ్చింది. ఆఖరికి అదే ప్రాణమ్మీదకు తీసుకొచ్చింది. అసలామె ఎవరు? ఆమె కథేంటి? చదవండి **కథకుల ఫైల్‌లో** **అచ్యుతరామరాజు** **కసి**
* కలల రంగు, రుచి, చిక్కదనం తెలియాలంటే చదవండి **రింగరింగారింగరింగారే!**
* నవ్వడానికి రెడీ అయిపోండి ఎందుకంటే ఇది **పేరడీ బీరెడీ!** ఇంకా.. మరెన్నో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Ranga Reddy District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D. -569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Vi am: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 27344 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# ప్రేమ ఫలించిందా..?

**చతుర అక్టోబరు నెల కానుక**



**త**మ ఇంట్లో వుండి చదువుకుంటున్న శ్రీరామ్ కలకత్తాలో దూరపుబంధువులింటికి వెళ్ళిపోతున్నాడని తెలిసి నిర్ఘాంతపోయింది గౌతమి. అతడంటే ఆమెకి ప్రాణం. అర్థాంతరంగా వెళ్ళిపోవడమేంటి? ఎన్నడూ వినని ఈ కొత్తచుట్టాలెక్కణ్ణించి వచ్చారని తపిస్తూ తామెప్పుడూ కబుర్లు కలబోసుకునే సంపెంగచెట్టు దగ్గరికి రమ్మని పిలిచింది.

"కనీసం నాతో చెప్పకుండానే వెళ్ళిపోతావా?" అడిగింది బాధగా.

శ్రీరామ్ బదులేం చెప్పకుండా గౌతమిని గాఢంగా ముద్దుపెట్టుకుని కౌగిలించుకోబోయాడు.

అందాకా అతని కోసం బెంగపడిన ఆమె అతని చేష్టకి భయపడి ఈడ్చిపెట్టికొట్టింది.

తన కొండంత ప్రేమను ఓ చిరుముద్దుతో తెలియజేద్దామనుకున్న శ్రీరామ్, సిగ్గుతో తలొంచుకు వెళ్ళిపోయాడు.

'నిన్నెక్కడో శిఖరాన నిలిపితే నువ్వు ఇంతేనా?' అంటూ దుఃఖించిందామె.

ఇంతకీ వాళ్ళ ప్రేమ ఫలించిందా? గౌతమిపట్ల అణువణువూ ప్రేమ నింపుకున్న శ్రీరామ్ ఆమెనొదిలి వెళ్ళగలిగాడా? యువతీయువకుల మధ్య ఏర్పడే ప్రేమను అందంగా [illegible] రూపంగా అక్షరబద్ధం చేసిన **మణి వడ్లమాని** నవల

**జీవితం [illegible]మోహం**

## బోనస్‌గా...

* **నవలావలోకనం**లో..తరాలు మారుతున్న తరుణంలో మధ్యతరగతి జీవితంలో చోటుచేసుకున్న పరిణామాల దుష్ఫలితాలను పలుకోణాల్లో ప్రతిభావంతంగా అక్షరీకరించిన **తులసీకృష్ణ నత్తగుల్లలు**పై సమీక్ష!

